


సంపుటం. ౧౭ విక్రమ, అశ్వయుజమాసము (అక్టోబరు 1940) సంఖ్య. ౧౦

# మహాత్ముడు

శ్రీ కందుకూరి రామభద్రరావు

రక్తసిక్తప్రపంచసామ్రాజ్యమందు
శాంతికలశముతో నహింసాపయస్సు
అడుగడుగు పంచుకొనుచు మహాత్ముడొకడు
ప్రాగ్దిశాంగణభూముల బయలుదేరె.

బ్రహ్మతేజోవిభాస్వరఫాలమందు
ప్రతిఫలించు వినిర్మలాంబరప్రశాంతి ;
తరళదరహాసచంద్రికాధవళకాంతి
కంతరంగాన ప్రేమదుగ్ధాబ్ధి పొంగు.

అతడు మెట్టినమేర పుణ్యాశ్రమంబు
అతనివాక్కులు వేదభాష్యాంతరములు
అతనిమానము లోకభయంకరమ్ము
అతడు పూనినదీక్ష బ్రహ్మాండరక్ష.

భరతస్వాతంత్ర్యమందిరాభ్యంతరమున
సత్యదేవత తనకు సాక్షాత్కరింప
పసుపుకుంకుమ లద్దిన వడుకునూలు
పాణిబంధము ధరియించె పరమహాని.

అంత తొలుకారుమెరపులే యంతరిక్ష
మంత మంగళతోరణ మందగించె
అణువణువుగూడ పులకించి అవని యెల్ల
మురిపెములు గుల్కుశాద్వలాంబరముదాల్చె.

ఆలమందల లేగలు పాలనురువు
సెలవులం జార ద్రొక్కాడుచిందుతోడ
వడిగ దిరిగెడు రాటాల విడును పాట,
పల్లెపడుచుల సిగపూల పసుపుతేట.

జీర్ణ పర్ణకుటీర సంకీర్ణ దేశ
చిరనివాసిని దారిద్ర్యశిథిలవాణి
గగనవాణిగ మార్మ్రోగి కడలకడల
అతని సందర్శనోత్సాహ మావహించి.

పేదగుండెల నెత్తురు పీల్చిపీల్చి
మారణాగ్నుల నమియు నున్మత్తభయద
యంత్రభూతము లాక్రందనార్తి కదలె
అతనియడుగుల సవ్వడి కడలిపోయి.

సాట్టహాసకోలాహలస్వనులు నిండు
మృత్యుకింకర బీభత్సమేళనములె
నవ్యజీవితనాట్యవిన్యాసరంగ
మంగళోత్సవ వైభవమంటపములు.

ఎరుకగల పురంధ్రులు హారతెత్తి నిలిచి
జీవకళికానహస్రంబు, చిందుహృదయ
పుటకవోష్ణశోణితలాక్ష పూసినార
లతనియుపదేశలక్ష్మిపదాబ్జయుగళి.

* * * *

శ్రీ చుక్కబొల్ల సత్యనారాయణమూర్తి

కట్టుకొన్నది యంగవస్త్రము
పట్టుకొన్నది రాట్నచక్రము
పట్టు మన పదిమెతుకు లైనా
పట్టకుండు కృశోదరముగల
గాంధికంటెను సామ్యవాదులు గలరె
లోకములో.

ధనము తృణముగ దలచిమెలగుచు
మనమునం దైచ్ఛికదరిద్రము
ననుభవించుచు దేశసేవకు
తను వొసంగిన ఘనచరిత్రుడు
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

మరచిపోయిన త్యాగమును సో
దరుల కాచరణీయ మొనరిచి
స్వారాజ్యపథమునందు నడపెను
భరతమాతృ సుతప్రవరు డగు
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

రక్తపాత మొకింత లేక స్వ
శక్తినే బలి నొసగుభారత
భక్తులను కోట్లుగ సృజించిన
యుక్తిమంతుడు శక్తిమంతుడు
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

ఎవరు తప్పొనరించియుండిన
నేమియును పల్లెత్తి పలుకడు
ఎవరిలోపము లున్న తానే
యాతనలపాలై కృశించును
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

అర్థహీనపు మాటలాడడు
వ్యర్థముగ కాలంబు గడపడు
స్వార్థ మన నేమో యెరుంగడు
నిర్ధనులలో నిర్ధనుం డగు
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

కార్మికులకే, కర్షకులకే
వర్తకులకే, భూపతులకే
వర్గపతిగా వ్యవహరింపడు
వరుస ముప్పదియైదుకోటుల
భారతీయుల ప్రాణ మాతడు
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

దేశమే తన శరీరం బని
దేశహితమే తనకు హిత మని
లేశమైనను భేద మెంచని
భాసురచరిత్రుడు మహాత్మా
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో



శ్రీ గాంధి మహాత్ముడు

సహనశీలము గన నపారము
మోయునదియా! దేశభారము
విశ్వ మంతయు శాంతి బడయగ
నహింసా సత్యప్రచారము
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

మలగిపోయిన పురుషకారము
కలగిపోవు మతప్రభావము
నిలువబెట్టగ దలచి భరత జ
నులను నడపెడి నాయకాగ్రణి
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

భూషణములకు తోష మందడు
దూషణములకు రోష మందడు
దోషచయమును కప్పిపుచ్చడు
ద్వేష మందడు శత్రువులపై
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

అన్నిటికి దా వెలిగ నుండును
అన్నిటను దా గలసియుండును
అన్నివిధముల మిన్నయనదగు
సన్నుతచరిత్రుడు మహాత్మా
గాంధికంటెను సామ్యవాదులు కలరె లో.

* * * *

## శ్రీ దుగ్గిరాల వేంకటకృష్ణమూర్తి

పొందగు తల్లినోముల యపూర్వమహత్వమొ! తండ్రి శ్రీకరం
చందుతపఃఫలంబొ! మఱి జన్మకు స్థానమునై చెలంగు పో
ర్బందరుపట్టణంబు తొలిబామునఁ జేసిన పుణ్యమేమొ! పొ
ల్పొందగ నుద్భవించితివి లోకవశీకర! గాంధిధీవరా!

మోహనదాస! నీయశ మమోఘము, పాత్యవరమ్ము నీ జగ
న్మోహనసచ్చరిత్ర, కవిమోక్షము గోరెడివారి కెల్ల నీ
"మోహన" యక్షరత్రయము ముక్తియొసంగెడుమంత్రమయ్యె! నా
లో హితమార నిన్ దలతు లోకవశీకర! గాంధిధీవరా!

తాలిమితోఁ బ్రసక్తి, జగదంబయెడన్ గడుభక్తి, సత్యవా
గ్జాలమునందు రక్తి, నిజగణ్యతయందు విరక్తి గల్గి భూ
పాలురకన్న మిన్నవయి భాసిలి బాల్య వయస్సునన్ బ్రజా
లోలుఁడ వైతి విద్ధరను లోకవశీకర! గాంధిధీవరా!

పూనిన కార్యమున్ విడక పూ మనోగతదృష్టిచేత న
న్యూనత సొంపుపెంపు కడు నొప్పఁగ విద్యను రాజకోటసం
స్థానమునందు నేర్చితివి; తావకకీర్తి నుతించుశక్తి నా
లో నన లెత్త నిన్ దలఁతు లోకవశీకర! గాంధిధీవరా!



# సింహగిరి

శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు

అది తెలుంగువారి కానందకాననం
వేడు నేడు వచ్చు సిద్ధజనము
'ఆంధ్రభోజు' చరిత నది ప్రసిద్ధము ముక్తి
సాధకంబు సింహభూధరంబు.

ఒక్కగిరి మాధవస్వామి యొప్పుచుండు
నొకట శ్రీనృసింహేశ్వరుం డొనరియుండు
ఒక్క దేవుండు దీర్ఘాయు వొసగి మనుచు
నొక్క దేవుడు శ్రేయస్సు లొందజేయు.

శైశవమ్మున స్వామిదర్శనము గలిగె
కాని యానాటి తైర్థికకాంక్ష వేరు
చరితలందున మాత్రము చదువదగిన
నేటి విషయసంశోధనానికతి వేరు.

ఒక్కొకయాలయంబున క
  టోయి! యిటుల్ పెదజల్లినారలీ
రొక్కము లెల్ల గవ్వలటు
  లున్ నృపసత్తములార! భక్తియే
చిక్కనిరక్తరూపమును
  జెంది స్రవించియు నుండబోలు మీ
చక్కని దేహజాలముల
  చాలదె మా కిది గర్వమందగన్!

చెండాడె నిటనుండు దండిశత్రుల నెల్ల
  అరివీరమాన ప్రాణాపహర్త
నాటించినాడుగా మేటికంబము నిందు
  దిగ్దిగంతవ్యాప్త దివ్యకీర్తి
చెక్కించె నిజజయశ్రీవిలాసము నిట
  విజయలక్ష్మీమనఃప్రియదమూర్తి
సేవించె భక్తిమై శ్రీవరాహనృసింహు
  ఘనవిష్ణుచిత్తీయకావ్యకర్త

అనుచు జదివితి చరితల నంతెగాని
కనులపండుగ యగునట్లు గాంచలేదు
నేటి కది లభించె ననెడిమాట కాని
పూర్ణమును గాదు కొన్నింట జీర్ణమగుట!

పగతేన్గత్తుల దట్టఘట్టనలకున్
  బొల్పడ్డ యాశిల్పముల్
నగమై, తునకలునై, స్వరూపహతమై
  సంపూర్ణజీర్ణంబులై
సొగసుం జక్కదనంబు వోని జిగిమై
  చూపట్టు నోరోర! యెం
తగ సాధించిరి శిల్పకావ్యరచనా
  నైపుణ్య మీయాంధ్రులున్.

ఈనాటిదా యిది యేనాటికట్టడం
  బెటు నిల్చియుండెనో యింతదనుక
తాతముత్తాతలు తరతరంబులవార
  లిట నేమి గల దంచు నేగువారు
వీరచిత్రావళి విలిఖించి రిం దేల
  యేపారముం జెప్పి చూపుకొరకు
ఈస్థలం బిటు లేల నింతపవిత్రంబు
  అందుగలట్టి మహత్త్వ మేమి
నాటి హైందవశిల్పులపాటవంబొ
కొండదేవుని గనుగొన కోర్కె నొక్క
తెలుగుబిడ్డకు రణవిద్య తెలుపుకొరకొ
అడుగు నిడినంత పాపంబు లడపగలదొ!

అది యత్రిం బనిపించె తొల్దొలుతగా
  నావృద్ధు "డీనాటి ది
య్యది, మర్త్యక్రియ గాదు, దైవకృత మ
  య్యా! పోయి గన్గొందు మీ

రు దదీయాంశము లెల్ల స్పష్ట మగు ప
ల్కుల్ వేయు నే లన్న"—నె
మ్మదికిన్ సత్యము దోచె చూడ ఘన ని
ర్మాణక్రియాచాతురుల్.

నవనాట్యంబులు నానావక్రమములున్
నానావనీపాలపై
భవమార్గంబులు: పెక్కు లేల, రచనా
వైదుష్య మేపార మా
నవజీవక్రియ లెల్ల నిండునను సం
ధానించినా ర్పూర్వు లీ
వివిధానేకశిలాసహస్రములపై
వీక్షింపు డాసక్తిమై.

కాగితంబున లిఖయింప కష్టమైన
చిత్రముల నెట్లు శిలలపై చెక్కినారు?
అవును మా కిది యబ్బురం బవునుగాని
నాటి మీలోపల 'మయు'లెందరు గలారొ!

ఒకరథముం బొనర్చి రది
యు న్నిజమైనదె? శిల్పసృష్టియా?
చకచక పోవునా హరులు?
సారథి యేడియదైన? చక్ర మే
మి కదలుచున్నదా? సమర
మేదినికేమి ప్రయాణ మంచు త
ప్పక కలిగించు సంశయము
ప్రాజ్ఞునకైనను దాని గాంచుచోన్.

ఎందరెందరో రాణ్మణు లిట్టిచోట్ల
ధనము వెచ్చించి నిల్పిన ఘనకృతు లవి
కాలగర్భాన పడిపోయి కానబడక
నేడు కడగండ్ల నిలుపు కన్నీటికణము.

ఒకకొండపైనుండి యొకకొండ గనుగొన్న
పెనులోయ లొకచోట వెలయుచుండు
ఒకకొండపైనుండి యొకకొండ గనుగొన్న
వనభూము లొకచోట దనరుచుండు
ఒకకొండపైనుండి యొకకొండమీదుగా
జలధార లొకచోట జరుగుచుండు
ఒకకొండపైనుండి యొకకొండ కనుగొన్న
పెనురాళు లొకచోట పెరుగుచుండు

ఒకట భీతియు నొక్కచో నుత్సవంబు
నొకట తన్మయత్వంబు లో నొదవుచుండు
నవుర! పరమాద్భుతావహం బచటి ప్రకృతి
వైభవాధిక్య మానందశోభితంబు.

ఏమిది పిచ్చగాక! ఇటు
లేమిటి కే నిటు సాహసింతు, తం
డ్రీ! మము నేలుసామి! ఇటు
లెంతని వాకొన నేర్తునయ్య! వా
చామహిమాతిపాత మిది:
చా లని తృప్తి వహింపలేను - దే
వా! మిము సంజలింతు గను
మా మధురామృతవీక్షణావళిన్.



# శబ్దరత్నాకరము

'విషనాగు'

[ఇది శబ్దరత్నాకరంమీద విమర్శ కాదు. 'భూతం' వర్తమానానికి జనని. శబ్దరత్నాకరం అసంపూర్ణ మయినా ముందు సమ్యక్కయిన నిఘంటువును పుట్టించగలదు.] —వ్యా. క.

అసలు మానవజీవితమే అభావమయం. అందులో అభాగ్యభారతీయజీవనంలో మరీని! ఇక ఆంధ్రులవిషయం చెప్పనే అవసరం లేదు.

మన కున్న కొరతలసంపత్తిలో ఉత్తమ నిఘంటువు ఒకటి తెలుగులో లేకపోవడం.

గ్రాంథికభాషా పోషకులగు 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' వారు యీ కొరతను తీరుస్తా రనుకోవడం ఎండమావుల్లాంటి దేమో ననిపిస్తోంది. అసలు వారి దృష్టి కొండలమీద వుంటే మన పచ్చని తెలుగు గడ్డమీదికి ఎలా దిగ్గలదు?

ఆంధ్రుల్లో యింతవరకు 'శబ్దరత్నాకర'మే ప్రామాణికంగా చూడబడు తోంది. గుణసంపత్తుల్లో దీన్ని మించింది మరొకటి లేదుకూడాను. కాని శ. ర. లో వున్న లోపాలను చూచి సమగ్ర మయిన నిఘంటువు ఎంతమాత్రం కాదని నొక్కి చెప్పగలను.

శబ్దరత్నాకరంలో అనేక శబ్దాలు ఉరువు లేకపోవడమే కాక చాలచోట్ల 'అర్థం' కూడ భ్రామికంగా ఉంది. ఉదాహరణకు ఒక శబ్దం చూడండి: 'సమక్షము = నయనేంద్రియగోచర మైనది.' నయనేంద్రియ గోచర మయినదానినల్లా 'సమక్షం' అంటా రేమో కొంచెం ఆలోచించండి.

తత్సమ సంస్కృతశబ్దాలకు అర్థం చాల తక్కువగా యిచ్చారు. కారణ మేమో తెలియదు. హిందీనిఘంటువు 'సంక్షిప్త శబ్ద సాగర్'లో 'వికృతి' శబ్దానికి ఎనిమిది విధార్థాలు వుంటే శబ్దరత్నాకరంలో ఆ'వికృతి' శబ్దానికే మూడు విధ అర్థాలు మాత్రమే గలవు.

శబ్దరత్నాకరకారుడు చేసినపరిశ్రమ శ్లాఘనీయమే. వారుచేసిన పరిశ్రమ తెలుగు యితిహాసంలో బంగారు రేఖల్లో ఒత్తబడ గలదు. కాని వారు నిఘంటువుకు ప్రథమంలో రాసిన'భాషాప్రశంస' చూస్తే తెలియగలదు, సమగ్రమయిన నిఘంటువు రాయడానికి యింకా విశాలదృష్టి - విచారం కావాలని.

శబ్దరత్నాకరకారుడు ఆంధ్రాన్ని 'సంస్కృతప్రాకృతముల వికృతి' అని రాశాడు. దేన్నిచూచి?

తెలుగుపండితుల్లో 'ఆంధ్రులు' ఆర్యులనే విశ్వాసంతో చర్చ (ప్రశంస) జరుగుతోంటుంది. కాని యింతవరకు మనవారు ఔత్తరేయ విద్వాంసులను ఒప్పించగలిగారా? ఔత్తరేయులు మనశాతవాహన

సంపత్తినిగూడపూడ్చుకపోతున్నారు.[1] "శాతవాహనులు మహారాష్ట్రులు. ఆంధ్రరాజ్యం (ఆంధ్రులమీద ప్రభుత్వం) స్థాపించినందువల్ల వారికి ఆంధ్రులని పేరుబడిం"దని వారివాదన.

తెలుగు 'ఆర్యభాష.' అని తెలుగునాడులో ప్రతిసామాన్య తెలుగు పండితుడి నోటినుంచి వెలువడుతోంది! కాని వారిదృష్టి ఎక్కడుంది? తెలుగులో వున్న సంస్కృత బాహుళ్యంమీదనే గదా! ఈ సంస్కృత దాస్యాన్నిచూచి ఆంధ్రం 'సంస్కృతప్రాకృతముల వికృతి' అని మనపండితుల కెందుకో అంత మురిపెము! ఆంధ్ర శబ్దచింతామణి కారుడు 'ఆద్యః ప్రకృతిశ్చాద్యే' అని రాసినంతమాత్రాన 'తెలుగు' ఆర్యసింహాసనం మీద కూర్చోలేదు. దీన్ని నిరూపించడానికి ఆంధ్రవిద్వాంసులు ఘోరతపం చెయ్యాలి.

ఆంధ్రుల యీవిచారాన్నిచూచి, కార్యం చేసినా చెయ్యకపోయినా ఆంధ్రవిద్వాంసుల దృష్టి యింకా పూర్తిగా 'తెలుగు' లోకి రాలేదని నాదుష్టబుద్ధికి తోస్తోంది! క్షమించండి.

తెనుగుతల్లి సంస్కృతానికి చేసిన - చేస్తున్న దాస్యాన్ని చూచి ఆంధ్రం 'సంస్కృతప్రాకృతములవికృతి' అని మురిసిపోవు గ్రాంథికవాదులు మాతృభాషకు మహాపకారం చేస్తున్నారేగాని మేలు చేయడం లేదు.

మన గ్రాంథికభాషలోవున్న కృత్రిమ సామ్యంకన్నా వాడుకభాషలోనే ఎక్కువ ఆర్యభాషలతో సంబంధం కనిపిస్తోంది. ఒక శబ్దజాలంలోనే గాక వ్యాకరణం ఆది విషయాల సామ్యంగూడ వాడుకభాషలోనే కనిపిస్తోంది. మన పల్లెల్లో వాడబడే శబ్దాలను చూడండి:—

ఆవు—ఇది 'గోవు' యొక్క అపభ్రంశం. హిందీలో 'గాయ్' తెలుగులో 'ఆవు.' ప్రథమహల్లు (వ్యంజనం) స్వరం (అచ్చు) లోకి మారు ప్రవృత్తి తెలుగులో తరుచుగా కనిపిస్తోంది.

ఎద్దు—సంస్కృత 'బలివర్ద' శబ్దానికి అపభ్రంశం. హిందీలో 'బలి'నుండి 'బైల్' అయింది. కాని, హిందీ ఉపభాష లగు మైథిలీ మొదలగువాటిలో 'వరద్' ప్రయోగంలో ఉంది. కావున తెలుగులో 'ఎద్దు'గా మారడం అబ్బురం గాదు.

ఒడి—మూలం 'క్రోడః.' హిందీ 'గోద్'. తెలుగులో ప్రథమవ్యంజనం స్వరంలోకి మారింది.

*ఇత్తు—గింజ(బీజం)అర్థంలో. అపభ్రంశంలో యీశబ్దం 'ఇత్థు' ఫలం అనే అర్థంలో కనిపిస్తోంది. కొద్దిగా అర్థభేదం కలిగి వుండొచ్చును.

*అమ్మడు—తెలుగునాడులో ఆడపిల్లలను ముద్దుగా పిలుచుకొను యీశబ్దం అపభ్రంశకవితలో 'అమ్మడి' రూపంలో స్త్రీసంబోధనకు కనిపిస్తోంది.

*ఆణ, ఆడ — సం. ధని. ప్రా; అ. ధణ. *హణ. తె. ఆణ, ఆడ. తెలుగులో 'మహాప్రాణం' స్వరంలోకి మారడం సహజంగా కనిపిస్తుంది.

---

౧. జయచంద్ర విద్యాలంకార్‌కృత 'భారతీయ యితిహాసకీ రూపరేఖ్' పు. ౧౪౯.

*కంచె—సం. కచ్ఛ. హిం-గాఛ్. తె. కంచెగా మారివుండొచ్చును. అర్థభేదం.

*జడి(+వాన) — సం. ఝరణమ్. హిం. ఝడీ. తె జడి (+వాన). ఎడతెగకుండా తుంపర పడుతుంటే 'ఝడీ' అని హిందీలో అంటారు.

నెమ్మ— అపభ్రంశ కవితలో 'నిమ్మ, నిమ్మళ' అని రెండుశబ్దాలు కనిపిస్తున్నాయి తడి, చెమ్మ అర్థంలో.

పరికిణీ—పరిధానమ్. అ. పరిహాణ్ణు. తె. పరికిణీ, పరికెణ. 'క' ఆగమం కలిగివుండొచ్చును.

పొత్తు—సంస్కృతంలో 'ప్రోత' శబ్దంవుంది. ఇది 'కుట్టబడిన' ఆది రెండువస్తువుల కలయికను తెలుపు ఎనిమిది వివిధ అర్థాలను తెలుపుతోంది. ఇదే కొంచెం అర్థభేదంతో 'పొత్తు'గా మారి వుండొచ్చును. బట్టలను చక్కగా మడతపెట్టి వుంచడాన్నిగూడ మనం 'పొత్తులు' అని అంటాం. అదే 'పొత్తుచదువు' అర్థంలోకిగూడ మారి వుండొచ్చును.

మోర—పశువుతల (=మోరెత్తుకచూస్తుంది.) సం. మహాలిః. హిం. మహార్. హిందీలో 'మహార్'ను 'పశువుల శిరా'నికి గూడ ప్రయోగిస్తున్నారు.

వేరు—పృథక్ అను అర్థంలో. ఈ అర్థంలోనే 'బెహార్' అను శబ్దం అవధిభాషలో కనిపిస్తోంది. (ఈ శబ్దాన్ని శ. ర. కారుడు దేశీయ మని రాయడమే కాక అర్థంకూడ తప్పు యిచ్చాడు. తెలుగునాడులో ఆబాలగోపాలం 'వేరు'ను 'పృథక్' అర్థంలో వాడుతున్నారు, 'అన్యము' అనే అర్థంలో ఎంతమాత్రం కాదు. శ. ర. కారుడు యిచ్చిన ఉదాహరణలోగూడ 'అన్యము' అను అర్థం రావడమే లేదు: "తే. కౌరవులసేమ మెల్ల వేర్వేర నడిగె" ఇందులో గూడ 'పృథక్' అను అర్థంలోనే...[౧]

మామిడి—'ఆమ్ర'కు వికృతం. స్వరభక్తి (Anaplyxis) వల్ల > ఆమరగా మారి > *ఆమిడి > మామిడిగా మారి వుండొచ్చును. అనునాసికవ్యంజనప్రభావం వల్ల పూర్వ'స్వరం' అనునాసికవ్యంజనంగా మారడం తెలుగులో సాధారణంగా కనిపిస్తోంది. (ఉదా: ఏను=నేను).

కొనుట—ప్రయోగం:- ఆ వస్తువు ఎంతలో కొన్నావు?' మైథిలీ ఆది కొన్ని హిందీ ఉపభాషల్లో 'కినల్ - కిననా' శబ్దాలు ప్రయోగం వున్నాయి.

*చత్త— ఈ శబ్దం గ్రామీణంనుంచి సాహిత్యంలోకి యింతవరకు ఎక్కిందో లేదో! కాని పల్లెటూరివాళ్లు తరుచుగా 'చెత్త చదారం' అని తరుచుగా వాడుతూనే వున్నారు. ఈశబ్దం అపభ్రంశకవితలో 'చత్త ఉ' రూపంలో కనిపిస్తోంది. ఇది సంస్కృత 'త్యక్త'కు వికృతం—వికాసం.

తొక్క—ఇది సంస్కృత 'త్వచ్'కు వికాసం. దీన్ని మనం త్యజించవలసిన కాయలు మొదలగువాటిపై 'పెచ్చు'కు వాడుతున్నాము. 'చత్త' అర్థంలో గూడాను.

---

౧. ఇటువంటి భ్రామికా లింకా యెన్నోవున్నాయి కాని ప్రస్తుత వ్యాసోద్దేశ్యము శ. ర. న్ని విమర్శించడం కాదు.—నాస.

పెట్టుట—ఈశబ్దం అపభ్రంశకవితలో 'పిణు' రూపంలో కనిపిస్తోంది. ఉదా: ణమ కారే పిణు = నమస్కారములు పెట్టి.[3]

పోయినకొలదీ గ్రంథం పెరిగిపోతోంది. నమూనాకు ఈశబ్దాలే చాలు. సాధ్యమయినంత త్వరలో ఉడతలాగు ఆంధ్ర-ఆర్య భాషలమధ్య వారధి కట్టడానికి నేను చేసిన పరిశ్రమ (? అప్రకాశితమూ, హృదయస్థమూ) ను చిన్ని వ్యాసరూపంలో ఆంధ్రులముందు ఉంచుతాను.

ఇంతకూ పర్యవసానం ఏమిటి ?

మనకు సమగ్రమయిన నిఘంటువు కావాలంటే గ్రామీణశబ్దాలనుకూడ ఆదరించాలి—వాటికి స్థాయిత్వం యివ్వాలి. నింద్యాలనబడు మాండలిక గ్రామ్యశబ్దాలను గూడ గ్రహించాలి. (నెల్లూరులో వాడు 'బెంబేలు' శబ్దం శ. ర. లో కనిపించలేదు) ఛాందసులగు మన పండితులు దేశభాషను (ప్రాచీనాంధ్రాన్ని) నిరసించబట్టే గదా ఆంధ్రానికి నేటీ కీగతిపట్టింది! [౪]యుగప్రవర్తకులిద్దరు తమ అమర సందేశాన్ని వదిలిపెట్టి వెళ్లారు! ఇంకా మనం కళ్లు తెరువకపోతే ఎలా?

శ. ర. లో ఎచ్చటా వైకృతాలకు మూలం యివ్వలేదు. మూలం యివ్వడం చాల ఆవశ్యకం. మూలం యివ్వనంతవరకు 'నిఘంటువు' పూర్ణం కాజాలదు. మూలం దేశ్యాలనబడు శబ్దాల మూలాన్నిగూడ కనుక్కోవాలి. ఇందుకుగాను విస్తృత అధ్యయనంకావాలి — హిందీ, బెంగాలి, ఓఢ్రం, మహారాష్ఠ్రి, కన్నడం, తమిళం మొదలగు వున్నతభాషలను ఆంధ్రపండితులు (నిఘంటు నిర్మాతలు) వీలైనంతవరకు నేర్చుకోవాలి. మహారాష్ట్రీకి తెలుగుకు విశేషసంబంధం యిచ్చినందువల్ల 'నిఘంటువు'లో ఒక విధమయిన 'వెలుగు' ప్రసరించగలదు. వున్నట్టు కనిపిస్తోంది. వర్తమాన హిందీ (రాష్ట్ర భాష=ఖడీబోలీ) కన్న దాని ఉపభాషలగు మైథిలి, మగహి, భోజపురి, అవధి ఆది భాషలతో తెలుగుకు దగ్గర చుట్టరికం ఉన్నట్టు కనిపిస్తోంది*. కావున యింత అధ్యయనం వున్నప్పుడే దేశ్య మనబడు మనశబ్దజాలం 'వెలుగు' లోకి రాగలదు. అదీగాక 'తెలుగు'ను ఆర్యభాషాకుటుంబంలో కలపడానికి ప్రాకృతఅపభ్రంశాలను ఆంధ్రవిద్వాంసులు అధ్యయనం చెయ్యాలి. ప్రాకృత అపభ్రంశాలమీదఅధికారం(పాండిత్యం)వుంటేనే మనం ఆంధ్రానికి 'ఆర్యజీవం' పొయ్యగలము.

తెలుగు వాఙ్మయం ఆద్యోపాంతంగా చదివి చక్కని బృహన్ నిఘంటువు తయారు చెయ్యవచ్చును; (ఆంధ్రసాహిత్య పరిషత్తువారు చేస్తున్నట్టు). కాని ఇందువల్ల 'కాయం' పెరుగుతుందే కాని నిఘంటు హృదయం విశాలం కాజాలదు.

---

3. పైనున్న శబ్దాలు అన్నీ దేశ్యాలని చేర్కొబడ్డాయి. కాని (*) గుర్తు గలవి శబ్దరత్నాకరంలో లేవు. గ్రామ్యాలని విడువబడ్డవేమో!

౪. నన్నయ, గిడుగు.

* ఆయాభాషల నిఘంటువులలోగూడ సహాయం తీసుకోవాలి.

వైజ్ఞానికంగానూ (నూతన పద్ధతిని ?) భాషావిజ్ఞాన సమ్మతంగానూ సమ్యక్కయిన నిఘంటువు మనకు గావాలి.

ఇందుకుగాను పృష్ఠ భూమి (Back ground) మూలాధారం (Back-bone గట్టిగా వుండాలి. అంటే ఆంధ్రుల్లో భాషా విజ్ఞానం (Philology) వ్యాపించాలి. భాషా విజ్ఞానవ్యాప్తివినా సమగ్రమయిన నిఘంటువు తయారు కావడం కష్టమేగాదు, అసంభవం. భాషావిజ్ఞానవ్యాప్తివల్ల వాఙ్మయంలో-జాతిలో ఒక విధమయిన 'కాంతి' ప్రసరిస్తుంది. భాషావిషయక రూఢిబంధాలు పుటుక్కున తెగిపోగలవు. తెలుగులోని ప్రతి శబ్దం విద్యుత్కణంలాగు కనిపించ గలదు.

మన శబ్దాల రూపు నిర్ణయానికి ధ్వని విజ్ఞానం (ధ్వనిశాస్త్రం = Phonetics) లో కూడ విస్తృత అధ్యయనం వుండాలి. ఆంధ్ర ధ్వనుల ధ్వన్యాత్మక (Phonetic) ప్రగతి (వికాసం) ఒక విచిత్రరీతిని కలిగింది. ఈ విచిత్రతే ద్రావిడసముదాయంలోనుంచి 'ఆంధ్ర వర్గం'గా ఏర్పరచింది. ఆంధ్ర(తెలుగు) ధ్వని విజ్ఞానంమీద స్వతంత్రంగా అన్వేషణ జరగాలి. 'ఆంధ్రభాషాచరిత్ర' లో ఆంధ్ర ధ్వనులమీద వైజ్ఞానికచర్చ జరగ లేదనే చెప్పాలి. జరిగి అయినా నామమాత్రానికే. అయినప్పటికీ చిలుకూరి నారాయణరావు గారు తామిచ్చిన వాగ్దానం త్వరలో పూర్తి జేసి తెలుగుకున్న యీ కొరతను కొంతవర కైనా తీరుస్తారనే నా ఆశ!

# ప్రావృట్కాలము

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

సెలయేరుజలముల జేర్చువాడ వటంచు కూనరాగాలతో కులుకుచుండ,
కొనయూపిరిం దాల్చి గోడోందుతృణములు, వచ్చుచున్నావంచు ప్రమదమంద
పిల్లగాలులు గూడి ప్రేమమీరగ నీకు నతులితరీతి జోహారు లొసగ,
నీలిమబ్బులు నీదు నెయ్యము నాసించి వింతగా నింగిపై గంతు లిడగ;
విజయఘోషల నురుములు వెలయువేళ - మెఱుపు కెన్నెల కాంతతో మేలమాడ
రాజటీవిని ప్రకృతి సరాసరికిని - వర్షకాలము వచ్చితే హర్షమెలయు!

పాయని మండుటెండలకు బానిసయైన వసుంధరాసతిన్
ఆయువు నిచ్చి గాచితివి, హర్షము గూర్చితి వర్షధారతో!
పాయము లేక జీర్ణమయి చచ్చెనయట్టివి గడ్డిపోచలన్
నీ యభిమాన మెందులకొ? నిల్వగ జేసితి నూత్నశోభతో!

అందమునందు మేటి నని హాయిగ తారలచెంత కేగుచున్
విందులలో మునింగి, యొక ప్రేమపిపాసిగ చంద్రు డుండ నీ
వెందుల కట్టిసౌఖ్యమును యేటిలో గల్పితి నీలిమబ్బులే
వందర జేసె నాతనిని! భావ్యమె నీ కిది వర్షకాలమా?

మర్మము లేనిజీవనము మా దని వాదన జేయునట్టి యా
కార్మిక కర్షకావళుల గాచెడు దాతలు లేనివేళ నీ
ధార్మిక మేడ నేర్చితివొ! తండ్రిగ, గాచి జలంబు లిచ్చితే!
నిర్మలమైన నీ మనసు నేర్పదె పాఠము నాంధ్రజాతికిన్.

ఆకటిచిచ్చుతో వెతలనందు నభాగ్యులు బిచ్చగాండ్రు! యే
వాకిటి కేగలేక, జడివానలలో బడి రక్షలేక నీ
ధాకకు దాసులై యచట డస్సిరి గాంచితె! వర్షకాలమా!
ఈ కలికాలమందు లభియింపదు ధర్మము మచ్చుకేనియున్.

గానవిశారదుండ నని గర్వము నందుచు, మన్ను మిన్నులన్
గానక, నొక్కపెట్టుగను కంఠము నెత్తుచు బాడు కోకిలన్
యేనడియేటిలో మునిచి తెంతటి ఘోరము! వర్షకాలమా!
వానల హోరు తక్క నిక వాంఛిత మెద్దియు నీకు లేదొకో!

పిడుగులె, నేస్తకాం డ్రనుచు, ప్రేమధనాన్వితు లంచు వారితో
దడబడకుండ నేగెదవు! ధాత్రియ వారల దూరుచుండు, నే
యిడుముల నందెదో తెలియు, దింత యమాయకు డైనవానికే
సడతి మెఱుంగుటీగ సమభాగిని యూట విచిత్రమా గదా!

# సింహాగిరి

శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు

అది తెలుంగువారి కానందకాననం
చేడు నేడు వచ్చు నిద్ధజనము
'ఆంధ్రభోజు'చరిత నది ప్రసిద్ధము ముక్తి
సాధకంబు సింహాభూధరంబు.

ఒక్కగిరి మాధవస్వామి యొప్పుచుండు
నొకట శ్రీనృసింహేశ్వరుం డొనరియుండు
ఒక్కదేవుండు దీర్ఘాయు వొసగి మనుచు
నొక్కదేవుడు శ్రేయస్సు లొందజేయు.

శైశవమ్మున స్వామిదర్శనము గలిగె
కాని యానాటి తైర్థికకాంక్ష వేరు
చరితలందున మాత్రము చదువదగిన
నేటి విషయసంశోధనానిరతి వేరు.

ఒక్కొకయాలయంబున క
టోయి! యిటుల్ వెదజల్లినారలీ
రొక్కము లెల్ల గవ్వలటు
లున్ నృపసత్తములార! భక్తియే
చిక్కనిరక్తరూపమును
జెంది స్రవించియు నుండబోలు మీ
చక్కనిదేహజాలముల
చాలదె మా కిది గర్వమందగన్ !

చెండాడె నిటనుండు దండిశత్రుల నెల్ల
అరివీరమాన ప్రాణాపహర్త
నాటించినాడుగా మేటికంబము నిందు
దిగ్దిగంతవ్యాప్త దివ్యకీర్తి
చెక్కించె నిజజయశ్రీవిలాసము నిట
విజయలక్ష్మీమనఃప్రియదమూర్తి
సేవించె భక్తిమై శ్రీవరాహనృసింహు
ఘనవిష్ణుచిత్తీయకావ్యకర్త

అనుచు జదివితి చరితల నంతెగాని
కనులపండుగ యగుపట్లు గాంచలేదు
నేటి కది లభించె ననెడిమాటె కాని
పూర్ణమును గాదు కొన్నింట జీర్ణమగుట !

పగతేన్గత్తుల దట్టఘట్టనలకున్
బొల్పడ్డ యాశిల్పముల్
సగమై, తునకలునై, స్వరూపహతమై
సంపూర్ణజీర్ణంబులై
సొగసుం జక్కదనంబు వోని జిగిమై
చూపట్టు నౌరౌర! యెం
తగ సాధించిరి శిల్పకావ్యరచనా
నైపుణ్య మీయాంధ్రులున్.

ఈనాటిదా యిది యేనాటికట్టడం
బెటు నిల్చియుండెనో యింతదనుక
తాతముత్తాతలు తరతరంబులవార
లిట నేమి గల దంచు నేగువారు
పీరచిత్రావళి విలిఖించి రిం దేల
యేపాఠముం జెప్పి చూపుకొరకు
ఈస్థలం బిటు లేల నింతపవిత్రంబు
అందుగలట్టి మహత్త్వ మేమి
నాటి హైందవశిల్పులపాటవంబొ
కొండదేవుని గనుగొన కోర్కెనొక్క
తెలుగుబిడ్డకు రణవిద్య తెలుపుకొరకొ
అడుగు నిడినంత పాపంబు లడపగలదొ!

అది యంత్రం బనిపించె తొల్దొలుతగా
నావృద్ధు "డేనాటి ది
య్యది, మర్త్యక్రియ గాదు, దైవకృత మ
య్యా! పోయి గన్గొండు మీ

రు దదీయాంశము లెల్ల స్ఫష్ట మగు ప
ల్కుల్ వేయు నే లన్న”–నె
మ్మదికిన్ సత్యము దోచె చూడ ఘన ని
ర్మాణక్రియాచాతురుల్.

నవనాట్యంబులు నాహావక్రమములున్
నానావనీపాలపై
భవమార్గంబులు: పెక్కులేల, రచనా
వైదుష్య మేపార మా
నవజీవక్రియ లెల్ల నిండునను సం
ధానించినా ర్పూర్వు లీ
వివిధానేకశిలాసహస్రములపై
వీక్షింపు డాసక్తిమై.

కాగితంబున లిఖయింప కష్టమైన
చిత్రముల నెట్లు శిలలపై చెక్కినారు?
అవును మా కిది యబ్బురం బవునుగాని
నాటి మీలోపల ‘మయు’ లెందరు గలారో!

ఒకరథముం బొనర్చి రది
యు న్నిజమైనదె ? శిల్పసృష్టియా ?
చకచక పోవునా హరులు ?
సారథి యేడియుబైన ? చక్ర మే
మి కదలుచున్నదా ? సమర
మేదినికేమి ప్రయాణ మంచు త
ప్పక కలిగించు సంశయము
ప్రాజ్ఞునకైనను దాని గాంచుచోన్.

ఎందరెందరో రాణ్మణు లిట్టిచోట్ల
ధనము వెచ్చించి నిల్పిన ఘనకృతు లవి
కాలగర్భాన పడిపోయి కానబడక
నేడు కడగండ్ల నిలుపు కన్నీటికణము.

ఒకకొండపైనుండి యొకకొండ గనుగొన్న
పెనులోయ లొకచోట వెలయుచుండు
ఒకకొండపైనుండి యొకకొండ గనుగొన్న
వనభూము లొకచోట దనరుచుండు
ఒకకొండపైనుండి యొకకొండమీదుగా
జలధార లొకచోట జరుగుచుండు
ఒకకొండపైనుండి యొకకొండ కనుగొన్న
పెనురాళు లొకచోట పెరుగుచుండు

ఒకట భీతియు నొక్కచో నుత్సవంబు
నొకట తన్మయత్వంబు లో నొదవుచుండు
నవుర! పరమాద్భుతావహం బచటిప్రకృతి
వైభవాధిక్య మానందశోభితంబు.

ఏమిది పిచ్చగాక! ఇటు
లేమిటి కే నిటు సాహసింతు, తం
డ్రీ! మము నేలుసామి! ఇటు
లెంతని వాకొన నేర్తునయ్య! వా
చామహిమాతిపాత మిది:
చా లని తృప్తి వహింపలేను - దే
వా! మిము నంజలింతు గను
మా మధురామృతవీక్షణావళిన్.



# శబ్దరత్నాకరము

'విషనాగు'

[ఇది శబ్దరత్నాకరంమీద విమర్శ కాదు. 'భూతం' వర్తమానానికి జనని. శబ్దరత్నాకరం అసంపూర్ణ మయినా ముందు సమ్యక్కయిన నిఘంటువును పుట్టించగలదు.] —వ్యా. క.

అసలు మానవజీవితమే అభావమయం. అందులో అభాగ్యభారతీయజీవనంలో మరీని! ఇక ఆంధ్రులవిషయం చెప్పనే అవసరం లేదు.

మన కున్న కొరతలసంపత్తిలో ఉత్తమ నిఘంటువు ఒకటి తెలుగులో లేకపోవడం.

గ్రాంథికభాషా పోషకులగు 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' వారు యీ కొరతను తీరుస్తా రనుకోవడం ఎండమావుల్లాంటి దేమో ననిపిస్తోంది. అసలు వారి దృష్టి కొండలమీద వుంటే మన పచ్చని తెలుగు గడ్డమీదికి ఎలా దిగ్గలదు?

ఆంధ్రుల్లో యింతవరకు 'శబ్దరత్నాకర'మే ప్రామాణికంగా చూడబడు తోంది. గుణసంపత్తుల్లో దీన్ని మించింది మరొకటి లేదుకూడాను. కాని శ. ర. లో వున్న లోపాలను చూచి సమగ్ర మయిన నిఘంటువు ఎంతమాత్రం కాదని నొక్కి చెప్పగలను.

శబ్దరత్నాకరంలో అనేక శబ్దాలు ఉనికి లేకపోవడమే కాక చాలచోట్ల 'అర్థం' కూడ భ్రామికంగా ఉంది. ఉదాహరణకు ఒక శబ్దం చూడండి: 'సమక్షము = నయనేంద్రియగోచర మైనది.' నయనేంద్రియ గోచర మయినదానినల్లా 'సమక్షం' అంటారేమో కొంచెం ఆలోచించండి.

తత్సమ సంస్కృతశబ్దాలకు అర్థం చాల తక్కువగా యిచ్చారు. కారణ మేమో తెలియదు. హిందీనిఘంటువు 'సంక్షిప్త శబ్ద సాగర్'లో 'వికృతి' శబ్దానికి ఎనిమిది విధార్థాలు వుంటే శబ్దరత్నాకరంలో ఆ'వికృతి' శబ్దానికే మూడు విధ అర్థాలు మాత్రమే గలవు.

శబ్దరత్నాకరకారుడు చేసినపరిశ్రమ శ్లాఘనీయమే. వారుచేసిన పరిశ్రమ తెలుగు యితిహాసంలో బంగారు రేఖల్లో ఒత్తబడ గలదు. కాని వారు నిఘంటువుకు ప్రథమంలో రాసిన'భాషాప్రశంస' చూస్తే తెలియగలదు, సమగ్రమయిన నిఘంటువు రాయడానికి యింకా విశాలదృష్టి - విచారం కావాలని.

శబ్దరత్నాకరకారుడు ఆంధ్రాన్ని 'సంస్కృతప్రాకృతముల వికృతి' అని రాశాడు. దేన్నిచూచి?

తెలుగుపండితుల్లో 'ఆంధ్రులు' ఆర్యులనే విశ్వాసంతో చర్చ (ప్రశంస) జరుగుతోంటుంది. కాని యింతవరకు మనవారు ఔత్తరేయ విద్వాంసులను ఒప్పించగలిగారా? ఔత్తరేయులు మనశాతవాహన

సంపత్తినిగూడవూడ్చుకపోతున్నారు.[1] "శాతవాహనులు మహారాష్ట్రులు. ఆంధ్రరాజ్యం (ఆంధ్రులమీద ప్రభుత్వం) స్థాపించినందువల్ల వారికి ఆంధ్రులని పేరుబడిం"దని వారివాదన.

తెలుగు 'ఆర్యభాష' అని తెలుగునాడులో ప్రతిసామాన్య తెలుగు పండితుడి నోటినుంచి వెలువడుతోంది! కాని వారిదృష్టి ఎక్కడుంది? తెలుగులో వున్న సంస్కృత బాహుళ్యంమీదనే గదా! ఈ సంస్కృత దాస్యాన్నిచూచి ఆంధ్రం 'సంస్కృతప్రాకృతముల వికృతి' అని మనపండితుల కెందుకో అంత మురిపెము! ఆంధ్ర శబ్దచింతామణి కారుడు 'ఆద్యః ప్రకృతిశ్చాద్యే' అని రాసినంతమాత్రాన 'తెలుగు' ఆర్యసింహాసనం మీద కూర్చోలేదు. దీన్ని నిరూపించడానికి ఆంధ్రవిద్వాంసులు ఘోరతపం చెయ్యాలి.

ఆంధ్రుల యీవిచారాన్నిచూచి, కార్యం చేసినా చెయ్యకపోయినా ఆంధ్రవిద్వాంసుల దృష్టి యింకా పూర్తిగా 'తెలుగు' లోకి రాలేదని నాదుష్టబుద్ధికి తోస్తోంది! క్షమించండి.

తెనుగుతల్లి సంస్కృతానికి చేసిన - చేస్తున్న దాస్యాన్ని చూచి ఆంధ్రం 'సంస్కృతప్రాకృతములవికృతి' అని మురిసిపోవు గ్రాంథికవాదులు మాతృభాషకు మహాపకారం చేస్తున్నారేగాని మేలు చేయడం లేదు.

మన గ్రాంథికభాషలోవున్న కృత్రిమ సామ్యంకన్నా వాడుకభాషలోనే ఎక్కువ ఆర్యభాషలతో సంబంధం కనిపిస్తోంది. ఒక శబ్దజాలంలోనే గాక వ్యాకరణం ఆది విషయాల సామ్యంగూడ వాడుకభాషలోనే కనిపిస్తోంది. మన పల్లెల్లో వాడబడే శబ్దాలను చూడండి:—

ఆవు—ఇది 'గోవు' యొక్క అపభ్రంశం. హిందీలో 'గాయ్' తెలుగులో 'ఆవు.' ప్రథమహల్లు (వ్యంజనం) స్వరం (అచ్చు) లోకి మారు ప్రవృత్తి తెలుగులో తరుచుగా కనిపిస్తోంది.

ఎద్దు—సంస్కృత 'బలివర్ద' శబ్దానికి అపభ్రంశం. హిందీలో 'బలి'నుండి 'బైల్' అయింది. కాని, హిందీ ఉపభాష అగు మైథిలీ మొదలగువాటిలో 'వరద్' ప్రయోగంలో ఉంది. కావున తెలుగులో 'ఎద్దు'గా మారడం అబ్బురం గాదు.

ఒడి—మూలం 'క్రోడః.' హిందీ 'గోద్'. తెలుగులో ప్రథమవ్యంజనం స్వరంలోకి మారింది.

*ఇత్తు—గింజ(బీజం)అర్థంలో. అపభ్రంశంలో యీశబ్దం 'ఇత్థు' ఫలం అనే అర్థంలో కనిపిస్తోంది. కొద్దిగా అర్థభేదం కలిగివుండొచ్చును.

*అమ్మడు—తెలుగునాడులో ఆడపిల్లలను ముద్దుగా పిలుచుకొను యీశబ్దం అపభ్రంశకవితలో 'అమ్మడి' రూపంలో స్త్రీసంబోధనకు కనిపిస్తోంది.

*అణ, అడ — సం. ధని. ప్రా; అ. ధణ. *హణ. తె. అణ, అడ. తెలుగులో 'మహాప్రాణం' స్వరంలోకి మారడం సహజంగా కనిపిస్తుంది.

---

[1]. జయచంద్ర విద్యాలంకార్ కృత 'భారతీయ యితిహాసకీ రూపరేఖ' పు. ౧౪౯.

*కంచె—సం. గచ్ఛ. హిం-గాఛ్. తె. కంచెగా మారివుండొచ్చును. అర్థభేదం.

*జడి(+వాన) — సం. ఝరణమ్. హిం. ఝడీ. తె జడి (+వాన). ఎడతెగకుండా తుంపర పడుతుంటే 'ఝడీ' అని హిందీలో అంటారు.

నెమ్మ— అపభ్రంశ కవితలో 'నిమ్మ, నిమ్మళ' అని రెండుశబ్దాలు కనిపిస్తున్నాయి తడి, చెమ్మ అర్థంలో.

పరికిణి—పరిధానమ్. అ. పరిహాణ్ణు. తె. పరికిణీ, పరికిణ. 'క' ఆగమం కలిగివుండొచ్చును.

పొత్తు—సంస్కృతంలో 'ప్రోత' శబ్దంవుంది. ఇది 'కుట్టబడిన' ఆది రెండువస్తువుల కలయికను తెలుపు ఎనిమిది వివిధ అర్థాలను తెలుపుతోంది. ఇదే కొంచెం అర్థభేదంతో 'పొత్తు'గా మారి వుండొచ్చును. బట్టలను చక్కగా మడతపెట్టి వుంచడాన్నిగూడ మనం 'పొత్తులు' అని అంటాం. అదే 'పొత్తుచదువు' అర్థంలోకిగూడ మారి వుండొచ్చును.

మోర—పశువుతల (=మోరెత్తుకచూస్తుంది.) సం. మౌలిః. హిం. మౌర్. హిందీలో 'మౌర్'ను 'పశువుల శిరా'నికి గూడ ప్రయోగిస్తున్నారు.

వేరు—పృథక్ అను అర్థంలో. ఈ అర్థంలోనే 'బెహార్' అను శబ్దం అవధిభాషలో కనిపిస్తోంది. (ఈ శబ్దాన్ని శ. ర. కారుడు దేశీయ మని రాయడమే కాక అర్థంకూడ తప్పు యిచ్చాడు. తెలుగునాడులో ఆబాలగోపాలం 'వేరు'ను 'పృథక్' అర్థంలో వాడుతున్నారు, 'అన్యము' అనే అర్థంలో ఎంతమాత్రం కాదు. శ. ర. కారుడు యిచ్చిన ఉదాహరణలోగూడ 'అన్యము' అను అర్థం రావడమే లేదు: "తే. కౌరవులనేమ మెల్ల వేర్వేర నడిగె" ఇందులో గూడ 'పృథక్' అను అర్థంలోనే...౧).

మామిడి—'ఆమ్ర'కు వికృతం. స్వరభక్తి (Anaplyxis) వల్ల > ఆమరగా మారి > *ఆమిడి > మామిడిగా మారి వుండొచ్చును. అనునాసికవ్యంజనప్రభావం వల్ల పూర్వ'స్వరం' అనునాసికవ్యంజనంగా మారడం తెలుగులో సాధారణంగా కనిపిస్తోంది. (ఉదా: ఏను=నేను).

కొనుట—ప్రయోగం:- ఆ వస్తువు ఎంతలో కొన్నావు?' మైథిలీ ఆది కొన్ని హిందీ ఉపభాషల్లో 'కినల్ - కిననా' శబ్దాలు ప్రయోగం వున్నాయి.

*చత్త—ఈ శబ్దం గ్రామీణంనుంచి సాహిత్యంలోకి యింతవరకు ఎక్కిందో లేదో! కాని పల్లెటూరివాళ్లు తరుచుగా 'చెత్త చదారం' అని తరుచుగా వాడుతూనే వున్నారు. ఈశబ్దం అపభ్రంశకవితలో 'చత్తఉ' రూపంలో కనిపిస్తోంది. ఇది సంస్కృత 'త్యక్త'కు వికృతం—వికాసం.

తొక్కు—ఇది సంస్కృత 'త్వచ్'కు వికాసం. దీన్నిమనం త్యజించవలసిన కాయలు మొదలగువాటిపై 'పెచ్చు'కు వాడుతున్నాము. 'చత్త' అర్థంలో గూడాను.

---

౧. ఇటువంటి భ్రామికాలింకా యెన్నోవున్నాయి కాని ప్రస్తుత వ్యాసోద్దేశ్యము శ. ర. న్ని విమర్శించడం కాదు.—నాను.

పెట్టుట—ఈశబ్దం అపభ్రంశకవితలో 'పిణు' రూపంలో కనిపిస్తోంది. ఉదా: ణమ శారే పిణు = నమస్కారములు పెట్టి.[3]

పోయినకొలదీ గ్రంథం పెరిగిపోతోంది. నమూనాకు ఈశబ్దాలే చాలు. సాధ్య మయినంత త్వరలో ఉడతలాగు ఆంధ్ర-ఆర్య భాషలమధ్య వారధి కట్టడానికి నేను చేసిన పరిశ్రమ (? అప్రకాశితమూ, హృద యస్థమూ) ను చిన్ని వ్యాసరూపంలో ఆంధ్రులముందు ఉంచుతాను.

ఇంతకూ పర్యవసానం ఏమిటి ?

మనకు సమగ్రమయిన నిఘంటువు కావాలంటే గ్రామీణశబ్దాలనుకూడ ఆద రించాలి— వాటికి స్థాయిత్వం యివ్వాలి. నింద్యాలనబడు మాండలిక గ్రామ్యశబ్దాలను కూడ గ్రహించాలి. (నెల్లూరులో వాడు 'బెంబేలు' శబ్దం శ. ర. లో కనిపించ లేదు) ఛాందసులగు మన పండితులు దేశభాషను (ప్రాచీనాంధ్రాన్ని) నిరసించబట్టే గదా ఆంధ్రానికి నేటీ కీగతిపట్టింది! [4]యుగప్రవర్తకు లిద్దరు తమ అమర సందేశాన్ని వదిలిపెట్టి వెళ్లారు! ఇంకా మనం కళ్లు తెరువకపోతే ఎలా?

శ. ర. లో ఎచ్చటా వైకృతాలకు మూలం యివ్వలేదు. మూలం యివ్వడం చాల ఆవశ్యకం. మూలం యివ్వనంతవరకు 'నిఘంటువు' పూర్ణం కాజాలదు. మూలం దేశ్యా లనబడు శబ్దాల మూలాన్ని గూడ కనుక్కోవాలి. ఇందుకుగాను విస్తృత అధ్య యనంకావాలి — హిందీ, బెంగాలి, ఓఢ్రం, మహారాశి, కన్నడం, తమిళం మొదలగు వున్నతభాషలను ఆంధ్రపండితులు (నిఘంటు నిర్మాతలు) వీలైనంతవరకు నేర్చుకోవాలి. మహారాశీకి తెలుగుకు విశేషసంబంధం యిచ్చినందువల్ల 'నిఘంటువు'లో ఒక విధ మయిన 'వెలుగు' ప్రసరించగలదు. వున్నట్టు కనిపిస్తోంది. వర్తమాన హిందీ (రాష్ట్రభాష=ఖడీబోలీ) కన్న దాని ఉపభాష లగు మైథిలి, మగహీ, భోజపురి, అవధి ఆది భాషలతో తెలుగుకు దగ్గర చుట్టరికం ఉన్నట్టు కనిపిస్తోంది*. కావున యింత అధ్య యనం వున్నప్పుడే దేశ్య మనబడు మనశబ్ద జాలం 'వెలుగు' లోకి రాగలదు. అదీగాక 'తెలుగు'ను ఆర్యభాషాకుటుంబంలో కలప డానికి ప్రాకృతఅపభ్రంశాలను ఆంధ్రవిద్వాం సులు అధ్యయనం చెయ్యాలి. ప్రాకృత అప భ్రంశాలమీదఅధికారం(పాండిత్యం)వుంటేనే మనం ఆంధ్రానికి 'ఆర్యజీవం' పొయ్య గలము.

తెలుగు వాఙ్మయం ఆద్యోపాంతంగా చదివి చక్కని బృహత్ నిఘంటువు తయారు చెయ్యవచ్చును; (ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు చేస్తున్నట్టు). కాని ఇందువల్ల 'కాయం' పెరుగుతుందే కాని నిఘంటు హృదయం విశాలం కాజాలదు.

---

3. పైనున్న శబ్దాలు అన్నీ దేశ్యాలని పేర్కొబడ్డాయి. కాని (*) గుర్తు గలవి శబ్దరత్నా కరంలో లేవు. గ్రామ్యా లని విడువబడ్డవేమో!

౪. నన్నయ, గిడుగు.

* ఆయాభాషల నిఘంటువులతోగూడ సహాయం తీసుకోవాలి.

వైజ్ఞానికంగానూ (నూతన పద్ధతిని ?) భాషావిజ్ఞాన సమ్మతంగానూ సమ్యక్కయిన నిఘంటువు మనకు గావాలి.

ఇందుకుగాను పృష్ట భూమి (Back ground) మూలాధారం (Back-bone గట్టిగా వుండాలి. అంటే ఆంధ్రుల్లో భాషా విజ్ఞానం (Philology) వ్యాపించాలి. భాషా విజ్ఞానవ్యాప్తివినా సమగ్రమయిన నిఘంటువు తయారు కావడం కష్టమేగాదు, అసంభవం. భాషావిజ్ఞానవ్యాప్తివల్ల వాఙ్మయంలో-జాతిలో ఒక విధమయిన 'కాంతి' ప్రసరిస్తుంది. భాషావిషయక రూఢిబంధాలు పుటుక్కున తెగిపోగలవు. తెలుగులోని ప్రతి శబ్దం విద్యుత్కణంలాగు కనిపించ గలదు.

మన శబ్దాల రూపు నిర్ణయానికి ధ్వని విజ్ఞానం (ధ్వనిశాస్త్రం = Phonetics) లో గూడ విస్తృత అధ్యయనం వుండాలి. ఆంధ్ర ధ్వనుల ధ్వన్యాత్మక (Phonetic) ప్రగతి (వికాసం) ఒక విచిత్రరీతిని కలిగింది. ఈ విచిత్రతే ద్రావిడసముదాయంలోనుంచి 'ఆంధ్ర వర్గం'గా ఏర్పరచింది. ఆంధ్ర(తెలుగు) ధ్వని విజ్ఞానంమీాద స్వతంత్రంగా అన్వేషణ జరగాలి. 'ఆంధ్రభాషాచరిత్ర' లో ఆంధ్ర ధ్వనులమీాద వైజ్ఞానికచర్చ జరగ లేదనే చెప్పాలి. జరిగి అయినా నామమాత్రానికే. అయినప్పటికీ చిలుకూరి నారాయణరావు గారు తామిచ్చిన వాగ్దానం త్వరలో పూర్తి జేసి తెలుగుకున్న యీ కొరతను కొంతవరకైనా తీరుస్తారనే నా ఆశ!

---

# ప్రావృట్కాలము

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

సెలయేరుజలముల జేర్చువాడ వటంచు కూనరాగాలతో కులుకుచుండ,
కొనయూపిరిగ దాల్చి గోడొందుతృణములు, వచ్చుచున్నావంచు ప్రమదమంద
పిల్లగాలులు గూడి ప్రేమమీరగ నీకు నతులితరీతి జోహారు లొసగ,
నీలిమబ్బులు నీదునెయ్యము నాసించి వింతగా నింగిపై గంతు లిడగ,
విజయఘోషల నురుములు వెలయువేళ - మెఱుపు కిన్నెఱకాంతతో మేలమాడ
రాజఠీవిని ప్రకృతి సరాసరికిని - వర్షకాలము వచ్చితే హర్షమెలయ।

సాయుని మండుటెండలకు బానిసయైన వసుంధరాసతిన్
ఆయువు నిచ్చి గాచితివి, హర్షము గూర్చితి వర్షధారతో !
సాయము లేక జీర్ణమయి చచ్చినయట్టివి గడ్డిపోచలన్
నీ యభిమాన మెందులకొ ? నిల్వగజేసితి నూత్నశోభతో !

అందమునందు మేటి నని హాయిగ తారలచెంత కేగుచున్
విందులలో మునింగి, యొక ప్రేమపిపాసిగ చంద్రు డుండ నీ
వెందుల కట్టిసౌఖ్యమును యేటిలో గల్పితి నీలిమబ్బులే
వందరజేసె నాతనిని! భావ్యమె నీ కిది వర్షకాలమా ?

మర్మము లేనిజీవనము మా దని వాదన జేయునట్టి యా
కార్మిక కర్షకావళుల గాచెడు దాతలు లేనివేళ నీ
ధార్మిక మేడ నేర్చితివొ ! తండ్రిగ, గాచి జలంబు లిచ్చితే !
నిర్మలమైన నీ మనసు నేర్పదె పాఠము నాంధ్రజాతికిన్.

ఆకటిచిచ్చుతో వెతలనందు నభాగ్యులు బిచ్చగాండ్రు! యే
వాకిటి కేగలేక, జడివానలలో బడి రక్షలేక నీ
ధాకకు దాసులై యచట డస్సిరి గాంచితె! వర్షకాలమా !
ఈ కలికాలమందు లభియింపదు ధర్మము మచ్చుకేనియున్.

గానవిశారదుండ నని గర్వము నందుచు, మన్ను మిన్నులన్
గానక, నొక్కపెట్టుగను కంఠము నెత్తుచు బాడు కోకిలన్
యేనడియేటిలో మునిచి తెంతటి ఘోరము! వర్షకాలమా !
వానల హోరు తక్క నిక వాంఛిత మెద్దియు నీకు లేదొకో !

పిడుగులె, నేస్తకాండ్రనుచు, ప్రేమధనాన్వితు లంచు వారితో
దడబడకుండ నేగెదవు! ధాత్రియ వాఱల దూరుచుండు, నే
యిడుముల నందెదో తెలియ, దింత యమాయకు డైనవానికే
పడతి మెఱుంగుతీగ సమభాగిని యాట విచిత్రమా గదా !

# ప్రభాత పూజ

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

నీపూజవేళ సన్నిహిత మైనదిలే! ది
శాపాండిమజ్యోతి వ్యాపించినదిలే!
పదిలముగ నునులేత
హృదయముల నవపూత
పరిమళములే బ్రదుకుపళ్లెరము నిండినవి!
నీపూజవేళ!

అప్రతిమాన మీ ఉదయహర్ష సమీరవిహారకేళి! నా
కీ ప్రకృతిప్రతోళికల నెల్లెడ తోచు పవిత్రభావనా
దీప్రమధూళులే! అనుమతింపుము నీచరణాబ్జసేవకున్,
కప్రపుకమ్మవాసనలు క్రమ్మ నొసంగెద నా నివాళులన్.

లలితమనస్కుడన్, తళతళల్ పొడసూపగనే విహాయసాం
చలముల చంచలాలతల సఖ్యము నాన యొనర్తు, అట్టినా
అలరుటెడంద నీ ఉదయహాసమరీచులు సాగి సోత్సవో
జ్జ్వలసుఖనీయగానము దెసల్ ప్రసరించగ ప్రోత్సహించెడున్.

ఎచట చూచిన నవ్యరుచులు తులకించు ఈ
ప్రకృతి సర్వమ్ము నీప్రతిబింబముగ తోచు
నీ పూజవేళ!

ఇది సకలమ్ము సుందరము, ఇంకను మోహనమున్, ప్రమోదనం
పదలకు తానకమ్మును, దివస్సముదారసుహాసినీముఖా
బ్జదరవిలాసహాసరుచి, పౌర్ణమి రేల స్రవించు చంద్రికా
ప్రాదరఝరి, అవ్యయవ్యసనహారి సుగంధిలసూనదామమున్.

దీని ధరింతునా గళము దివ్య పరీమళమున్ వెలార్చగా?
పానముగా మనోజ్ఞసుషమావికసద్రుచు లానుచున్, విలో
లానిలమట్లు నిశ్వసనలాలసతన్ ప్రసరించి పోదునా?
స్నాన మొసర్తునా రుచిరజాహ్నవి ఈ నవభావవాహినిన్?

నామనస్సున మసృణతేజోమయ ప్ర
పంచమాంగళ్యములు విప్పి పాడుకొనెదు

ఈ సుధాస్మేరసౌందర్య మీప్రభాత
సరళసమయము పూజాప్రసన్నమయ్యె.

ఈ విధి నేకరీతి ప్రవహించు ప్రమోదఝురాన తేలి పో
గా వలతుఁ సుఖమ్ము మెయి, కాలకుజమ్మున రాలిపడ్డ తే
జో విదితప్రసూనముగ, సొంపులు కుల్కెడు మేలిముత్తెపుఁ
నావగ, నన్ను పెల్లిజియ నగ్గెలకుల్ మృదుహాసఫేనముల్.

ఎట కనినఁ ప్రహర్షము హాసించు ముఖాబ్జము లారయఁ సము
త్కటముగ సోకు ఈ సుఖసుధామయవీచిక, లీరసాబ్ధికిఁ
తటము లెరుంగగాబడవు! ధన్యుడ నీయుషసి ప్రభావళీ
నటనములో త్వదంఘ్రినలినమ్ములపూజ రయొనర్పగల్గితిఁ.

నీ పూజవేళ సన్నిహిత మైనదిలే! ఇ
దే పుణ్యలావణ్యమో పొంగినదిలే!

---

# శిథిల హృదయాలు

శ్రీ భమిడిపాటి సోమసుందరశాస్త్రి

పూర్వకాలంలో మనవాళ్లు చెప్పిన జాతకాలు ఫలించేవి. అప్పుడు మనపూర్వులుచేసిన మహానిష్ఠలూ, వంశాచారాలూ, వర్ణగౌరవాలూకూడా కారణాలై వుండవచ్చును. ఇప్పు డవన్నీ నశించగా జాతకాలు మట్టుకు మిగిలాయి. ధనలోభంచేత ప్రతీజోస్యుడూ మంచినే చెప్పడం – ఉన్నా లేకపోయినా. పైగా జోస్యుడి అశక్తతకూడా ఒక ముఖ్యకారణం అయి వుంటుంది సాధారణంగా ఇప్పటి జాతకం నిజం కాక పోవడానికి. కొందరు జ్యోతిష్కులు – అబద్ధం అవుతుం దన్నభయంచేతో – నిజం చెబితే ఎక్కడ కష్టపడతారో అని చెప్పరు. మా నాన్నకూడా ఒక జ్యోతిష్కుడు. అటువంటివాడే ... ఎవరికీ సాధారణంగా చెప్పడు. ఒకచోట చెబితే రైటైందేమో. అందుచేతే పేరు వచ్చి వుంటుంది.

*　　*　　*

ఆమెకు చిన్నతనాన్నే జాతకం చూపించారు. ఆ జోస్యుడు ఆమెజాతకంలాంటి జాతకం మరెక్కడా చూడలేదనీ, ఆమె మహాసుఖం అనుభవిస్తుందనీ, సంతానవంతురా లవుతుందనీ, భర్త గొప్ప వుద్యోగస్థు డవుతాడనీ ఇంకా యెన్నో మహాసంగతులను వాక్రుచ్చాడు. అందుచేత "మన అమ్మాయికి ఎక్కడి సంబంధం వచ్చినా ఒక్కలాగే నడుస్తుంది. అదీ మన-దాని-అందరి-అదృష్టమే" అని భావించారు ఆమెనాన్నగారు. ప్రతీచోటా తమకూతురిజాతకమే వర్ణిస్తూ, ప్రతీచోటా ఆమె సౌందర్యమే వర్ణిస్తూ-కాలంగడిపారు ఆమె తల్లిదండ్రులు.

ఆజోస్యుడు అమ్మాయి పుట్టింటి సంగతులు చెప్పాడు. అవి అన్నీ ఇంచుమించు నిజమే. ఆమె మహాశాంతవంతురాలు. ప్రశాంతహృదయ, అమాయక జీవి. అసాధారణ సౌందర్య. ధర్మబుద్ధిగలది. పతివ్రత......

అమ్మాయికి పెళ్లి అయి నాలుగేళ్లయింది. అత్తవారింటికి కూడా వెళ్లిపోయింది. అప్పట్నుంచీ తమకూ వాళ్లకూ దెబ్బలాటలే. దేవుడు వరం ఇచ్చినా పూజారి ఇవ్వడన్నట్టు అల్లుడు మంచివాడయినా అత్తగారూ మామగారూ కోడలిని పుట్టింటికి పంపే వారు కారు. అల్లుడు ఏవుద్యోగం చెయ్యకుండా ఇంటి దగ్గరే కూర్చున్నాడు కనక అందరికీ లోకువయ్యాడు......

ఆమె తనకు ఒకర్తే సంతానం. పోనీ కూతురినీ, అల్లుణ్ణీ తన దగ్గరకే తెచ్చుకుందామంటే ఆకుర్రాడు కూడా వాళ్లకు ఏకైకపుత్రుడు, కాని అమ్మాయికి ఆమె సవతి అత్త...అదేవాళ్ల దెబ్బలాటలకు ముఖ్య కారణం. స్త్రీ తలుచుకుంటే లోకాలన్నీ నాశనం చేస్తుందన్నమాట వుత్తదవుతుందా?

తాను ఒక్కసారీ తనకూతురిని కరువు దీరా చూడలేదు కదా అని విచారించాడు. ఇంకా అప్పటి జ్యోతిష్కుడి మాటలు ఆయనకిళ్లో వున్నాయి ఎండా వానలకు సహించి.కృశీభూతుడైనా-ఆ అమ్మాయి రూపాన్ని మనస్సులో సంస్మరించి-ఆ ఆశతోటే సజీవుడై యున్నాడు ఆయన.

*　　*　　*

"సుగుణా! ఎందుకీవేళ అంతభారంగా వున్నావో నాకు చెప్పవూ? ఎందుకూ, అంత కష్టపడి ఆ పనులు చెయ్యకపోతే యేం?...కొంతసేపు విశ్రాంతి తీసుకోకూడదూ?"

"నే నెల్లా వున్నానూ?......మామూలుగానే వున్నాను. నాకు మీరు అల్లా వుండడం కావాలిగాని, ఇంతకన్నా ఏ సుఖం కావాలి నాకు చెప్పండీ?"

"ఏం సుఖం పడుతున్నావు సుగుణా? ఇంకా అల్లా అంటావు. మా అమ్మ నిన్ను పెట్టే బాధలు అన్నీ చూస్తే—"

"అయ్యో—పాపం ఆవిడ నన్నేమీ అనడం లేదే? ఆవిడ చాలా మంచిమనిషి. ఆవిడ నేమీ అన కండి. పాపం వస్తుంది. లేనిపోని మాటలన్నీ అను కుంటే ఏమిటిలాభం?"

"ఇంకా యెందుకు సుగుణ్ నాదగ్గిర అబద్ధం ఆడతావూ? నాకు చెప్పవూ నీబాధలు? ఎందుకు దాస్తావూ నాదగ్గిర? నే నెవరితోనూ చెప్పను. నా తోటి చెప్పవూ?"

"నేను ఏంబాధలు పడుతున్నాను చెప్పండి? మీరు అల్లా వుండడంకన్నా నాకు ఏంకావాలి?"

"ఇంతకూ నేను వుద్యోగం సంపాదించలేక— వెధవ మెతుకులు తింటూ నిన్ను బాధ పెడుతున్నాను. ఇందుకా నిన్ను కట్టుకుంటా? అబ్బా! నిన్ను ఎంత కష్ట పెడుతున్నానూ?"

"అబ్బా? వూరుకోండి. ఇలాంటి ప్రసంగాలే ఎప్పుడూ చేస్తారు. మీరు నన్ను ఏంబాధ పెడు తున్నారూ? నే నేంబాధ పడుతున్నాను?...ఇంతకూ నన్ను ఇక్కడికి ఇప్పుడు ఎందుకు పిల్చారో?"

"ఎందుకూ లేదు. కాస్తసేపు నాదగ్గిర కూర్చో కూడదూ?...అక్కడేంపని మించిపోతోంది?"

ఇంతట్లోకి ఆమెఅత్తగారు వస్తుంది—రైలుబండి అంతవేగంతో. "ఇక్కడేం చేస్తున్నావే? అయ్యో, అయ్యో! గదిలో దూరికూచుని మొగుడుగారితో పరి హాసా లాడుతున్నావా? ఎంతటిదానివే! ఎంతటిదాని వేనా తగుదువు! ... నే నంటూ ఒకత్తిని ఇక్కడ వున్నాను కనక అంతటితో ఆగావు ... లేకపోతే మొగుణ్ణికూడా బుట్టలో వేసేసే దానివి — ఇప్పటికే వేశావులే! ... అల్లా చూస్తూ నుంచుంటావేం! స్తంభం లాగ?— నీకు కావూ చెపుతూంటా?" — అతనిపై పురు తిరిగి — "నీ కేమీ పనీ గినీ లేదూ? — దాని నేంపన్లూ చెయ్యనియ్యవూ? — నే నొక్కత్తినే అవంటపొయ్యి దగ్గిర చచ్చేదాన్ని?—ఔరా! ఎంతటివాడవౌదువురా!... అస్తమానమూ ఇంట్లో తీరికూర్చుని ఇదా నువ్వుచేసే పనీ?" అని ఒకసాక్షీఉపన్యాసం కొట్టి—గగ్గయ్యలాగు గద్దించింది, "నే నూరుకుంటానూ— నడూ—చూస్తావేం?" అని. అప్పు డామె ఏమీ జవాబు చెప్పకుండా వెళ్లి పోయింది. ఇంకా ఆవిడనోట్లో ఉద్రేకంలో మిగిలిన ఆఉపన్యాసధా రంతా వాకిట్లో కూర్చున్న తన మొగుడుమీద దులిపేసింది.

ఒకరోజున అతనికి జ్వరం వచ్చింది. భార్యను పిల్చి అన్నాడు. "సుగుణ్! నాకు ఈరోజున ఒంట్లో బాగులేదు. నేను అన్నం తినను. నాకోసం గంజి ఉడకపొయ్యద్దని మహారాణీగారితో చెప్పు ... నాకు కొంచెం మిరియాలకషాయం పట్టుకురా."

వెళ్లి మిరియాల కషాయం పట్టుకుని వచ్చింది. అది పుచ్చుకొని అన్నాడు.

"సుగుణా! నాదగ్గిర కాస్సేపు కూర్చోవూ? నువ్వు నాదగ్గిర కాస్తసేపు కూర్చుంటే నేను ఎంతో సంతోషపడతాను. నేను చేసిన పాపాలకు పశ్చాత్తాప పడగలుగుతాను. ఒక్క నిమిషం నువ్వు నాదగ్గిర లేక పోతే నేను ఎవరికో ఎంతో బాకీపడ్డా నన్నట్టుగా నాహృదయం ఎంతో వేధిస్తుంది...నాదగ్గిర కాస్సేపు కూర్చోవూ? నాతోసంతోషంగా ఈవేళకూర్చోవూ— అబ్బ! ఎంత ఎల్లా చిక్కి శల్యం అయిపోయావూ! సుగుణా!"

అతను పడకకుర్చీలో జారగిలపడిపోయాడు... కళ్లంబడి అశ్రుధారలు కురిశాయి. చొక్కా ముందు భాగం అంతా తడిసింది. ఒక్క నిమిషం కళ్లు మూసు కొన్నాడు...

ఆమె జబాబు చెప్పలేకపోయింది. భర్త యొక్క ఆరోగ్యం బాగులేదనుకొని ఎంతో విచార పడింది...కాళ్లదగ్గర కూర్చుని కాళ్లు పిసకడం మొదలు పెట్టింది...

"చూడండి! ఈవేళ అత్తగారు కందులు వేయించు దామనుకుని, నిన్నరాత్రి కలనొప్పి వచ్చిందన్నారు; అంచేత నన్ను వేయించమన్నారు. పాపం నేను అవి వేయించకపోతే ఆవిడ ఒక్కత్తీ బాధపడరూ?"

"ఆహా! సుగుణా! ఎంతదయార్ద్రహృదయు రాలివి!...ఎంత అమాయకజీవివి!...ఎవరుశత్రువులో ఎవరు మిత్రులో తెలిసికోలేవుగదా!" అని మనస్సులో అనుకున్నాడు...పైకి అన్నాడు.

"సుగుణా! నీ వొళ్లు ఎంత వేడిగావుంది! అబ్బ! ఎంత ఆయాసపడుతున్నావూ!...ఎంతనీరసం!...ఆ దిక్కుమాలిన కందులు ఆనిప్పు దగ్గిర కూర్చుని ఈవేళ వేయించకపోతే యేం సుగుణా? ఇల్లారా. దగ్గిరగా కూర్చో. నాకు కాళ్లుపిసకక్కరలేదు." ఆమెజుట్టును తన వేళ్లతో దువ్వడం మొదలెట్టాడు.

"జ్వరంవచ్చినవాళ్లకు కాళ్లు నొప్పి పెడతాయి. అందుకు పిసికాను. పాపం మీ అమ్మ నిన్న రాత్రి కాళ్ల నొప్పిచేత ఎంత బాధపడ్డారు!"

"సుగుణా! ఆపాపిమాట నాదగ్గిర మాట్లాడకు! నాకు నొప్పి పెడుతుంది తల, ఆ పనికిమాలిన సంగతులు వింటేను. నేను శక్తి విహీనుణ్ణి అయిపోయాను గాని లేకపోతే ఆమెను ఈపాటికి ఎంతపనైనా చేసే వాణ్ణి—"కొంచెంసేపు ఆగి—"అబ్బ! సుగుణా! ఎంత నీరసంగా వున్నావు! ఎంత తేజోవిహీనమైవుంది నీశరీరం! ఇంకా నిన్న ఎవరూ బాధపెట్టడంలేదంటావు. ఇందులో ఏమైనా అర్థం వుందా?...ఎందుకూ నాదగ్గిర దాస్తావూ అవన్నీ నీ?"

"ఇంకా యెందుకు పనికిమాలిన ప్రశ్నలు వేస్తారూ? ఒకమనిషికి కావలసిన సుఖం వున్నప్పుడు ఎన్నికష్టాలు పడితేనేయేం? అవి లెక్కలోకి రావు."

"ఇప్పటికీ చెప్పవుకామూ, సుగుణ్?...పోనీ నే నొక్క ప్రశ్న అడుగుతాను చెబుతావా?"

"అడగండి! నేనేమైనా చెప్పనన్నానా?"

"అయితే సుగుణ్ నువ్వు మీవాళ్లయింటి దగ్గిర నుంచి వచ్చి ఎంతకాలం అయిందీ? పదేళ్లుకాదూ?"

"ఔను."

"ఇప్పుడు మీ నాన్న నీకోసం ఎంత బెంగ పెట్టుకుంటాడో నీకు తెలుసునా?"

"అబ్బ! ఆగోడవలన్నీ యిప్పుడు ఎందుకూ? వాటివల్ల ఏం ప్రయోజనం?"

"ప్రయోజనంకోసం అని కాదుసుగుణ్! మనం చేసే దిల్లాగూ" లేదు. తల్చుకుంటేయేం?

"చేసేదిల్లాగూ లేనప్పుడు తల్చుకొంటే యేం ప్రయోజనం?"

"అయితే తప్పక చేస్తాను...అందుచేత తల్చుకుంటాను."

"అయితే యిదివరకున్న పన్నీ పట్టినే?"

"సుగుణ్! నిజంగా నే నడుగుతున్నాను. ఈ ప్రశ్నకు జబాబు చెప్పు. లేకపోతే నన్ను చంపుకు తిన్నట్టే. నీకు నిజంగా మీ అమ్మనూ—నాన్ననూ చూడాలని వుందా? లేదా?"

"వుంటేయేం? లేకపోతేయేం? నాకు సుఖాన్ని కలగజేసే మీ రల్లా వుంటే చాలు. ఇవన్నీ ఎందుకూ?"

"అల్లా అనకు సుగుణ్. నేను ఈసారి నీకోరిక తీరుస్తాను ... నామనఃపూర్తిగా – త్రికరణశుద్ధిగా – గాయత్రి సాక్షిగా చెబుతున్నాను. నువ్వు నీమంగళ సూత్రం సాక్షిగా నిజం చెప్పు! ఇంకా ఎన్ని ఒట్లు పెట్టిస్తావూ నాచేత?"

"అమ్మనూ నాన్ననూ చూడాలని ఏస్త్రీకి బుద్ధి వుండదూ? అది ప్రతిభారతస్త్రీకీ వుండాలి ... లేనప్పుడు స్వరాజ్యంకోసం ఎవరు పాటుబడతారూ?"

"నిజం చెప్పావు, సుగుణ్. చెబుతున్నాను విను. నీసుఖంకోసం అయితేనేం, నాస్వేచ్ఛకోసం అయితేనేం, ఈ తుచ్ఛజీవితంతో కూడిన ఈ గృహాన్ని నేను విడిచేస్తున్నాను."

"అయితే వుద్యోగంకూడా రాలేదుకదా, ఎక్కడికి వెడదామనీ?"

"ఉద్యోగంతో ఏమీ సంబంధం లేదు. నేనూ నువ్వూకూడా మీ పుట్టింటిదగ్గరే వుందాము."

"అటువంటి చొరవ చెయ్యకండి. నామాట వినండి. స్వగృహాన్నీ, తల్లినీ, తండ్రినీ విడిచి వెళ్లకమా! మానవులకు స్వస్థలంలో గౌరవమర్యాలు దక్కుతాయి. ఎల్లాగయినా స్వగృహం గుట్టును దాస్తుందని యెరుగుదురా?"

"నాకు ఏమైనా గుట్టులు వుంటేగా దాగడానికీ. నాకు వుద్యోగం ఏమీ లేదని అందరికీ తెలియనే తెలుసును...నాకు నీ మెట్టవేదాంతాలు బోధించకు సుగుణ్. స్వగృహంలోనే గౌరవమర్యాదలు లేనప్పుడు అది 'స్వ' గృహం ఎల్లా అవుతుందీ? ఎక్కడ మనిషికి స్వేచ్ఛాజీవితంతో స్వాతంత్ర్యేచ్ఛ అభివృద్ధి పొందుతుందో అదే స్వగృహం—అంతేగాని ఇటువంటి తుచ్ఛగృహమా 'స్వ'గృహం? కానీ, సుగుణ్! నేను చెప్పినదానికేమీ అడ్డు చెప్పకేం?—ఇది 'నేను' ఆజ్ఞాపించినదని తెలుసునా?"

"అవును. మీరు చెప్పినదానికి అడ్డు చెప్పను."

"మనం అక్కడికి వెళ్లి మన జీవితాంతంవరకూ అక్కడే వుండాలి."

"అవును – జీవిత పథాంతం అక్కడితోనే పూర్తి."

"ఇంక మళ్లీ ఈ పొంపులనుగాని, ఈ గృహాన్ని గాని తొక్కకూడదు."

"చూడ్డానికి కూడా కాలం ఇవ్వకద్దు!"

"రక్షించావు సుగుణ్! నేను చెప్పినవి ఏవి తిర స్కరించినా ఆఖరుకు నా ప్రార్థన అంగీకరించావు. నువ్వూ నేనూ కూడా కలిసే మీవాళ్లు ఎంతో సంతో షిస్తారు. నన్ను చూసి ఎంత జాలిపడతారూ!...నిన్ను చూసి—చిక్కిపోయిన నిన్ను, శల్యమైన నిన్ను చూసి ఎంత దుఃఖిస్తారూ! అప్పుడు నీకూ నీ ఆరోగ్యానికీ బాధ్యత తీసుకున్న నేను ఇప్పుడు ఏమని జవాబు చెప్పగలనూ?"

భార్యతండ్రివద్దనుంచి తంతివార్త వచ్చింది.

"చాల జబ్బు; అమ్మాయిని పంపవలె"నని.

తన ప్రయాణాన్ని నిశ్చయం చేసుకుని వాడే బయలుదేరాడు—తల్లి దగ్గిరా తండ్రి దగ్గిరా సెలవు తీసుకుని!

*   *   *

అమ్మాయీ, అల్లుడూ చేసిన పరిచర్యలచేత నైతేనేం, అమ్మాయిని మళ్లీ చూశాననగదా అన్న సంతోషంచేతనైతేనేం, రోగిజబ్బు నిమ్మళించింది. 'స్వేచ్ఛగా — మొదట్లోకిమల్లే — వుంది శరీరం' అన్నాడు.

"వుద్యోగం లేకపోతే మీ అమ్మచేతా నాన్న చేతా మాటలు పడకపోతే ఇక్కడికి వచ్చెయ్యకూడ దుటోయ్."

"నాన్నా, చెబుతున్నాను. విను. ఆయన రోజూ ప్రయాణం అవుతూనే వున్నారు. నేనే ఆపాను."

"అమ్మాయీ! నువ్వు ఎంత చిక్కిశల్యం అయి పోయావూ! ఎంత సౌందర్యాన్ని ఎల్లా నాశనం చేసు కున్నావూ! నీ తేజస్సు ఎంతశోభావిహీనమయింది! ఎంత కళారహిత మయిందీ!"

"నాన్నా! నీకు నాబాల్యం జ్ఞాపకం లేదు. నేను ఎప్పుడూ యిల్లాగే వున్నాను..."

తండ్రి జవాబు చెప్పలేకపోయాడు ... భర్త దుఃఖించాడు...

*   *   *

సుగుణ అంతకంతకూ కృశించిపోయింది ... ఆమెకు ఏదో మనోవ్యాధి పట్టుకుంది. అదే ఆమెను పీడించింది. అది ఎవ్వరూ కనిపెట్టలేకపోయారు. ఆమె భర్త కొద్దిగా గ్రహించినా, ఆమెదగ్గిరనుండి ఆ సంగతులు పూర్తిగా తెలుసుకోలేకపోయాడు...

ఆమె నాటికినాటికీ చిక్కి శల్యం అయిపో యింది. అనేకడాక్టర్లు ప్రయత్నించారు ... విఫలు లయ్యారు...

ఆమెరోగం వృద్ధి అయింది. అదికూడా ఆమె తెలియనీయలేదు. మామూలుగానే మాట్లాడ్డం మొదలు పెట్టింది.

"నాన్నా! నాకోసం మరోపని మానకు. నాకు రోగం తిరుగుమొహం పట్టింది. క్రమక్రమంగా తగ్గ తుంది...నాకోసం బెంగపెట్టుకోకండి ... అధైర్య పడకండి. డాక్టర్లు కుదర్చలేరు —" కొంచెం ఆగి– "మరేమీ భయపడద్దు. రోగం ఇంతకన్నా మితి మీరదు..."

సాయంకాలం కావొచ్చింది. సూర్యభగవాను డొకమూలనుంచి అస్తమిస్తూంటే-మరొకమూలనుంచి అంధకారం ఆవరిస్తోంది—ఆగి–ఆగి...

ఆమె అన్నది. "నాన్నా! నిజం చెబుతున్నాను. నాకు కాలం సమీపించింది. ఇంక ఆగేదిలేదు. నేను వెళ్లిన తరవాతకూడా ఆయన్ని ఇక్కడ ఉండ నియ్యండి ఆయన సుఖంకోసం పాటుబడండి.

"నాకోసం మీరు మీ సౌఖ్య ప్రవాహానికి అడ్డుపెట్టకండేం! నామీద మీరు నిజంగా ప్రేమగల వారు వొతే ఇక్కడనే అనుతారు–ఎల్లకాలమూను..."

తిరిగి ఆ శిథిలహృదయులను చూసి–తన హృద యావేదనచేత అంది.

"అత్తకూ, మామకూ నా నమస్కారాలు చెప్పం డి...మరిచిపోకండి..."

# గంగాధర స్తవము

శ్రీ దర్భా వేంకటకృష్ణమూర్తి

జననంబే మఱి లేదు జీవునకు నజ్ఞానాత్మకం బైన యా
ఘనమాయావరణంబు దాఁ దొలఁగినన్ గైవల్యసామ్రాజ్యమే
కన నౌఁ, బైపొర వీడునేని మొలవంగా నేర్చునే క్రమ్మఱన్
ఘనయత్నంబుననైన బీజ మది లోకంబందు గంగాధరా!

శ్రద్ధాహీనున కబ్బఁబోదు పరమార్థం బెందునేన్, గన్య దా
నిద్ధాత్రిన్ ఋతుమంతురాలయినఁగా కెబ్భంగి గర్భం బగున్?
శ్రద్ధాయుక్తి యు యార్తవంబు, గురు శశ్వద్బోధమే వీర్య, మా
సద్జ్ఞానమె గర్భ మౌఁ, గొమరుఁ డానందంబె, గంగాధరా!

వేదాంతంబున మున్గి తేలినను నేవేళన్ లవంబేనియున్
సాధుత్వం బది రాదు దుర్జనునకున్ సాధించి శోధించినం
బాథోరాశినిమగ్నుఁడే కద సదా మైనాకుఁ డేమాయెఁ దా
నేదీ మార్దవ మొందఁగాఁ గలిగెనే యింతేని గంగాధరా!

అన్న ద్వేషము నాస్తదోషమును బ్రహ్మద్వేషమున్ గాల మా
సన్నంబైననెకాని కల్గ వని శాస్త్రా లెల్ల ఘోషిల్లఁగా!
అన్నీ గల్గియు నేఁడ దేమొ కలిమాహాత్మ్యంబు గాఁబోలు నో
రన్నా! నాఁటికినాఁటి కభ్యుదయమే యాలింతె గంగాధరా!

కనకమ్మేనియుఁ గాంత యేనియును నిక్కమ్మొక్కటే చాలుఁ బా
వనశీలమ్మును గంగఁ గల్పను మనస్స్వాస్థ్యంబు నాశ మ్మొన
ర్పను, శ్రేయమ్మును గోరువారియెడఁ బాపమ్మున్ దలంపింప, దే
వుని నేనిన్ మఱపింపఁ, దన్మయతనున్ బుట్టింప రెట్టింప, నా
కనకమ్మున్ మఱి కాంతయున్ గలియ నింకన్ జెప్పనా? యంతక
న్న నిలన్ నారకమూల మొండు గలదా? నాతండ్రి గంగాధరా!

ఎద్దానిన్ నరుఁ డాససేయు నదియే యంతేని దాదవ్వగున్
సిద్ధించుంగద యిట్టె దేనిని నపేక్షింపం దొకింతేనియున్

బుద్ధిం జూచిన నింతకన్నఁ గలదే బోధంబు? వైరాగ్యమే
సిద్ధాంతంబుగ సర్వసిద్ధిదము సంసేవ్యంబు గంగాధరా!

ప్రారబ్ధం బనఁ గర్మ మన్న గ్రహచారం బన్నఁ గాలం బనన్
వైరాగ్యంబన జన్మ మన్న విధి యన్నన్ మేలు గీ డన్న సం
సారం బన్న నదృష్ట మన్న దురదృష్టం బన్న నేమన్ననున్
సారం బంతకు నీవ కావె పరమేశా! సర్వ మీ వౌట నా
నారూపంబులఁ దోఁచుచుండు వాకఁడై నాకేల యేగోల ని
న్నారాధింతు ననుగ్రహింపఁగదవయ్యా తండ్రి! గంగాధరా!

జననీగర్భమునందు నున్నపుడుఁ గష్టంబేకదా యావలన్
జననంబప్పుడుఁ గష్టమే యటుపయిన్ జావప్పుడున్ గష్టమే
మనియున్నప్పుడుఁ గష్టమే యిటులు జన్మం బెల్లఁ గష్టాలతో
డనె కాదా తెలవాఱుచున్నయది కష్టా! యిట్టి దౌర్భాగ్యపున్
జననంబున్ బగవానికేని కలిగించంబోకు గంగాధరా!

చుట్టా లెవ్వరు? మిత్త్రు లెవ్వ? రరరే! మా లెవ్వ? రా లెవ్వరో!
కట్టా! యున్నది యున్నటుల్ పలికినన్ గష్టంబెకా యేరికే
నెట్టో కాలము నెట్టుచుండుటయె కాని సౌఖ్యమం చున్నదే?
నట్టేటం బడినట్ల కాదె నరులన్ నమ్మంగ నీ వుండఁగాఁ
బట్టుంగొమ్మవు సర్వజీవులకు దేవా! నా మొఱాలించి నన్
గట్టుం జేర్చుము తండ్రి! నీ కిదె నమస్కారంబు గంగాధరా!

కాశిం జచ్చినవారి కబ్బునఁట మోక్షప్రాజ్యసామ్రాజ్య మో
యీశా! కాశికిఁ బోవ నందఱకు నౌనే? నీ కృపాదృష్టిచే
ఆశాపాశముఁ ద్రెంచుకోఁగలుగుచో నా కాశియే కాదొకో
యీ శారీరక, మిందు నున్నయది యీవే కావె గంగాధరా!

ఏ కాలానకు నేరి కేమి గతియో యెవ్వాఁ డెఱుంగున్ శివా!
వాకున్ గాలము వమ్ముసేయక మనోవాక్కాయకర్మమ్ములన్
నీ కైంకర్య మొనర్చి సంసరణకంథిన్ నేఁ దరింపంగ ని
న్నాకాంక్షింతు ననుగ్రహింపఁగదవయ్యా తండ్రి! గంగాధరా!

# శతకములు

## వైదికావైదిక మతసమన్వయము

శ్రీ బుర్రా శేషగిరిరావు

మన భారతీయ మతచరిత్రలో వేదమును పరమ ప్రమాణముగాను, అపౌరుషేయముగాను అంగీకరించిన మతకర్తలు భారతీయ "దర్శనము"లను వైదికములుగాను, వేదబాహ్యములుగాను శేటాయించి, బౌద్ధజైన దర్శనములను గర్హించినారు. కాని యీ బౌద్ధజైన ధర్మములున్ను వేదవాదములనుండి యనాది కాలమున నుద్భవిల్లినవే. వీటిలో జైనధర్మమింకా మన భారతావనిలో కొంత ప్రాబల్యము కలిగియున్నది. బౌద్ధదర్శనము లోకప్ప డానేకు హిమాచలమున్న బహుజనాదరణము పొంది ఆచరణలోనుండి పలు విధములగు విద్యలకు కళలకు శాస్త్రములకు సాహిత్యములకు ఆలవాలమై యుండినను నేడాధర్మము యొక్క పాడుపడిన కట్టడములయు, విగ్రహములయు జాడలు మాత్రము ప్రఖ్యాతముగా వున్నవి. భారతభూమికి పరిసరములందున్న బర్మా, మలయా, సీలోన్, జావా ప్రాంతములలోనేగాక ఆశియామహారాజ్యములగు టిబేటు, చీనా, జపాన్, మంగోలియా మొదలగు దేశములలో బౌద్ధధర్మమునకే ప్రాముఖ్యము గలదు. ఆయా ప్రాంతములకు పూర్వము మనదేశమునుండియే బౌద్ధ గ్రంథములు గొని బౌద్ధప్రచారకులును వెడలియుండిరి. అప్పటి బౌద్ధులు వచ్చి మనతక్షశిల, నాలంద, పూర్వశిల, విక్రమశిల మొదలగు బౌద్ధ విశ్వవిద్యాలయముల నుండి ప్రమాణగ్రంథములు వ్రాసుకొని పోయిరి. నాగార్జునముని ప్రబోధితమగు "ఆంధ్రబౌద్ధశాఖ" యొకటి ఆనాడు మహత్తరమైన వ్యాప్తిలో నుండెను. దానిలో జీవయాత్ర కనుకూలములగు ననేక "సిద్ధి శాస్త్రము" లుండెను. అందుకే ఆతనికి "సిద్ధనాగార్జును" డని ప్రసిద్ధి కలిగెను. తత్సంప్రదాయకములైన గ్రంథములు కృష్ణా గుంటూరు మండలములలోని యప్పటి బౌద్ధవిశ్వవిద్యాలయములలో బోధింపబడుచుండెను.

నాలందవిశ్వవిద్యాలయము తురకలవల్ల పాడైపోయినట్లు బీహారుమండల చరిత్రవల్ల కనబడుతుంది. అందలి గ్రంథము లెన్నో టిబేటుకు పోయినవి. అవి తిరిగి బీహారుఅండు ఒరిస్సా రీసర్చి సొసైటీ (Behar and Orissa Research Society) వారు తెప్పించి ప్రకటించుచున్నారు.

ఇట్లే గా౹౹.3 లో ప్రారంభింపబడిన బుద్ధిస్టు టెక్స్టు సొసైటీ (Buddhist Text Society) వారు కలకత్తానుండి కొన్ని బౌద్ధగ్రంథములు ప్రకటించి యుండిరి. వాటిలో రామచంద్రకవిభారతి అనే గౌడ బ్రాహ్మణపండితుడు లంకాధిపతియైన పరాక్రమబాహుమహారాజుకు చెప్పి యిచ్చిన "మునీంద్రభక్తి శతకము" అనే వొకశతక మున్నది. బ్రాహ్మణపండితులు బౌద్ధులతో తీవ్రవాదములుచేసి వారిని భంగపరిచి నిర్మూలముకూడా చేసిరని కింవదంతులు కలవు. కొన్ని చారిత్రకగాథలును కలవు గాని బ్రాహ్మణపండితులు బౌద్ధధర్మబోధకమును బుద్ధభగవానుని స్తుతిపరమును అయిన రచనలు చేసినట్లు చరిత్రలు చెప్పవు. కాబట్టి ఇట్టి శతకములు కాలక్రమేణ మనభారతీయ మతచరిత్రలో కలుగుతూవచ్చిన సమన్వయ విశేషములను తెలుపునవై నేటి మనమతవిభేదనిర్మూలనా ప్రయత్నములకు మార్గదర్శకము లగుచున్నవి. కావున "శతక" గ్రంథములలో మతసమన్వయ మెట్లు సూచింపబడుచున్నదో ఈ బౌద్ధశతకము నాధారము చేసుకొని కొంతవర కీవ్యాసములో తెలియపర్చెదను. ఇదే మార్గమని కాదు. ఇది యొకమార్గము,—

పైని చెప్పిన గ్రంథకర్తృకాదివిషయము లీక్రింది శ్లోకములలో వివరింపబడినవి:—

"భాస్వద్భానుకులాంబుజన్మమిహిరే రాజాధిరాజేశ్వరే
శ్రీలంకాధిపతౌ పరాక్రమభుజే నీత్యా మహీం శాసతి,

సద్గాడః కవిభారతీతి సురః శ్రీరామచంద్రః సుధీః
శ్లోకానామకరోత్ స భక్తిశతకం ధర్మార్థమోక్షప్రదం.

నృపః పరాక్రాంతిభుజో మహీభుజాం
శిరోమణిః పండితమండలీసఖః।
స రామచంద్రం కవిభారతిద్విజం
చకార బౌద్ధాగమచక్రవర్తినం॥

తీర్థగ్రామపతేర్యతేస్త్రిపిటకా
చార్యస్యభూపాన్వయా
చార్యశ్రేష్ఠమునీశ్వరస్య సుగిరః
శ్రీరాహులస్వామినః,
శిష్యోరోణరజఃసుమంగళముని
ర్ధీమాన్ స్వయా భావయా
కారుణ్యేన మునీంద్రభక్తిశతక
వ్యాఖ్యానమాఖ్యాతవాన్.

ఈ శతకము విని పరాక్రమబాహుమహారాజ కవికి "బుద్ధాగమ చక్రవర్తి"యను బిరుదమిచ్చెను. రాజ గురువు రాహులస్వామి శిష్యుడు సుమంగళముని దీనికి "సింహళీ" భాషను వ్యాఖ్యానము చేసెను. అనగా దీనిని బౌద్ధగురువులు లంకారాజ్యములో తమ మతగ్రంథముగా నంగీకరించిరని సూచన. కాని రామచంద్రకవి భారతి దీనిని కేవలము రాజు మెప్పు వడయుటకై వ్రాయలేదు. బ్రాహ్మణసంప్రదాయుడైనా అతనికి బుద్ధభగవానునియందుగల "యిష్టదేవతా" భావన చేతనే వ్రాసినాడు. అందుకే గద్యలో "శ్రీశాక్యమునేర్భగవతః సర్వజ్ఞస్య పరమోపాసకేన గౌడదేశీయేన" అని వ్రాసుకొన్నాడు. ఈగద్యలో దీనికి "భక్తిశతక" మని పేరున్నను వ్యాఖ్యాతను గురించిన శ్లోకములో "మునీంద్రభక్తిశతకం" అని యున్నందువల్ల దీనికా పేరే తగియున్నదేమో అని యూహించవచ్చును.

బౌద్ధులు నిత్యమూ స్మరించే "శరణ"త్రయ మిట్లు గ్రంథాంతమం దున్నది:

"నమో బుద్ధాయ గురవే నమో ధర్మాయ శాసినే,
నమః సంఘాయ మహతే త్రిభ్యోఽపి సతతం నమః"

శతకములో మరియొకచోటకూడా ఇట్టి శ్లోక మున్నది:—

"బుద్ధో ధర్మశ్చ సంఘస్త్రితయమితి
మహానర్ఘరత్నం ముముక్షో
రద్యారభ్యాహమస్మై త్రిభవభ
యభిదే సందదామ్యాత్మభాజన్
ఏషోఽహం తత్పరః స్యామ్పరమయ
నిమితో నాస్తి మే సత్యమేతత్
స్వామస్వాహంకు శిష్యస్త్రిదశనుతమి
దంకోటికృత్వేనమామి"

గ్రంథపరిసమాప్తియందు "సిద్ధిః" అని వున్నది. బౌద్ధశాసనములలో మొదట 'సిద్ధిః' అనిగాని "సిద్ధిరస్తు" అనిగాని వుంటుంది. "కమల శీలాతర్క" అనే తర్క గ్రంథంలో మొదట "నమోబుద్ధాయ"అని వున్నది. ఇట్టి రివాజులు బౌద్ధులలో శాఖాభేదములవల్ల కలుగుతున్నవేమో అని నావూహ.

ఇది బౌద్ధశతకమే అయినా శతకప్రారంభ మంగళశ్లోకములో రామచంద్రకవి "అద్వైత" భావనయే కనబడుతున్నది:—

"జ్ఞానం యస్య సమస్తవస్తువిషయం
యస్యానవద్యం వచో
యస్మిన్ రాగలవోఽపి నైవ నపున
ర్ద్వేషో నమో హస్తథా
యస్యాహేతు రనంతసత్త్వ సుఖదా
నల్పా కృపామాధురీ
బుద్ధో వా గిరిశోఽథవా స భగవాన్
తస్మై నమస్కుర్మహే॥"

కేవల బౌద్ధుడైన కవి యెవడూ యిట్లు "బుద్ధో వా గిరిశోఽథవా" అని "వా" పక్షముగా చెప్పడు. గనుక ఈరామచంద్రకవి భారతి అద్వైత సంప్రదాయుడేమో అని తోస్తుంది. దీనితరువాతి శ్లోకములో జ్ఞానపరుడెట్లు వివిధ ధర్మసమన్వయము చేసుకొనునో సూచింపబడినది:—

"దేవశ్శంభుర్న వైరీ హరిరపి
నరిపుః కేవలీ నోసపత్నో
నోదాసీన స్స్వయంభుర్న చపు
నరపరే తేపరే వాసవాద్యాః,

శాస్తా బుద్ధో న బంధుర్జగతిన
జనకో నైకగో త్రైకజాతిః
కిం త్వేషాం వీతరాగో భవతి
సకలవిద్ యస్సుధీభిః స సేవ్యః"

మరియొక శ్లోకములో నీతడు బుద్ధభగవానుని అద్వైతులకు గమ్యమగు పరమాత్మస్వరూపముగా నిర్వచించుటకూడా ఈతని "యద్వైత" సంప్రదాయ మును స్థిరపరచును:—

"చిదాకారం సూక్ష్మం విభు విశద మాకారరహితం
నిరీహం నీరూపం నిరవధికృపాబీజ మజరం,
సమస్తజ్ఞం సర్వోపధిరహిత మైశ్వాదమృతదం
జితానంగైః సేవ్యం భవతు మమ త ద్వస్తు శరణం"

ఇట్లు ఆరాధ్యదేవత యేప్రత్యేకసంప్రదాయ మునకు చెందియున్నా అది "తత్పదార్థ" ద్యోతకమే అనిన్నీ పరమాత్మస్వరూపమేఅనిన్నీ భక్తి గౌరవ భావములున్నవారికిన్నీ, ఉంచుకోగలవారికిన్నీ మత సమన్వయము సుగమమే అవును. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అనికదా శ్రుతివాక్యము! సత్పదార్థా న్వేషకులున్నూ, సత్పదార్థబోధకులున్నూ మన ఆర్యవేద ప్రామాణ్యమున్నూ, అపౌరుషేయత్వమున్నూ ఒప్పినా, ఒప్పకున్నా విప్రులే అనే గౌరవభావం మనసనాతను లను కొనేవారి కుంటే మత సమన్వయము మన భారత భూమిలో నేడుకూడా చాలాసులువు అవుతుంది. ఇట్టి భావనయే యీ "భక్తిశతక"మునకు స్థాపన.

ఇక గమ్యమునుగురించి - మతములకు గమ్యము "మోక్షము", జీవులకు పునరావృత్తిలేకుండా శాశ్వత బ్రహ్మలోకసిద్ధి. అంతేకాదు, "బ్రహ్మసాయుజ్య"మని కూడా అంటారు. ఇది వైదికములనబడు ఆర్యమత ములకు సమానగమ్యము.

"యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః,
స తు తత్పద మాప్నోతి యస్మాద్భూయో న జాయతే"

అని శ్రుతివాక్యము! ఇట్టి ఆశయమే ఈ శతక ములోకూడా ఉదాహృత మైయున్నది:—

"అనాత్మ న్యనిత్యేఽశుభే దుఃఖదుఃఖే
దురంతేఽత్ర సంసారచక్రే భ్రమంతం,
త్వమేకోఽసి మాం త్రాతు మీశోదయార్ద్రే
ప్రభోఽతః ప్రసీద ప్రసీద ప్రసీద"

"నాహం లాభార్చవార్థీ నచ భయ
చకితో నాపి సత్కీర్తికామో
నత్వం ఘుర్మాంశువంశప్రభవ
ఇతి మునే నాపి విద్యాశయా తే
పారంపర్యాన్న చ త్వాం శరణము
పగతః కింతు తే సర్వజన్యం
సమ్యగ్జ్ఞానం సమీక్ష్యత్వయి
భవజలధిం సంతరీతుం ప్రవృత్తః"

ఇట్లు సంసారపారావారమునుండి తరించుటయే బుద్ధధర్మ గమ్యమైనదిగ యీ శ్లోకములలో కనబడు తుంది.

బౌద్ధులతో సమకాలీనులును అంతకు పూర్వు లును అట్లే వేదబాహ్యు లనబడు "జైనులు", "అర్హ తులు", "కేవలులు" అనబడువారుకూడా ఇట్లే "భవత రణ"మే గమ్యముగా శతకములలోను స్తోత్రములలోను సూచించియున్నారు. "ఆచార్యభక్తి" అనే జైన స్తోత్రంలో — "అభినౌమి సకలకలుష ప్రభవోదయ జన్మమరణ బంధనముక్తాన్" అని ముక్తిస్వరూపము వర్ణిత మైయున్నది. "సిద్ధభక్తి"అనే మరియొక స్తోత్ర ములో —"అనంతానంతసంసారసంతతిచ్ఛేదకారణం, జినరాజపదాంభోజస్మరణం శరణం మమ" అని వున్నది. "అద్యాష్టకం"అనే స్తోత్రంలో — "అద్య సంసారగంభీర పారావారః సుదుస్తరః, సుతరోయత్ క్షణేనైవ జినేంద్ర తవ దర్శనాత్" అని వున్నది. "వీర స్తోత్రం"లో — "యే వీరపాదౌ ప్రణమంతి నిత్యం ధ్యానే స్థితాః సంయమయోగయుక్తాః, తే వీతశోకాహి భవన్తి లోకే సంసారదుర్గం విషమంతరంతి"అనివున్నది. ఇట్లే యీ "భక్తిశతకము"లోకూడా:—

"వీతరాగ మునీంద్ర దయాంబుధే
సుగత భగ్న బృహద్భవపంజర,
అధిగతామృత బుద్ధ మనోంబుజం
మమ తవానఘ గంధకుటీయతాం"

అని వున్నది.

దారసుతాది బాంధవానీకమున్ను ధనకనక వస్తు వాహనాది వైభవములున్ను ఎండమావులవంటి వని తెలియజాలనివారికి జగత్తు సత్య మనేభావకలిగి అందులో అహంకారమమకారములు బలపడి మోహ విజృంభణమై ముక్తి యగమ్యగోచర మవునని సనాతనులు కూడా అంగీకరింతురు. జగత్తు సత్యమనేవారు కూడా ఐహికవైభవములు చంచలము లని అంగీకరింతురు.

ఇట్లే ఈ బౌద్ధశతకములో కూడా కనబడుతుంది:—

"ఇదమపి యద్వేద్మి పుత్రదార
స్వజనగృహాది మరీచికాంబుతుల్యం,
స్థగయతి మమతాచ మా మహంతా
తదపిహి మోహవిజృంభితం గరీయః"

ఆత్మబుద్ధి రిహాయస్య జాయతే
సాచ తస్య జనయే దహంకృతిం,
సా తనోతి సుతరాం భవస్పృహాం
సైవ మోహజననీ ముహుర్ముహుః"

ఇక మోక్షసాధనవిషయము. మన వైదికవాఙ్మయములోని శ్రుతివాక్యము లీవిషయములో నిట్లు చెప్పుచున్నవి:—

విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః,
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం.
శాంతోదాంత ఉపరత స్తితిక్షుః సమాహితోభూత్వా.
ఆత్మన్యేవాత్మానంపశ్యతి.
యదా నకురుతే పాపం సర్వభూతేషు కర్హిచిత్,
కర్మణా మనసా వాచా బ్రహ్మ సంపద్యతే తదా.

ఈ మానసికసాధనలో త్రికరణశుద్ధి, ఇంద్రియ నిగ్రహము, అరిషడ్వర్గనిర్మూలనము ప్రధానాంశములు. ఇవిలేనిచోట బాహ్యాడంబరము లెన్నియున్నా ప్రయోజనము లేదని వైదికమతము లన్నిటికిన్ని సామాన్యమగు సిద్ధాంతమైయున్నది. వీటి కనుగుణమైన అష్టాంగ యోగముకూడా అనుసరణీయమే. ఇట్టి అష్టాంగయోగమునే అనుసరించి సర్వప్రాణి కారుణికత్వమున్ను కామవిజయమున్ను బౌద్ధశైవ ధర్మకర్తలు సాధనపు ముఖ్యముగా వచించిరి. ఈ శతకములోనే:—

"అపిచ విషయిణో న మోక్షసిద్ధిః"

"గతిరతిచపలస్య చేతసః స్యా
దిహ నభసీవ నభస్వతోఽనురోధా
కథమపి భజతే క్రమేణ స్థైర్యం
చిరమిదమభ్యసనేన సంవిరక్త్యా"

"మాతేవాపీశ్వరస్త్రీ భవతి పరధనే
న స్పృహా యస్య పుంసో
మిథ్యావాదీ న యః స్యా న్నపిబతి
మదిరాం ప్రాణినో యో న హన్యాత్
మర్యాదాభంగభీరుః సకరుణ
హృదయ స్త్యక్తసర్వాభిమానో
ధర్మాత్మాస్తే స ఏవ ప్రభవతి
భగవన్ పాదపూజాంవిధాతుం"

ఇట్టిభక్తియోగము పూర్తిగా మానసికమై బాహ్యాభ్యంతరశుద్ధి కలిగినదగుటకై ఈ శతకకర్త యిట్లని స్తుతించుచున్నాడు:—

"మూర్ధ్నా బుద్ధం నమ త్వం శ్రవణ
శృణు సదా ధర్మ మద్వైతవాది
ప్రోక్తం సర్వజ్ఞరూపం నయన
నిరుపమం పశ్య జిఘ్రాంఘ్రిపద్మం
ఘ్రాణ త్వం చార్కబంధోః స్తుహి
సఖి రసనే శ్రీఘనం పూజయేథా
స్నిగ్ధం పాణే వ్రజాంఘ్రే జినపదవ
మదస్మద్గుణం చిత్త చింత్య.
అవిరతమవలోకయామి బుద్ధం
గతరజసా మనసాపి చక్షుషేవ
స్వపిమి నిశి నిధాయయద్ హృది త్వాం
నమమ సమం విరహ స్త్వయాతపేవ.

విశేషించి—

"దళబలకలికాల దుర్బలోఽహం
చిరదురితార్ణవతుంగభంగమగ్నః,
తవ కథ మనుయామి ధర్మ నావం
జినమమ దేహి కృపాకరావలంబం"

అని అనన్యగతికుడై బుద్ధభక్తుకు వేడుకొనుచున్నాడు "మమ దేహికరావలంబం" అన్నమకుట

ముతో స్తోత్రములు శైవవైష్ణవ సంప్రదాయములలో ప్రసిద్ధముగా వున్నవి.

ఇట్టి భక్తిసంప్రదాయములో సాధకుడు తన యిష్టదైవమునే తనకు లోకములో సర్వస్వముగా భావించును. ఇట్టిశతకములో—

"పితా మాతా భ్రాతా త్వమసి భగినీ త్వంచ విపది
స్థిరం మిత్రం బంధుః ప్రభురమృతదీక్షాగురుతమః
త్వమైశ్వర్యం భోగో త్వమసి ధనధాన్యంచ మహిమా
యశో విద్యా ప్రాణ స్త్వమసి మమ సర్వజ్ఞ సకలం"

ఇటువంటి భావనకూడా మనవైదిక సంప్రదాయమందలి శతకములలో కనబడును. మచ్చుకు "కృష్ణ శతకము"లో నీ క్రిందిపద్యమును పేర్కొనవచ్చును:—

"నీవేతల్లివి తండ్రివి, నీవేనాతోడు నీడ నీవేసఖుడౌ
నీవేసురుడవు దైవము నీవేనాపతియు గతియు నిజ
ముగ కృష్ణా.

"ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతిసాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి".

అన్నసూక్తిని మనము నిత్యజీవితమందు పరివర్తనములో నుంచుకుంటే భారతభూమిలో మతసమన్వయ మేలకాకుండును? "యద్భావం తద్భవతి" "మనసు కుదిరితే మార్గమున్ను కుదురుతుంది."

---

# మృగశిరావృష్టి

శ్రీ గుంటుపల్లి వేంకటేశ్వరరావు

భోరని పద్మపున్వదనముల్ వసివాడగజేయు రోహిణీ
మారుతముల్ పలాయనపుమార్గములం బడె; మేఘకోటి సం
చారము పింజపింజలుగ సల్పదొడంగె నభోంగణాన; వ
ర్షారమ నూత్ననాట్య విలసన్నవరేఖలు నార్ద్రిమయ్యెడిన్.

పొలములఁ దోల గోతులను పూడ్చిన పుత్తడిమెర్వు; గాడ్పు జొ
త్తిల, "మృగశీర్ష కార్తె యరుదెంచును రేపట మాపటం"చు, ఎ
డ్డుల శకటాన బూన్చి వడి దోలగడంగిన రైతు, దొడ్డ మ
బ్బుల గని కుప్పలన్ నరిగ పోయకయే యిలుదారి బట్టెడిన్.

చల్లనిపిల్లగాలి తరుశాఖలకున్ గిలిగింత పెట్టె; చం
చల్లతికాప్రదీప్తులు ప్రసన్నములయ్యె; మహేంద్రచాప మ
త్యుల్లసనంబునన్ నిలచె తూరుపు తెల్లనిమబ్బుకొండలన్,
జల్లులవాన వచ్చె సుమసాదృశమై ముదివడ్డయెండలన్.

మ్రోగె గర్జితరణభేరి ముందు; నూత్న
దండయాత్ర సాగించె మేఘుండు వేగ;
ఎండిన చెఱువు నెఱ్ఱెలందుండు జీర్ణ
జీవులత్యాశతోఁ దెరచినవి నోళ్లు.

ఎండిన గర్కపోచలు హసించె; ఖగంబులు జీవనార్థమై
పిండులు పిండులయ్యు వినువీథిని పాఱుట మానె; గిన్నెలో
పిండిని మెక్కి గుంజకడ వింత తెఱంగుల నిల్చు ధైర్యపుం
గుండె కడాని క్రొంజిలుగు కోడెయు దీయదొడంగె చెంగనాల్.

మండుటెండలు గుల్లపఱుప వసుంధర దోచుబీటలలోన దూరిదూరి
సూర్యచంద్రులు స్వేచ్ఛ జొరబడుగృహముల కుండపోతవిధాన కురిసికురిసి
పచ్చనౌ నునుజిల్గు వరియాకుమళ్ల గట్టులపై బరాబరి పొరలిపొరలి
లోతుగా ద్రవ్విన, [౧]ఖాతతటాకపుందరుల బాటాబాటి దాకితాకి
వత్సరాంత సస్యసమృద్ధి వారికొఱకు
గౌతమీకృష్ణతుంగభద్రాతరంగి
ణీలసత్సైకతంబుల పాఱిపాఱి
తృప్తి నొనగూర్చె మృగశిరావృష్టి నాఁడు.

కాలము చక్రరీతి క్షణకాలము జాలము సేయరాదు బ
స్తాల శిరంబు లెత్తినవి ధాన్యము తొమ్మసకలంబు బచ్చనై
త్రాలెను [౨]తోత్రమున్ వెదకి కాడి తయారొనరించి సేద్యమున్
హాలిక! ఈశుభోదయప్రశస్తముహూర్తమునందె సేయుమా!



౧. ఖాతము:—నలుచదరముగా ద్రవ్వబడిన గుంట.
౨. తోత్రము:—ములుగఱ్ఱ (ఎద్దులను తోలుట కుపయోగించు ముల్లువేయబడిన కఱ్ఱ.

# వేదాంతదర్శనము -

# విశిష్టాద్వైతవాదము

శ్రీ పూర్ణానంద

అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే
వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

## ప్రవేశిక

వైష్ణవ ఆళ్వారుల సాధన, నాథముని యామునాచార్యుల ఆశ, విశిష్టాద్వైతవాదసంస్థాపకుడను శ్రీ రామానుజుని మనోమయశరీరమునకు ఉపాదానములు. వారి మానసికవ్యగ్రతయే ఇట్లు రూపెత్తినది.

ప్రతిదేశమున, జ్ఞానమును కుమ్మఱకఱ్ఱముగ నెంచువారు చాలమంది. వీరికి భావోచ్ఛ్వాసము మెండు. ఉపాస్యవస్తువు లేనిచో వారు మనజాలరు; ఆవస్తువుతో ఒకానొక నిర్ణీతసంబంధము గూడ అవసరము.

శంకరుని పరబ్రహ్మము దుర్దర్శము. దత్తాత్రేయ, జడభరతులు దానిని గాంచి మూగలైరి. శుకదేవుడు కేవలము స్పర్శించెను. శివుడు ఆపాగర జలముల నొకగండూషపరిమాణము పాన మొనర్చి, శవమయ్యెను? వైభవసముజ్జ్వలమగు దివ్యభవనము సామాన్యపాంథున కగమ్యమగునట్లు పరబ్రహ్మము కూడ. దైనందిన సుఖదుఃఖ తరంగముల లేలి చూడదు, నికృష్ట మనుష్యుని ప్రార్థనల కయ్యది బధిరము. 'సంసారాధ్వశ్రమార్తిరుపశమన మిదౌ' సేవితము కాదగు వస్తువొకటి అవసరము. దీనిని ప్రసాదించినది శేషుని అవతారమగు లక్ష్మణ-రామానుజుడు. శంకరుడు కేవలము శ్రుతినే ఆధార మొనర్చుకొనెను. రామానుజుని మనస్సాగరమున పురాణ, ఆగమ, ద్రావిడ ప్రబంధాది నదులు గూడ మిళితములై, సార్థకత నందెను.

## జీవితచరిత్రలు

ఆముదన్ విరచిత ద్రావిడగ్రంథము, ఆంధ్రపూర్ణుని యతిరాజవైభవము, వేంకటనాథుని యతిరాజసప్తతి అను గ్రంథములు ఏతదాచార్యుని జీవితము ఎఱుంగుటకు ముఖ్యాధారములు.* మన గ్రంథముల 'అతిశయోక్తి'కి ఆదరము మెండు. ఇదియే గురువును గుఱించి శిష్యుడు చెప్పవలసిన 'అతి - అతిశయోక్తి' అనుటకు ఆటంకము లేదు. ఈ జీవితచరిత్రకారులు, రామానుజుని జన్మకాలమును అభివర్ణింపబోయి, శంకరమత-పతనమును ఒకవిషయముగ గ్రహించిరి. లేకున్న, 'ధర్మ - సంస్థాపన' రామానుజుని అవతారత్వములు పొసగవు. శాంకరమతము పతితమైన, రామానుజున కంత నైపుణ్యమును జూపి, తన్మతమును ఖండింప నవసరము లేదు. మూడువందల యేండ్లు ముగియకుండనే శాంకరమత-పరమాయువు ముగిసినదనుట విచారాసహము. ఐతిహాసికముగ (Historical) చూచిన భామతి, పంచపాదికావివరణము మున్నగు ఉత్కృష్ట అద్వైత వేదాంత-గ్రంథము లీప్రాంతములలోనివే. కాని, శంకరుని ప్రతిపక్షు లందఱిలోను రామానుజుడు శ్రేష్ఠుడను మాట నిర్వివాదము.

## జీవితము

శ్రీపెరుంబూదూరు గ్రామమున క్రీ.శ.౧౦౧౭లో ఆసూరి కేశవభట్టు కాంతిమతుల గర్భమున ఇలయ

* ప్రపన్నామృతము, Ramanuja and His life and Times గూడ ఈవిషయమున ఉపకరింపగలవు.

పెరుమాళ్ అనబడు లక్ష్మణ - రామానుజుడు జన్మించెను. ఉపయుక్తవయస్సున కాంచీనగరమున గోవిందుడను సహాధ్యాయునితో గలసి, యాదవప్రకాశుని కడ శాస్త్రముల బఠింపసాగెను. ఈ గురుశిష్యసంబంధము రామ - రావణ సంబంధముకాగా రామానుజుడు గురువును వీడెను. గురువుకూడ రామానుజుని హత్యయొనర్పనెంచెను. కాని, దైవికముగ రామానుజుడు తప్పించుకొనెను. పదునారవయేట వివాహమయ్యెను; తండ్రి దివంగతుడయ్యెను.

ఆల్వందార్, యామునాచార్యుని 'స్తోత్రరత్న' శ్లోకముల మాధుర్యమున కానందించి, నంబియను తదనుచరునితో వారిని దర్శింప శ్రీరంగమున కరిగెను. అప్పుడు యామునాచార్యుని జీవనప్రదీపము నిర్వాపితము; శవముయొక్క హస్తాంగుళిత్రయము ముష్టిబద్ధము. అపూర్ణమగు ఆశాత్రయమును సూచించుచు, యామునాచార్యుడు దివి కరిగెను. అవి : బ్రహ్మసూత్ర భాష్యరచన, ద్రావిడవేదప్రచారము, పరాశరశఠకోప నామకరణములు. రామానుజుడు వీటిని పూర్ణమొనర్ప ప్రతిజ్ఞాబద్ధుడగుడు, వ్రేళ్లు మరల విప్పారెను.

పిదప కాంచీనగరమున, దేవరాజు సేవలో నిమగ్నుడయ్యెను. ప్రత్యాదేశమును బడసి శ్రీరంగము నకు బోవుచు, పథమధ్యమున మధురాంతకమున రామచంద్రుని పూజింప సాగెను. అటకు మహాపూర్ణుడు (నంబి) అరుదెంచి మంత్రోపదేశ మొసగెను. పిదప వారిర్వురును కలసి కాంచీనగరమున కరుదెంచి, ఒక్కట నివసింపసాగిరి. రామానుజుని వివాహిత జీవితమంత సుఖకరము కాదు. కాంచిపూర్ణుడు (తిరుకచ్చి నంబి) అను శూద్రుడు కూర్చొనిన తావును కడుగుట, భిక్షుకుని తఱుముట, మహాపూర్ణుని (నంబి) భార్యతో కలహించుట అను మూడు విషయములవలన, భార్యయనిన రామానుజునకు ఏవ పుట్టెను. ఆమెను సేర్పుతో పుట్టింటికి పంపి, సన్యసించెను. క్రమముగ రామానుజుని శిష్యులసంఖ్య పెరుగసాగెను.

యామున శిష్యకోటివలన నాహూతుడై రామానుజుడు శ్రీరంగమున కరిగి, వారి నాయకత్వమును గ్రహించెను. అట, గోష్ఠీపూర్ణునికడ 'మంత్ర రహస్యము'ను దెలిసికొనెను. అరుతడవలు నిరాకరించి పిదప, రామానుజునిభక్తికి సంతోషించి, గోష్ఠీపూర్ణుడు గోప్యమగు మంత్రార్థము విచ్చెను. కాని, రామానుజుడు వెంటనే మందిరగోపురము నెక్కి అందఱికిని నరకోత్తారకమగు ఆ మంత్రమును జెప్పెను. 'అనంత నరకదమగు ఇక్కార్యము నేల యొనర్చితి'వని గురుడు ప్రశ్నింప, 'ఎంతమంది స్వర్గమున కరుగ నే నొక్కడ నరకమున కరుగుట ఏమి కష్ట'మని వచించెను. గురుడు సంతోషించి ఇటనుండి 'విశిష్టాద్వైతము రామానుజదర్శన' మనంబడును అని ఆదేశించెను. తరువాత మాలాధర పోట్టనంబి అనువారి శుశ్రూషను రామానుజుడు సల్పెను. ఈ సమయమున మరల శ్రీరంగ దేవాలయార్చకుడు రామానుజుని ప్రాణముల వినాశ మొనర్ప యత్నించెను. కాని, కొనసాగలేదు.

పిదప, బోధాయన బ్రహ్మసూత్ర - వృత్తిని కాశ్మీరమునుండి సంగ్రహించి శ్రీభాష్యమును విరచించి, ప్రథమ ప్రతిజ్ఞను నిర్వహించెను. ఇట్లే ద్రావిడవేదప్రచారము, నామకరణములగూడ గావించెను. తిరుపతిని వైష్ణవప్రధానక్షేత్ర మొనర్చెను. శైవుడగు కులోత్తుంగచోళదేవుడు రామానుజుని జంప యత్నింప, మైసూరునకు పారిపోయెను. హోయిసాల రాజు ఆదరమును బడసి, అతనిని శిష్యుని గావించుకొనెను. అట మేలుకోటలో నారాయణమందిర సంస్కారమును గావించెను. హోయిసాలరాజగు ఈ విష్ణువర్ధనుడే శిల్పకళాపీఠములగు బేలూరు మందిరముల నిర్మించినవాడు. (౧౧౧౭. క్రీ.శ).

తరువాత ౧౧౧౮. క్రీ. శ.న కులోత్తుంగుడు చనిపోవ శ్రీరంగమున కరుదెంచెను. ఈతడవ ప్రతిబంధరహితమగు ఆధిపత్యమును రామానుజుడు సంపాదించెను. 'అధ్యయనోత్సవము' ఆళ్వారులపూజ, ఆండాళ్ పూజ తిరుపతియందు గోవిందరాజు పునఃప్రతిష్ఠలను సల్పెను. పిదప, తాను తీర్థయాత్రలను సల్పి, శ్రీభాష్యమును రక్షించుభారము వలువురకొసగెను. పిళ్లన్ అనువారికి ద్రావిడవేదమును రక్షించుభారమును, మఱి ఇతర మందికి మతప్రచారభారమును నొసగెను.

ఇట్లు కులోత్తుంగచోళ, విక్రమచోళ, ద్వితీయ కులోత్తుంగచోళదేవుల రాజ్యకాలమున మతప్రచారము సల్పి ౧౧౩౭ క్రీ. శ. మున, ౧౨౦-వ ఏట రామానుజుడు స్థానోచితమగు లోకమున కరిగెను. శైవ, స్మార్త, యాదవ, భట్టభాస్కరమతముల ఖండించి, భాష్యకార, యతీంద్రనామములను బడసిన ఈ ఆచార్యుని జీవితము అనంతమహిమామయము. ఇలయపెరుమాళ్ లక్ష్మణ — రామానుజుని స్థానము భక్తులపంక్తిలో అగ్రగణ్యము.

### గ్రంథవివరణి

'వేదాంతసారో వేదాంతదీపో వేదార్థసంగ్రహః,
గద్య-గీతా భాష్య-సూత్రభాష్య నిత్యక్రమా ఇతి'

అను శ్లోకమువలన రామానుజుని గ్రంథనామములు తెలియవచ్చుచున్నవి. అందు వేదార్థసంగ్రహమున శ్రుతులు విశిష్టాద్వైతపరముగ వ్యాఖ్యానమొనర్పబడినవి; దీనిమీద 'స్నేహపూర్తి' యనుటీక యున్నది. తరువాత, శ్రీభాష్యమనబడు సూత్రభాష్యము; దీనికి సుదర్శనాచార్యుని 'శ్రుతప్రకాశిక' యనుటీకయు, వేదాంతదేశికుల 'అధికరణమాల'యును ఉన్నవి. ఇందు ముఖ్యముగ శంకరమతఖండనము, అద్వైతపరములగు విష్ణుపురాణాదిశ్లోకముల స్వమత వ్యాఖ్యయు ఒనర్పబడినవి. విచారబహుళమైనను, ఇందు శంకరభాష్యముయొక్క 'ప్రసన్నగంభీరత' లేదు. డాక్టరు థిబట్, ప్రొఫెసర్ రంగాచారియర్‌ల ఇంగ్లీషు అనువాదము లున్నవి. వేదాంతదీపము బ్రహ్మసూత్రములకు టీకాస్థానీయము; ప్రమేయబహుళమగు శ్రీభాష్యపఠనాసమర్థులకు. వేదాంతసారముగూడ ఇట్టిదే.* గీతాభాష్యమునకు వేదాంతదేశికుని 'తాత్పర్య చంద్రిక'యను టీక కలదు. ఆంగ్లానువాదముకూడ నటేశన్‌కంపెనీవారిది ఉన్నది. గద్యత్రయమున, శరణాగతి, శ్రీరంగ, వైకుంఠగద్య లనుమూడుభాగము లున్నవి. దీనిపైని వేంకటనాథుని భాష్య మొకటి యున్నది. భగవదారాధనాక్రమ మనుగ్రంథమున ఉపాసనావిధానము వర్ణింపబడినది. ఈ గ్రంథముల నన్నిటిని శ్రీరంగం వాణీవిలాసప్రెస్సువారు దేవనాగరి అక్షరములలో ముద్రించియున్నారు.

విశిష్టాద్వైతమతసారమును తెలియ గోరువారికి 'యతీంద్రమతదీపిక' అను గ్రంథము చాలఁ దోడ్పడగలదు. ఈవిషయమున అద్వైతవాదమును ప్రపంచించు వేదాంతసారము (సదానంద)నకును దీనికిని పోలికయున్నది. కాని, వేదాంతసారముకంటె నిది పెద్దది. సాయణాచార్యుల సర్వదర్శన సంగ్రహమునగూడ దాని వివరణయున్నది.

### ఆలోచ్య విషయములు

ఆచార్య రామానుజుడు చిత్, (జీవులు) అచిత్ (జడము), ఈశ్వరుడు (పురుషోత్తముడు) అను మూడుపదార్థముల నొప్పుకొనుచున్నాడు. అనంత సంఖ్యాకులగు జీవులును, ఈజగత్తును గలసి ఈశ్వరుని శరీరము; ఈజీవజగద్వ్యక్తమగు శరీరమునకు ఈశ్వరుడే ఆత్మ.† ఈతత్త్వత్రయ సమర్థనార్థము రామానుజదర్శనమున, (౧) స్థూల సూక్ష్మచేతనాచేతన, బ్రహ్మముల ఏకత్వము, (౨) ద్వైతాద్వైత శ్రుతుల అవిరోధము, (౩) బ్రహ్మముయొక్క సగుణత్వ సవిశేషత్వ, విభుత్వములు, (౪) బ్రహ్మముయొక్క నిర్గుణత్వ నిర్విశేషఖండనము, (౫) జీవుని అణుత్వ, బ్రహ్మస్వభావత్వ, దాసత్వములు, (౬) జీవునిబంధ కారణమగు అవిద్య, (౭) మోక్షోపాయమగు విద్య (౮) భక్తియొక్క మోక్షకారణత్వ, శ్రేష్ఠతలు, (౯) బ్రహ్మైక్యనిరాసన, (౧౦) మాయావాద ఖండనము (౧౧) అనిర్వచనీయవాదఖండనము, (౧౨) జగత్తుయొక్క సత్యత్వస్థాపన, (౧౩) జీవజగత్తుల ఈశ్వర శరీరత్వము అను విషయములు ఆలోచింపబడినవి.

### పదార్థ - విభజన

రామానుజమతమున పదార్థములన్నియు ప్రమాణ ప్రమేయభేదముల ద్వివిధములు. అందు ప్రమాణ

* Rev. Johnson ఇంగ్లీషు అనువాదము ఉన్నది. శ్రీభాష్య మొకటి వావిళ్లవారిది తెలుగునను కలదు.

† ఈ జీవజగద్విశిష్టమగు ఏకత్వ ప్రతిపాదనవలన, ఈవాదము విశిష్టాద్వైత మనంబడుచున్నది.

ములు ప్రత్యక్ష, అనుమాన, శబ్దము లని ముత్తెరంగులు. ప్రమేయము ద్రవ్యాద్రవ్యము లని రెండువిధములు; ద్రవ్యము జడాజడము లని మరల ద్వివిధము. జడమున ప్రకృతి కాలము అను రెండు విభాగము లున్నవి. ప్రకృతి చతుర్వింశతితత్త్వాత్మకము. కాలము భూత, భవిష్యత్, వర్తమాన రూపము. అజడము పరాక్, ప్రత్యక్ అని రెండువిధములు. ప్రత్యక్ జీవేశ్వర భేదముల ద్వివిధము. జీవులు నిత్య, బద్ధ, ముక్త లని మూడువిధముల నుండురు అందు బద్ధులు బుభుక్షు, ముముక్షువు లని రెండువిధములు. బుభుక్షులు అర్థకామ పరులు, ధర్మ(కామ)పరులు అను భేదముల వెలయుచున్నారు. ధర్మపరులలో దేవతాంతరపరులు, భగవత్ పరులు అను రెండుభేదము లున్నవి. ముముక్షువులు కైవల్యపరులు, మోక్షపరులు అని విభజింపబడు చున్నారు భక్త, ప్రపన్న లని మోక్షపరులు రెండు తెఱఁగులనున్నారు. ప్రపన్నులుమరల ఏకాంతికి, పరమైకాంతికి భేదముల నెఱుంగబడుచున్నారు. పరమైకాంతికులు దృప్తులు ఆర్తు అని రెండువిధములుగ నున్నారు. ఈశ్వరుడు పర,వ్యూహ,విభు,అంతర్యామి, అర్చావతారములను ఐదు తెఱఁగుల వెలయుచున్నాడు. పరుడు నారాయణుడు. వ్యూహము వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ లని చతుర్విధము; కేశవాదులు తదితర వ్యూహములు. మత్స్యాది అవతారములు విభవము లనంబడును. అంతర్యామి ప్రతిశరీరమున వెలయుచున్నాడు. శ్రీరంగాది ఆలయములలో పూజింపబడు మూర్తివిశేషములు అర్చావతారములు. అద్రవ్యము సత్వ, రజః, తమః, శబ్ద,స్పర్శ, రూప, రస, గంధ, సంయోగ, శక్తు లని పదివిధములు.

## ప్రమేయనిరుక్తి

యథావస్థిత వ్యవహారాను గుణ మగు జ్ఞానమే ప్రమ. అనగా, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞాన, మిథ్యాజ్ఞాన రహిత మని భావము. దీనికి సాధనముకునదియే ప్రమాణము. ఈ ప్రమాణము ప్రత్యక్ష, అనుమాన, శబ్దము లని త్రివిధము. ప్రత్యక్షము నిర్వికల్ప, సవికల్పములని రెండు విధములు; ఈ రెండును విశిష్ట విషయకములు. నిర్విశేషమగు జ్ఞానము అసంభవము. స్మృతి, ప్రత్యభిజ్ఞ భావాంతర రూపమగు అభావజ్ఞానము, యోగజ జ్ఞానము, ప్రత్యక్ష - అంతర్గతములు. భ్రమ, స్వప్నాది జ్ఞానములుగూడ జ్ఞానములే. కనుక, 'సర్వం జ్ఞానం సత్యం సవిశేషవిషయం చ'. ఉపమానము, అర్థాపత్తులు అనుమానాంతర్గతములు. అపౌరుషేయము నిత్యము అగు వేదవాక్యమే శబ్దప్రమాణము. సిద్ధ బ్రహ్మ పరవాక్యములు ఉపాసనాపరములు. వేదము సంపూర్ణముగ ప్రమాణము.

శంకరమతమున జ్ఞానము నిరపేక్షము; రామానుజమతమున ఆపేక్షికము. అద్వైతుల జ్ఞానము స్వప్రకాశము, నిర్విశేషము — జ్ఞానముయొక్క సవిశేషత్వ మాపాధికము. మఱియు, ఈ జ్ఞానము ప్రత్యగాత్మ స్వరూపము. రామానుజ మతమున జ్ఞానము సవిశేష విషయకము, నిర్విశేషవస్తుజ్ఞానము అసంభవము. నిర్విశేషవస్తువే జ్ఞానస్వరూపమని శాంకరమతము. జ్ఞానమునకు మరలజ్ఞానముండజాలదు; జ్ఞానము స్వప్రకాశము. శాంకరమతమున మాయ, అజ్ఞానములు ఒకటే పదార్థము; సంశయ, విపర్యయ, మిథ్యాజ్ఞానములు అజ్ఞానము. రామానుజమతమున మాయ భగవంతుని శక్తి; మాయ, అజ్ఞానములు విభిన్న పదార్థములు. మాయ భగవదాశ్రిత. అజ్ఞానము జీవాశ్రితమగు జ్ఞానాభావము. ఇది శాంకర రామానుజ దర్శనముల మూలపార్థక్యము. వ్యాసవిస్తృతి భయమున ఉభయపక్షములవారి యుక్తులు ప్రదర్శింపబడలేదు. కాని, రామానుజుడు విస్మయకరమగు విచారనైపుణ్యమును జూపినను, అతని యుక్తులు పేలవములు అని పల్క సాహసించుచున్నారము.

## అ ధి కా రి

కర్మఫలానిత్యజ్ఞానమును బడసినవాడే బ్రహ్మజిజ్ఞాసకు అధికారి. వేదాధ్యయనము, తత్ఫలముగ కర్మఫలానిత్యత్వజ్ఞానము, స్థిరఫలమగు మోక్షేచ్ఛ, బ్రహ్మజిజ్ఞాసకు క్రమద్వారములు. పూర్వ మీమాంస, ఉత్తరమీమాంసలు ఒకటే శాస్త్రము. ధర్మానుష్ఠానానంతరము మోక్షేచ్ఛ. జ్ఞానకర్మలకు కార్యకారణ

భావమున్నది. నిష్కామకర్మవలన చిత్తశుద్ధి లభించును; పిదప జ్ఞానోదయ మగును. అందువలన జ్ఞానము ఉత్పాద్యము, కర్మ ఉత్పాదకము. కర్మజ్ఞానము లేకున్న బ్రహ్మజిజ్ఞాస కధికారము లేదు. మఱియు, ఈ జ్ఞానము వర్ణాశ్రమ ధర్మాపేక్షము.

శాంకర మతమున కర్మ-మీమాంస, బ్రహ్మమీమాంసలు వేర్వేరు శాస్త్రములు. కర్మజ్ఞానము లేకున్నను, సాధన చతుష్టయ సంపన్నుడైన, బ్రహ్మజ్ఞానాధికారము. కర్మలు చిత్తశుద్ధి గలిగించి, పారంపర్యముగ మోక్షకారణము లగుచున్నవే కాని, సాక్షాత్కారణములుగావు. జ్ఞానమే మోక్షకారణము. ఈ భేదమువలన విశిష్టాద్వైతులు జ్ఞాన-కర్మసముచ్చయవాదు లనియు, అద్వైతులు కేవలజ్ఞానవాదు లనియు చెప్పబడుచున్నారు.

## విషయము

స్థూల సూక్ష్మ చేతనాచేతన విశిష్టమగు బ్రహ్మమే రామానుజదర్శన విషయము. ఆ బ్రహ్మమే పురుషోత్తము డనంబడు నారాయణుడు. ఆయన సగుణుడు, సవిశేషుడు. ఈ బ్రహ్మము శబ్దగమ్య మని చెప్పబడుటవలన, నిర్విశేషము కాజాలదు. ఈయన అశేష - కల్యాణ - గుణాకరుడు; సర్వజ్ఞత్వ, సత్య సంకల్పత్వ, సర్వాంతరత్వ, సర్వాధారత్వ, సర్వ నియంతృత్వాది గుణవిభూషితుడు. నిర్విశేషవస్తువు గాని, ఏవంవిధమగు జ్ఞానముగాని లేదు. శబ్దసామర్థ్యము సవిశేషవస్తునిరూపణతోడనే పరిసమాప్తము. స్వాప, మద - మూర్ఛల లభించుజ్ఞానముగూడ సవికల్పకమే. నిర్గుణశ్రుతివాక్యములు హేయగుణ నిషేధపరములు; నిర్గుణ - బ్రహ్మప్రతిపాదకములు కావు.

శాంకరమతమున నిర్విశేష - చిన్మాత్రబ్రహ్మమే ప్రతిపాద్యము. 'అవాఙ్మనస గోచరః' మగుటవలన 'ఇదం తయా' నిరూపింపబడజాలదు. అది, అశబ్దము, అస్పర్శము; ప్రత్యగాత్మ స్వరూప మగు జ్ఞానస్వరూపము, జ్ఞేయము అనగా జ్ఞానవిషయము కాజాలదు. జ్ఞానవిషయములన్నియును జడములు; జ్ఞానము ప్రకాశకము. జడము దృశ్యము, ప్రకాశ్యము. బ్రహ్మము జ్ఞానవిషయమైన జడత్వ, దృశ్యత్వదోషములు పొసగును. బ్రహ్మముయొక్క సగుణత్వమునుగూడ శంకరు డొప్పుకొనునుగాని, అయ్యది పారమార్థికము కాదు, వ్యావహారికము. ఫలతః, మాయికము. బ్రహ్మము సర్వావస్థల నిర్విశేషము. ఆత్మస్వరూపమగుటవలన శూన్యము కాదు. బ్రహ్మము సవిశేషమైన మూర్తము (Limited) అగును; మూర్తమైన పరిణామవినాశము లనివార్యములు. కనుక, నిరస్త - సమస్త ఉపాధికమును, నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావమును నగుబ్రహ్మమునే అద్వైతులు ప్రతిపాదించుచున్నారు.

## సంబంధము

రామానుజుడు శాస్త్రమును ప్రతిపాదకముగను, పురుషోత్తముని ప్రతిపాద్యముగను పేర్కొనుచున్నాడు. శాస్త్రము సగుణ, సవిశేషబ్రహ్మమును ప్రతిపాదించుచున్నది. కేవలము, శాస్త్రప్రమాణము వలననే బ్రహ్మమును మనము గ్రహింపవలెను. బ్రహ్మము సశరీరియా లేక అశరీరియా?, కర్తయా లేక అకర్తయా? ఇత్యాది విషయముల అనుమానప్రమాణమున నిర్ణయింపబూనుకొనిన అనవస్థా, సాధ్యవికలత్వాది దోషములు వచ్చును. కనుక, శ్రుతితప్ప అన్యగతి లేదు.

శాంకరదర్శనమునగూడ, బ్రహ్మమే ప్రతిపాద్యము-శాస్త్రము ప్రతిపాదకము. అయితే, శాస్త్రము నిషేధముఖముననే బ్రహ్మమును నిరూపించుచున్నది. బ్రహ్మాత్మైకత్వబోధానంతరము, శ్రుతి నిరర్థక మగును. ప్రమాణ-ప్రమేయవ్యవహారము లన్నియును అవిద్యాంతర్గతములు; పారమార్థికదృష్టికి శ్రుతిగూడ అవిద్యాంతర్గతమే! ముక్తునకు వేదముగూడ తృణసమానమగును. రామానుజమతమున శ్రుతి అన్నిఅవస్థల అబాధిత ప్రమాణము.

## ప్రయోజనము

రామానుజుడు అవిద్యానివృత్తియే ప్రయోజన మని నుడువుచున్నాడు. ఉపాసనాబలమున బ్రహ్మసాక్షాత్కారమైన జీవుని అవిద్య తొలగును. ముక్తుడు, ఈశ్వరదాసత్వరూపమున వెలయుచు, అపారమగు లీలానందమును ఆస్వాదించును.

శాంకరమతమున బ్రహ్మాత్మైకత్వమే ప్రయోజనము; ఈ ఐక్యబోధవలన అవిద్య ధ్వస్తమగును. అవిద్య తొలగిన, జీవుడు బ్రహ్మస్వరూపమగు పరమానందస్వరూపమున వెలయును. రామానుజుని మతమున ఉపాసనవలన, అవిద్య నశించి మోక్షము లభించును. శాంకరమతమున ఉపాసనకు స్థానమున్నదికాని, అది కేవలము 'చిత్తశుద్ధి'కి తోడ్పడుచున్నది. అవిద్యా వినాశకశక్తి, దానికి లేదు. జ్ఞానమువలననే అవిద్య తొలగుచున్నది. ఈ అవిద్య తొలగుటయే మోక్షము. శాంకరమతమున అజ్ఞానము భావవస్తువు; రామానుజమతమున జ్ఞానాభావమే అజ్ఞానము. రామానుజుని ప్రతిపాద్యమగు ఈ బ్రహ్మము శాంకరదర్శనమునందలి కార్యబ్రహ్మము లేక సగుణబ్రహ్మము అనబడు ఈశ్వరునితో పోలియున్నది. ఈ బ్రహ్మముగూడ, అద్వైతుల దృష్టికి, అవిద్యాంతర్గతము. కాని, దీని నాశ్రయించుకొనినవారు 'క్రమముక్తి'ని పొందుదురు.

* * *

ఇవి వేదాంతదర్శనాలోచ్యములగు అధికారి, ప్రయోజన, సంబంధ, విషయము లనబడు అనుబంధ చతుష్టయము. ఇక మిగిలిన తత్త్వముల సంక్షేపముగ నాలోచింతము.

## బ్రహ్మము

సగుణ — సవిశేష బ్రహ్మమనబడు ఈశ్వరుడే రామానుజుని పరమ-తత్త్వమనియు, మాయ తచ్ఛక్తియనియు పేర్కొనియుంటిని. చిదచిత్ శరీరత్వాదులతని లక్షణములు. సూక్ష్మ చిదచిద్వేషమున ఆయన జగత్తున కుపాదానకారణము. సంకల్ప విశిష్టవేషమున ఉపాదానకారణము. కాలాదుల అంతర్యామిరూపమున సహకారికారణము. కార్యరూపమున వస్తువుల ఉపాదానము. జీవజగత్తులు ఈయన శరీరము. ఈయన తదధిష్ఠాతయగు ఆత్మ. కార్యకారణములు రెండును ఆయనయే. ఈయనగుణములకు సంఖ్య లేదు; దోషగంధము లేదు. ఈయన సృష్టికర్త, కర్మఫలప్రదాత, నియంత, సర్వాంతర్యామి, సర్వవ్యాపి. ఈ సర్వవ్యాపిత్వము స్వరూప, ధర్మభూతజ్ఞాన, విగ్రహరూపముల వెలయుచు, పరిచ్ఛేదరహితమై వెలయుచున్నది. సత్యత్వ, జ్ఞానత్వ, ఆనందత్వ, అనంతత్వాదులు ఈశ్వరుని స్వరూపధర్మములు. జ్ఞానశక్త్యాదులు విశేషధర్మములు. సర్వజ్ఞత్వాదులు సృష్ట్యుపయుక్తధర్మములు. వాత్సల్య-సౌశీల్యాదులు ఆశ్రయణీయోపయుక్త ధర్మములు. కారుణ్యాదులు కరుణోపయుక్తధర్మములు. ఇట్టి ఈశ్వరుడే సృష్టి, స్థితి, సంహారకారకుడు.

* * *

ఏవంగుణ విశిష్టుడగు ఈశ్వరునికి అద్వైతవాదమున చోటున్నది కాని, ఈయన పరబ్రహ్మము కాడు. ఈ గుణములలో కొన్నిటిని వారు, బ్రహ్మముయొక్క తటస్థలక్షణముగ అంగీకరించినారు. కాని, వారి జగత్తు బ్రహ్మము లేక ఈశ్వరునిపరిణామము కాదు. పర-బ్రహ్మము నాశ్రయించి పెంపొందిన వివర్తము. కనుక, అద్వైతులు వివర్తవాదు లనియు, విశిష్టాద్వైతులు, పరిణామవాదు లనియు చెప్పబడుచున్నారు. అద్వైతుల కీశ్వరుడుగూడ మాయాంతర్గతుడు; జీవుల వలె బద్ధుడు కాడు, మాయాధీనుడు. నిర్గుణబ్రహ్మము యొక్క ప్రతిబింబము. పారమార్థికదశయందు, శాస్త్రమువలె, ఈయన ఉనికిగూడ విలోపమందును.

## ఈశ్వరుడు - పరుడు

రామానుజుని ఈశ్వరుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాభేదముల పంచవిధముల వెలయుచున్నాడు. శంఖ, చక్ర, గదా, పద్మధారి - చతుర్భుజుడు, శ్రీభూనీళావిశిష్టుడు, కిరీటాది భూషణ భూషితుడు, వైకుంఠవాసియగు నారాయణుడే పరుడు.

## వ్యూహము

ఈయనకే సృష్ట్యాదుల నిమిత్తము వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను వ్యూహరూపమున వెలయుచున్నాడు. వాసుదేవుడు షడ్గుణ - పరిపూర్ణుడు. సంకర్షణుడు జ్ఞానబలయుక్తుడు. ప్రద్యుమ్నుడు ఐశ్వర్య వీర్యయుతుడు, అనిరుద్ధుడు తేజ, శక్తియుక్తుడు.

ఈ చతుర్విధవ్యూహములను, గుణముల లెక్కను శంకరు డొప్పుకొనలేదు; 'ఏకస్మిన్ అసంభవాత్', 'విప్రతిషేధాత్' అను సూత్రముల వ్యాఖ్య సల్పుచు

ఖండించినాడు. ఆయన ప్రశ్నించునది, ఈశ్వరునకు ఈ వాసుదేవవ్యూహములనే కల్పించి, పరిమితిబద్ధు నొనర్చనేల? ఆబ్రహ్మస్తంబపర్యంతము, 'స ఏకధా భవతి, బహుధా భవతి' అన్నట్లు ఆయనయేకదా! అయితే పాంచరాత్రాగమాదిరూపమున తదర్చన కాటంక పెట్టుటలేదు. ఈవిషయమును గమనించిన శంకరుని విశాలదృష్టి, ఔదార్యములు తేటపడగలవు.

## విభవము

సజాతీయరూప మగు ఆవిర్భావమే విభవము; ఈ ఆవిర్భావమే మత్స్యాది దశావతారములు. ఇందు ముఖ్య, గౌణ, పూర్ణ, అంశాది బహువిధ భేదము లున్నవి. స్వేచ్ఛానుసారము ఇయ్యవి గ్రహింప బడుచున్నవి.

మాయకు వశీభూతు డైనట్లు తోచుచు, ఈశ్వరుడు అవతారమును గ్రహించుటను, అద్వైతులు అంగీకరింతురు.

## అంతర్యామి

సర్వజీవుల హృదయస్థితుడే అంతర్యామి; ఈయన జీవులు స్వర్గనరకముల ననుభవించునట్లు సూక్ష్మ రూపమున వెలయుచున్నాడు యోగులకు దర్శ నీయుడు. జీవునితో నున్నను, తద్గతదోషములు స్పృశింపవు. ఈ అంతర్యామిని అంగీకరించుటకుగూడ అద్వైతుల కెట్టి ఆటంకమును లేదు.

## అర్చావతారము

వివిధ పుణ్యక్షేత్రముల పూజింపబడు విగ్రహమే అర్చావతారము. ఉపాసనాసౌకర్యార్థము, అద్వైతులు అర్చావతారము నంగీకరింతురు; వీతత్పూజాఫలము చిత్తశుద్ధి, జ్ఞానాసక్తి మున్నగునవి.

## జగత్తు

రామానుజాచిమతమున జగత్తు జడము, మఱియు బ్రహ్మముయొక్క శరీరము. బ్రహ్మము జగద్రూపమున పరిణత మైనను అవికృతము. జగత్తు సత్-మిథ్య కాదు.' చిదంశః సదైకరూపతయా సర్వదా అస్తి శబ్దవాచ్యః. అచిదంశస్తు ప్రతిక్షణ పరిణామిత్వేన సర్వదా నాశగర్భః. ఇతి సర్వదా నాస్తిశబ్ద-అభిధేయః. ఏవంరూప చిదాత్మకం జగత్ వాసుదేవ శరీరమ్, తదాత్మక మితి జగద్ యాథాత్మ్యం సమ్యగుక్తమ్.' అని ఆచార్యుని నిర్వచనము.

జగత్తు దృశ్యము జడ మగు విషయమును అద్వైతు లంగీకరింతురు కాని, బ్రహ్మశరీరత్వ, సత్యత్వ, పరిణామత్వాదులు నిరాకృతములు. వీటి నంగీకరించిన నిత్యత్వ, నిర్వికారత్వము లసంగతములగు నని అద్వైతుల ఆక్షేపము.

## జీవుడు

జీవుడుకూడ బ్రహ్మముయొక్క శరీరము. జీవుడు కూడ చైతన్యస్వరూపుడే. కాని, అణుపరిమాణ-యుక్తుడు. బ్రహ్మము, జీవులకు సజాతీయ, విజాతీయ భేదములు లేవు; స్వగతభేద మున్నది. బ్రహ్మము పూర్ణము, జీవుడు అసంపూర్ణుడు. బ్రహ్మము ప్రభువు, జీవుడు దాసుడు. ఇరువురకును స్వయంప్రకాశత్వ మున్నది, జ్ఞానాశ్రయత్వ మున్నది. జీవుడు ప్రతి శరీరమున భిన్నుడు. అతని స్వరూపము సుఖస్వరూప మేయైనను, సంసారదశయందు దుఃఖమును బొందును. ఇతడు కర్త, భోక్త, శరీరి, శరీరము. ప్రకృతి నపేక్షించి శరీరి, ఈశ్వరు నపేక్షించి శరీరము.

అద్వైతులు సంపూర్ణముగ, ఈ విషయమున వ్యతిరేకాభిప్రాయులు. జీవుడు విభుడు, బ్రహ్మముయొక్క ప్రతిబింబము-కాదు-బ్రహ్మమే. జీవభావము అవిద్యాకల్పితము. ఇతని స్వరూపము సచ్చిదానంద మయము. జీవుని కార్యముగను, బ్రహ్మశరీరముగను అంగీకరించిన అనిత్యత్వదోషము, శరీరమునందున్న దుఃఖిత్వాదులు శరీరియగు బ్రహ్మమునకూడ ఉండుట అను దోషములు పొడ్లగలవు. కాని, ఈ రెండువిషయములకు విశిష్టాద్వైతులు సరియైన సమాధానము నీయజాలకున్నారు.

## జీవభేదములు

రామానుజదర్శనమున జీవులు బద్ధ, ముక్త, నిత్యులని మూడువిధముల చెప్పబడుచున్నారు. సంసార-నివృత్తిని బొందనివారు బద్ధులు; దేవ, మనుష్య, తిర్యక్, స్థావరములుగాగల జీవు లందరును బద్ధులే. బద్ధులు శాస్త్రవశ్యులు, అవశ్యులు అని రెండు తెగలు. జ్ఞానమును సంపాదించు ఇంద్రియములు గలవారు శాస్త్రవశ్యులు; తిర్యక్స్థావరములు అవశ్య

ములు. శాస్త్రవేత్తలు బుభుక్షు, ముముక్షువు లని రెండువిధముల విభజింపబడుచున్నారు. త్రివర్గనిష్ఠులు బుభుక్షువులు. వీరు మరల అర్థకామపరులు, ధర్మపరు లని ద్వివిధముల వెలయుచున్నారు. దేహాత్మాభిమానపరులు, అర్థకామపరు లనంబడుదురు. యజ్ఞ దాన తపో రూపమగు వైదికధర్మము నాశ్రయించినవారు ధర్మపరులు. ధర్మపరులు బ్రహ్మశివాది అన్యదేవతాపరులు, నారాయణాశ్రితపరులు అని రెండువిధముల వెలయుచున్నారు. అందు, నారాయణాశ్రితపరులలో మరల, ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థులను త్రివిధ భేదము లున్నవి. ముముక్షువులు కైవల్యపరులు మోక్షపరులని రెండు తెఱగులమున్నారు. జ్ఞానయోగము వలన ప్రకృతినుండి స్వాత్మను వేఱుపరచుకొనినవాడు, కైవల్యపరుడు. మోక్షపరులలో భక్త, ప్రపన్నులను ద్వివిధ భేదము లున్నవి. పూర్వమీమాంసాపరనఫలిత ముగ మోక్షమును గోరువారు భక్తులు. భక్తిమార్గమున త్రైవర్ణికులకు, దేవతలకు అధికార మున్నది. శూద్రులకు లేదు. సాధనభక్తినిష్ఠులు, సాధ్యభక్తినిష్ఠు లని భక్తులు రెండు తెఱగుల నున్నారు. అకించినులును, అనన్యగతులునునై భగవంతుని ఆశ్రయించుకొనినవారు ప్రపన్నులు. వీరియందు మరల త్రైవర్గికపర, మోక్షపర భేదము లున్నవి. ఐకాంతికి, పరమైకాంతికి అని మఱియొక విభజన. కేవలము నారాయణాశ్రితుడును, మోక్షకామియును నగువాడు ఐకాంతికి. భక్తిజ్ఞానములగాక, ఇతరముల గోరనివాడు పరమైకాంతికి.

## సా ధ న

రామానుజుడు, ధ్యానము ఉపాసనల ముక్తిసాధనములుగ గ్రహించినాడు. భక్తియే మోక్షోపాయము; జ్ఞానము కాదు. బంధము పారమార్థిక మగుటవలన, పరమపురుషుని ప్రసాదమువలననే తొలగును. వేదనా, ధ్యాన ఉపాసనాశబ్దవాచ్యమగు నదియే భక్తి; దాని స్వరూపము తైలధారనుబోలు ధ్రువానుస్మృతి. ఇయ్యది, ఆశ్రయాది త్రివిధ దోషరహితమైన ఆహార శుద్ధ్యాదులవలన విశుద్ధతను బొందినవాని పక్షమున ప్రత్యక్షముగ పరిణమించును.

## ప్ర ప త్తి

ప్రతికూల వర్జనమును, అనుకూల సంకల్పపూర్వకమును, సర్వతోభావమును నగు ఆత్మసమర్పణయే ప్రపత్తి యనబడు న్యాసవిద్య. దీనిని రామానుజు డిట్లు అభివర్ణించినాడు:

'సత్యకామ, సత్యసంకల్ప, పరబ్రహ్మభూత, పురుషోత్తమ, మహావిభూతే! **** అఖిలజగత్స్వామిన్, అస్మత్స్వామిన్, సత్యకామ సత్యసంకల్ప సకలేతర విలక్షణ! అర్థికల్పక! ఆపత్సఖ! శ్రీమన్నారాయణ! అనన్యశరణః త్వత్పాదారవిందయుగళం శరణమహం ప్రపద్యే.

పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్,
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ.
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్,
లోకవిక్రాంతచరణౌ శరణం తేఽవ్రజం విభో!

ఇత్యాది—

—గద్యత్రయమ్. వానిళ్ల. సం. పు. ౭.

తక్కిన విభాగములమాట ఎట్లున్నను శాంకర దర్శనమునకు, బద్ధ, ముక్త, నిత్యులను త్రివిధ భేదములను వ్యావహారికముగ నొప్పుకొనుటకు అభ్యంతరము లేదు. వాస్తవమున కందఱును ముక్తులే; బంధము భ్రమ. ఇది తొలగుటకు జ్ఞానమాత్రమే అవ్యభిచారమగు ఉపాయము. ఈ జ్ఞానమునకు శూద్రులకుగూడ అధికారమున్నది. నిత్యశివు లనబడు నారద విష్వక్సేనాదులు, అద్వైతుల 'అధికారికపురుషుల'ను బోలియున్నారు. కర్మ, భక్తియోగములు పారంపర్యముగ మోక్షకారణములు. శంకరుని భక్తినిర్వచనము — ఆత్మానుసంధానము; జీవేశ్వరుల భేదబుద్ధి తొలగుట, దాసత్వము కాదు. శంకరుడు శూద్రులకుగూడ జ్ఞానాధికారమును ఒప్పుకొనువిషయమును గాంచిన, ఆయన విశాల దృష్టియు, ఔదార్యమును బోధపడగలవు. రామానుజుడు శూద్రాధికారమును నిషేధించుట, వారి గురుపరంపరలో కొందఱు శూద్రు లుండుట పరస్పరవిరుద్ధములు, విస్మయకరములు.

## ఉత్క్రాంతి - ముక్తి

ప్రాకృతదేహము తొలగ, అప్రాకృతదేహమున వైకుంఠమున కరిగి సమానభోగమును, నారాయణుని చిరదాసత్వమును బొందుటయే రామానుజుని అభిప్రేతమగు ముక్తి. ఆముక్తిని బొందుక్రమ మియ్యది. ముక్తికి

అర్హుడగు జీవుడు సుకృతములను హితులకును, దుష్కృతములను శత్రువులకును, సంపదను దాయాదులకును వదలి, వాక్కును మనస్సునను, మనస్సును హృదయమునను నిల్పి, ముక్తిద్వారమగు సుషుమ్నానాడి యందు ప్రవేశించి, బ్రహ్మరంధ్రద్వారమున నిర్గతుడగును. పిదప, సూర్య కిరణముల నాశ్రయించి దిన, పక్ష, ఉత్తరాయణ, సంవత్సరాభిమానులగు దేవతల వలన మార్గమున సత్కరింపబడి, సూర్యమండలమును భేదించుకొని సూర్యలోకమున కరుగును. అట చంద్ర, విద్యుత్, వరుణ, ఇంద్ర, ప్రజాపతులను ఆతివాహిక–పథప్రదర్శకుల సాయమును బడసి క్రమముగ విరజా నదిని చేరుకొనును. అట, సూక్ష్మ శరీరమును పరిత్యజించి, దివ్యదేహమును బడసి, ఇంద్రప్రజాపతు లను ద్వారపాలకుల ఆదేశమున వైకుంఠమును బ్రవేశించి ఐరమ్మదమను సరోవరమును, సోమసవనమను అశ్వత్థవృక్షమును గాంచి, అప్సరసలచే నభినందితుడగును. పిదప, అనంత, గరుడ, విష్వక్సేనులకును, ఆచార్యులకును ప్రణమిల్లి, భగవత్పర్యంక సమీపమునకు గొనిపోవబడును. ఆ పర్యంకమున ధర్మపీఠమున, నానాభరణభూషితుడును, దేవీసహితుడును నగు శ్రీమన్నారాయణుడు వెలయుచుండును. ముక్తు డాయనకు ప్రణమిల్లిన, భగవంతు డంకమున గ్రహించి, దాసత్వము ననుగ్రహించును. దాస్యానంద అనుభవము నందుచు, ఈశ్వరేచ్ఛాధీనమగు సర్వత్ర సంచరణాది శక్తులను ముక్తుడు పొందును.

ఈ నిర్గమనము పారిభాషికముగ 'ఉత్క్రాంతి' లేక 'గతి' యనబడును. శంకరునిముక్తి, ఉత్క్రాంతి వివర్జితము; 'గతి' రహితము. ఇటనే, ఈ లోకముననే అనుభవింపదగినది. శంకరుని ముక్తి క్రియాసాధ్యము కాదు కాక సంస్కార్య, ఉత్పాద్యాదికార్యములలో నేదొక్కటియును గాదు. అప్య మనబడు ప్రాప్య వస్తుప్రాప్తి. అనగా, అజ్ఞానరాహిత్యము. రామానుజునిముక్తి స్వర్గసుఖ విశేషము. రామానుజుడు, అద్వైతుల జీవన్ముక్తి, విదేహముక్తుల నొప్పుకొనడు. కాని, అద్వైతుల సగుణ-బ్రహ్మలోకమునకును, రామానుజుని వైకుంఠమునకును భేదము లేదు; మార్గముకూడ ఒక్కటియే. సగుణబ్రహ్మోపాసనాపరులు ఈ క్రమము ననుసరించియే బ్రహ్మలోకమున కరిగి, అట ప్రకృతి తరమగు సాధనము సల్పి, 'విదేహకైవల్యము' నందుదురని ఒప్పుకొనుచున్నారు. రామానుజుడు, తనముక్తిని తన నిర్దిష్టవస్తువును ఒప్పుకొననివారికి, అపరిమితమగు శాస్తిని విధించుచున్నాడు. బ్రహ్మము తానే యని తలచువారు రాజద్రోహులను బోలువారు, ముక్తి వారికి బహుదూరము. ఈ ముక్తివిషయమునగూడ, ఆచార్యద్వయముయొక్క తారతమ్యము తేటపడగలదు. శాంకరమతమున ఏఒక్కడును అధోగతిని పొందుటలేదు; క్రమముగ ఉన్నతిని బొందుచున్నాడు. చివరకు, తత్త్వము తప్పకుండ లభించును. ఈ సువిశాలదృష్టి రామానుజునియందుగాని, తదితరవైష్ణవాచార్యులయందుగాని కన్పించదు.

## సమాప్తి

ఇప్పటికే వ్యాసము చాలగ పెరిగినందువలన మాయావాదఖండనము, అనిర్వచనీయవాదఖండనము, నిర్విశేషవాదఖండనము, అసత్ఖ్యాతివాదఖండనము, మహావాక్యార్థవిచారము మున్నగు జటిలవిషయముల ప్రస్తావింప సాహసించుటలేదు. ఈవాదఖండనావసరమున రామానుజుడు విశేషనైపుణ్యమును జూపినను, నెగ్గినట్లు కన్పింపదు. 'అహం బ్రహ్మాస్మి' మున్నగు స్పష్టార్థద్యోతకవాక్యముల నర్థవాదము లని వచించి తప్పుకొనినాడు. రామానుజుడు, 'సదసద్విలక్షణత్వ' మను అనిర్వచనీయవాదుల నిరుక్తిని ఖండింపయత్నించి వారి కొకింత ఉపకారమునే సల్పినాడు. తరువాతి వారు, 'ప్రతిపన్నోపాధౌ త్రైకాలిక నిషేధప్రతియోగిత్వమ్' (వివరణకారుడు), 'జ్ఞాననివర్త్యత్వమ్' (వివరణమ్) 'సద్భిన్నరూపత్వమ్' (ఆనందభట్టారక), 'స్వాత్యంతాభావాధికరణప్రతీయమానత్వం' (చిత్సుఖి) అను అభేద్యలక్షణముల నిర్వచించినారు. శాంకరభాష్యము నెఱుంగగోరువారు, శ్రీభాష్యమును బఠించుట చాలగ అవసరము. శంకరుడు చూపినంతగ, రామానుజుడు శ్రుతిప్రమాణమును జూపజాలక, స్మృతులనే బహుళముగ వాడినాడు. గ్రహించిన శ్రుతివాక్యములు పెక్కులు, అప్రసిద్ధములగు ఉపనిషత్తులకు చెందుచున్నవి. పాశ్చాత్యదార్శనికులగు స్పినోజా, హెగేలుల మతవాదమునకును, రామానుజదర్శనమునకును సన్నిహితసంబంధ మున్నది.

## మహిమాఖ్యాతి

శంకర రామానుజు లిద్దరును 'యుగసంధి' సమయమున జన్మించి, సంస్కృతిని నిలబెట్టిన మహా పురుషులు. రాధాకృష్ణ పండితుడు వచించినట్లు, ఒకరి గుణములు మఱియొకరి దోషములై నిలిచినవి. శంకరుడు జ్ఞానులలో శ్రేష్ఠుడై, నేటికిగూడ సమస్త జగత్తునందలి విజ్ఞుల అభివాదనముల బొందుచున్నాడు. వివేకానందుని భవిష్యద్వాణి ననుసరించి, సైన్సు, అద్వైతవాదములు చేతులు గలుపుకొనుచున్నవి. రామానుజుడు భక్త శ్రేష్ఠుడై, భావుక చూడామణియై భారతదేశము నందలి జనసామాన్యము యొక్క హృదయమున శాశ్వతముగ నభిషిక్తుడై వెలయుచున్నాడు. ఆయన నిరూపించిన దాస్యభక్తియే, తరువాత శ్రీ కృష్ణచైతన్యుని యందు సఖ్య, వాత్సల్య, మధుర, రూపముల విస్తరిల్లి దేశమును పునీత మొనర్చినది.

ముగించుటకు: వేదాంత దర్శనము నందలి ఏ ఒక్క వాదమును ఆ ఆచార్యునితోడనే ఆరంభమైనదని తలపగూడదు. అనుపూర్వికముగ ఆయా వాదధారలు ప్రవహించుచు, విశిష్ట ఆచార్యులవలన పెంపొందింప బడినవి. అశ్మరథ్య, ద్రమిడ, టంక, గుహదేవ, శ్రీవత్సాంకులు విశిష్టాద్వైత వాదమును, రామానుజునకు పూర్వమే ప్రవచించియుండిరి; నాథముని, యామునులు సాక్షాత్ పూర్వులు.

"యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే."

---

# త్యాగము

శ్రీ నవుడూరి వెంకటరమణ

ఇందు వచ్చు పాత్రులు:

| | | |
|---|---|---|
| వృషపర్వుడు | — | రాక్షస రాజు |
| శుక్రాచార్యులు | — | రాక్షస గురువు |
| యయాతి | — | చంద్రవంశపురాజు |
| శర్మిష్ఠ | — | వృషపర్వుని కూతురు |
| శ్యామల, ఇందుమతి, వసంత | — | శర్మిష్ఠ చెలికత్తెలు |

సేవకులు కొందరు

## మొదటి దృశ్యము

[వృషపర్వ మహారాజు మందిరంలో వృషపర్వుడు, శర్మిష్ఠ ప్రవేశిస్తారు కులాసాగా సంభాషించుకుంటూ. వృషపర్వుడు పెద్దస్థూలమైన శరీరం కలిగివుంటాడు. మంచి ఆజానుబాహువు. అధికారంతోనూ, రాజసంతోనూ ఒప్పుతూంటాడు. శర్మిష్ఠ పదిహేను సంవత్సరాలు వయస్సు కలిగుంటుంది. అందంగా పసుపువన్నె శరీరం కలిగిన తీరైన విగ్రహం. నాజూకు అలంకారం, అమాయికమయిన చూపులు కలిగి మంచి ఆకర్షణీయంగా వుంటుంది. వృషపర్వుడు సోఫామీద కూర్చుంటే, శర్మిష్ఠ పక్కను కూర్చుంటుంది.]

వృష — అమ్మా! నీపుట్టినరోజు వుత్సవానికి నీ స్నేహితురాండ్రందరినీ పిలిచావా?

శర్మి —పిలిచాను నాన్నగారూ! లలితక్క, శ్యామల, యిందుమతి, వాళ్లంతా వస్తానన్నారు. కాని గురువుగారింటికెళ్లి దేవయానిని పిలవబోతే అది మాట్లాడక, మూతి ముడుచుకుని ఓమూల కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. నేనెంత పిలిచినా మాట్లాడ్లేదు. దానిదుఃఖానికి కారణం చెప్పలేదు. గురువుగారు ధ్యానంలో వున్నారు వారి నడుగుదా మంటేను. నాకు మరెవళ్లూ అక్కడ కనపళ్లే అడగటానికి. అదెందు కేడుస్తోందో మీకు తెలుసా నాన్నగారూ?

వృష — నాకు తెలియదు తల్లీ!

శర్మి — అయితే, నాన్నగారూ, గురువుగారు మహనీయులనీ, ఆయనదగ్గర దివ్యమహిమలు చాలా వున్నాయనీ, ఆయనకు సాధ్యంకాని పని యేదీ లేదనీ చెప్పారుకదా, ఆయన కూతురి దుఃఖాన్ని పోగొట్టలేడేం? అది ఆయనకు చేతకాలేదా?

వృష — ఆయన ధ్యానంలో వున్నారని నువ్వేకదా చెప్పావు? ఆయన కింకా తెలియలే దన్నమాట దేవయానివిచారంగురించి. తెలిస్తే యింతసేపు వూరుకుంటాడా? దానికేదో ప్రతీకారం యిదివరకే చేసివుండును. ఆయనకు సాధ్యంకానిది

యేదీ లేనేలేదు. ఆయన మనకు గురువుగా రుకావడంచేతే, మనలను దేవతలేమీ చెయ్య లేకుండా వున్నారు. ఆయనదృష్టి మనమీద కాస్త మళ్లిందంటే మనపని సరి.

శర్మి — అయితే, నాన్నగారూ! ఆయన కన్ని దివ్యమహిమ లెలా ఒచ్చాయండీ? ఆ మహిమ లేమిటో నాకు చెప్పండి.

వృష — ఆయనచేసిన ప్రచండమైన తపస్సుచేత ఆయ నామహిమలు సంపాదించాడు. అన్ని మహిమలకన్న ముఖ్యమైంది 'మృతసంజీవి' అనేవిద్య. దానితో ఆయన చచ్చిపోయిన వాళ్లను బ్రతికించేస్తాడు. ఏదైనాయుద్ధంవస్తే ఆయ నావిద్యచేత చచ్చిపోయిన మన వాళ్లనందరినీ బ్రతికించేస్తాడు. అందుచేత మనం తప్పకుండా జయిస్తాము.

శర్మి —దేవతల దగ్గిర యీ మహిమ లేదుకాబోలు. వాళ్ల గురువుకూడ గొప్పవాడంటారే!

వృష —అతనూ గొప్పవాడే కాని, అతని కీ విద్య తెలియదు. ఇప్పుడిప్పుడు వాళ్లూ ఏలాగన్నా యీ విద్య సంపాదిద్దామని ప్రయత్నం చేస్తు న్నారు. బృహస్పతి తన కొడుకును మనగురువు గారిదగ్గర శుశ్రూష చేసి ఆ విద్యను సంపా దించ మని పంపాడు. అతడే దేవయానితో తిరుగుతున్న కచుడు. అతని కీ విద్య దొర క్కుండా మనవాళ్లు ప్రయత్నిస్తున్నారు. ఒకటి రెండుసార్లు అకచుణ్ణి చంపేశారు కూడాను. కాని దేవయానిబలవంతంమీద గురువుగారు తిరిగీ బ్రతికించారు.

శర్మి —దేవయాని కెందుకూ అంత పట్టుదల ఆ కచుడిప్రాణంమీద?

వృష —అది వాణ్ణి ప్రేమించిం దంటున్నారు మన వాళ్లు. ఎంతమట్టుకు నిజమో ఎవరికి తెలుసు?

శర్మి —అదేమిటినాన్నగారూ! శిష్యుడంటే పుత్రు డితో సమానుడు కదా, అందుచేత దేవయానికి కచుడు సోదరు డవుతాడు. ఈవావి సంభవ మవుతుందా?

వృష —కూడదు తల్లీ! దానివూసు మనకెలపోనిస్తూ. అమ్మా! మధ్యాహ్నం విందు కన్ని యేర్పాట్లు చేశావూ?

శర్మి —చేశానండి...అదుగో యెవరో వస్తున్నారు. (ప్రవేశం. ఇద్దరు సేవకులు దైన్యంతో.)

దేవ — మహారాజా! సర్వనాశన మయిపోయింది. ఆ కచుడికి గురువుగారు మృతసంజీవనీవిద్య నేర్పేశారు. నేర్పడమే కాకుండా మనందరి మీద మండిపడుతున్నారు, దానికి మనమే కారకుల మని.

వృష — అది దేనికి?

సేవ — నిన్న మేమొక తెలివితక్కువపని చేశాము. కచుణ్ణి చంపి అక్కడా యిక్కడా పారేస్తే గురువుగారు తిరిగీ బతికిస్తున్నారుగదా అని యీమారు అతన్ని కాల్చేసి ఆ బూడిదను మద్యంలో కలిపి గురువుగారిచేత తాగించేశాము. తరవాత ఆయన సంగతి తెలుసుకుని కడుపులో కచుణ్ణి బతికించి అతని కావిద్య నేర్పి, తనకడుపు చించుకుని పైకి వచ్చి తనను మళ్లీ బ్రతికించ మన్నాడు. అత నలా చేశాడు. ఈవిధంగా కచు డావిద్య సంపాదించాడు. అతన్ని మన వాళ్లు చంపటంనించే యీవిద్య అతని కివ్వవలసి వచ్చిందట. లేకుంటే తానివ్వ దల్చుకోలేదట. ఇక మన కేందారి మహారాజా?

వృష — ఏందారీలేదు. మనకు వినాశకాలం వచ్చిం దంటే. దీనికి తిరుగుడేదో గురువుగారే ఆలోచిం చాలి. ఆయన్నే ప్రార్థిద్దాము. (ముందుచూచి) అదేమిటి! గురువుగా రిక్కడికే వస్తున్నారు. శర్మిష్ఠా! దేవయానికూడా వస్తోంది.

శర్మి — ఆ! దేవయానా?

[ప్రవేశము శుక్రాచార్యుడు. గొప్ప తేజస్వి అయినా యిప్పుడు ముఖంలో దైన్యం అవుపిస్తుంది.

దేవయాని పద్ధెన్మిది సంవత్సరాల నిండుయౌవనంలో వుంటుంది. ఏడిచేడిచి వుండటంచేత ముఖంమీద కన్నీటిచారలు కనపడతాయి. మధ్యమధ్య వెక్కిళ్లు వస్తూంటుంది. తండ్రిచాటుగా నిలబడుతుంది.

వృషపర్వుడు, శర్మిష్ఠ, సేవకులూ నమస్కరిస్తారు. శుక్రాచార్యుడు అందుకుంటాడు.]

శుక్ర — రాజా! మీవాళ్ల అవజ్ఞతచేత కచుడు కృతకృత్యుడై వెళ్లిపోయాడు. పోతూపోతూ ప్రశాంతమైన నా ఆశ్రమంలో ఆరని చిచ్చు పెట్టేసి పోయాడు. వాళ్ల ఆ బాల్యస్నేహం యీ దేవయానిపట్ల ప్రణయంగా మారింది. గురుపుత్రి వని చెపుతూ కచుడు నిరాకరించాడు. దేవయానిదుఃఖాని కంతు లేదు. దాని కేవిధంగానూ నే నూరట కల్పించలేకున్నాను. అసమానమైన నావిద్యాప్రభావమూ అన్యులకు పట్టుబడిపోయింది. నాబిడ్డకూ దుర్భరావేదన సంభవించింది. అన్నివిధాలా నాబ్రతుకు వ్యర్థమైపోయింది. నా కేంచేయడానికీ పాలుపోలేదు. యీ కష్టాలను కడతేర్చడానికి వుపాయ మేదీ కనిపించదు.

వృష — గురూ! దీని కింత కించపడడ మెందుకూ? ఈపాటి కాకచు డెంతోదూరం వెళ్లడు. మూడునిమిషాల్లో వాణ్ణిపట్టి తెప్పించి మీకాళ్ల మీద పడేస్తాను. మీయిష్టం వచ్చినట్లు వుపయోగించుకోండివాణ్ణి.

శుక్ర — తప్పు రాజా! తప్పు. వానివల్ల దోషం లేశమాత్రం లేదు. దేవత లెప్పుడూ ధర్మమార్గానువర్తులు. వారధర్మం ప్రాణావసానసమయంలో నన్నా చేయరు. ఆప్రయత్నం వృథా. నిన్ను నే కోరేసహాయం ఏమంటే యీనాబిడ్డను, మాతృవిహీనను కనికరించి నీబిడ్డతో కలిపి ఆటపాటల్లో కాలక్షేపం చేయించి దాని దుర్భరావేదన మరచేటట్టు చేయాలి. దాని హృదయం కుదుటపడేవరకూ నామనస్సుకు శాంతి లేదు. దానికి శైశవంలోనే తల్లి చనిపోయింది. అప్పటినుంచీ నాకనురెప్పల్లాగు కాపాడుకొస్తున్నాను. అది ఏంకోరితే అదిచ్చి, ఏం కోరితే అది చేసీ ఎప్పుడూ దానికి వుల్లాసం కూర్చేవాడిని. ఇన్నాళ్లకు దాని విషాదం నాకు తీర్చరాని దయింది. ఎంతతపస్సు చేస్తేనేం? ఎన్ని మహిమలు సంపాదిస్తేనేం? ఒకనిర్భాగ్య బాలిక కానందం కూర్చలేకపోయాక?

వృష — గురువుగారూ! మీరు మునీశ్వరులు మహాత్ములు, సర్వసంగ పరిత్యాగులు. తమరింతగా వాపోవరాదు. మీబిడ్డకు వచ్చిన అపాయ మేమీ లేదు. నా కన్నబిడ్డకన్న గారాబంగా చూస్తాను మీ పిల్లను. ఆవిషయంలో మీ అనుమానం వదలండి. మా శర్మిష్ఠ, లలిత మొదలైన వాళ్లంతా దేవయానివిచారం పోగొట్టి వుల్లాసం కూరుస్తారు. అమ్మా! శర్మిష్ఠా! పొద్దుట వెళ్లితే దేవయాని మాట్లాడలేదన్నావు. ఇదిగో యిప్పుడిక్కడికే వచ్చింది. నీ పుట్టింరోజు వుత్సవానికి పిలువు. గురువుగారు చెప్పింది విన్నావుకదా! దేవయానివిషయంలో చాలా జాగ్రత్త తీసుకుని ఆమెవిచారం పోగొట్టు. అమ్మా; దేవయానీ, యీవాళనించీ నువ్వు మా అంతఃపురంలోనే వుండి మాశర్మిష్ఠవాళ్లతో ఆడుకో. వెళ్లు శర్మిష్ఠా! దేవయాన్ని తీసుకొనిపో.

శర్మి — దేవయానీ! రా మనంపోయి మధ్యాహ్నం విందు కన్ని యేర్పాట్లు చేసుకుందాము.

(అని దేవయానిచెయ్యి పట్టుకొని తీసుకుని పోతుంది.)

శుక్ర — రాజా! నాశెంగ సగం తీరిపోయింది. శర్మిష్ఠ చాల తెలివైంది, బుద్ధిమంతురాలు. దాని సహవాసంచేత మా దేవయాని శీఘ్రకాలంలోనే విచారం మరిచిపోగలదు. నామనస్సు పూర్తిగా వికలమైపోయింది. నే తపస్సు చేసుకునేందుకు పోతాను.

వృష — గురూ! నమస్కారము. దేవయాని విషయమై మీ కే విచారం వద్దు. ఆ పూచీ నాది. ఇంక నే నుంటాను సెలవు.

(అందరూ నిష్క్రమింతురు.]

## రెండవ దృశ్యము

[రమణీయమైన వనంలో ఒక తటాకం సమీపాన శర్మిష్ఠ, లలిత, శ్యామల, ఇందుమతి, వసంత మొదలయినవాళ్లంతా ఆనందంగా ఆడుతూ పాడుతూ వుంటారు. దూరంగా దేవయాని ఒక రాయిమీద కూర్చుని ఆలోచిస్తూంటుంది.]

శర్మి — లలితా! యీ పువ్వు చూడూ ఎంత బాగుందో?

లలిత — ఆఁ, నువ్వుమాత్రం బాగులేవూ?

శర్మి — అది కాదే లలితా! దాని వాస నెంత బాగుందో చూశావా?

వసం — అ దెంతసేపు ముచ్చట? రేపటిదాకానే కదూ?

శర్మి — ఈ పువ్వులు యిలా వాడకుండా, వాసన పోకుండా ఎల్లకాలం వుంటే ఎంత బాగుంటుంది?

ఇందు — అలా వుంటే యిప్పుడే ఓదండ గుచ్చి దాస్తావా నీపెళ్లినాటికి? నీ మొగుడు మెళ్లో వేయడానికి?

శర్మి — ఛీ ఛీ! పో. అనవసర ప్రసంగం ఎందుకూ?

ఇందు — ఎందుకమ్మా! అంతకోపం? ఏం, నీకు పెళ్లి కాదా? ఆయనగారి మెళ్లో పూలదండ వెయ్యవా? వున్నమాటంటే వులుకెందుకు?

శర్మి — వసంతా! దేవయానేదీ?

వసం — అదిగో. ఆ రాయిమీద కూర్చుని ఏమిటో ఆలోచిస్తోంది.

లలి — ఏమిటో ఆలోచనలకు అంతు లేకుండా వుంది. దేన్నిగురించేమిటి?

ఇందు — ఆకచుడి గురించి కాబోలు.

శర్మి — ఇస్స్. వాడివూసెత్తవద్దు. దేవయానికి కష్టంగా వుంటుంది. పదండి. దేవయానిని పలకరిద్దాము. (దేవయానిదగ్గరికి వెళ్లి) దేవయానీ! ఏమిటాలోచిస్తూ కూర్చున్నా విక్కడ? (ముఖంలోకి చూసి) అదేమిటి, దేవయానీ, ఏడుస్తున్నా వెందుకూ? నాతో చెప్పవూ? (కన్నీళ్లు తుడుస్తుంది.)

దేవ —(వెక్కి వెక్కి ఏడుస్తుంది కాని మాట్లాడదు.)

శర్మి — దేవయానీ! లే. ఏడవకు మళ్లీ యిప్పుడెందుకీ దుఃఖం చెప్పు.

దేవ —శర్మిష్ఠా! నాబాధ వర్ణనాతీతం. మీలాంటి అనభవశూన్యలకు చెప్పినా తెలియదు. చిర సహవాసంచేత కచుణ్ణి నేనింత స్వల్పకాలంలో మరిచిపోలేకుండా వున్నాను. ఈ వనంలో మేమాడిన ఆటలు, పాడినపాటలు, జన్మజన్మాలకూ మరపురానివి. ఇవాళ తిరిగీ యీ వనం ప్రవేశిస్తూవుంటే నా ఒళ్లు జలదరించింది. మునపటి ఆనందమయదినాలన్నీ తలపునకు వచ్చి నా హృదయంలో విరహాగ్ని రేకెత్తింది. శర్మిష్ఠా! నిష్కల్మష ప్రేమతో పొంగిపొర్లే నా సుకుమార హృదయం మీద వజ్రాఘాతం చేసి వెళ్లిపోయాడు. ఆతనిహృదయంలో యింత కాఠిన్యం వుం దని ఎన్నడూ గుర్తించలేకపోయాను. నా ఆశాసౌధాలన్నీ ఒక్కమారుగా కూలిపోయాయి.

శర్మి — దేవయానీ! ఆ పామరుడునిగురించి యింక తలపెట్టకు. తన్నే సర్వస్వమని నమ్మకున్న ఒక అమాయకురాలిని మోసగించిన ఆదురాత్ముణ్ణి మరచిపో. ఇన్నాళ్లూ నీ వనుభవించింది కేవలం ఒక స్వప్నం. అసలు నీకు ప్రియుడన్నవాడు లేనేలేడు. నువ్వు ఎవళ్లనీ ప్రేమించనే లేదు. ఆ విషయాన్ని పూర్తిగా మరిచిపో. నిన్నింతగా అవమానించినవాడినిగురించి నీ వింతగా విచారించకూడదు.

దేవ — శర్మిష్ఠా! మరిచిపోవడ మంటే నువ్వనుకున్నంతసులువైంది కాదు. అనుక్షణం కలిసి మెలిసి తిరిగి ఒకరి హృదయం ఒకరు తెలుసు

కుని ప్రవర్తించి పరస్పరం ప్రేమించుకున్న తరవాత ఎలా మరిచిపోవడం?

శర్మి — అది నీకతనిమీదవున్న గుడ్డి వ్యామోహం. అతడు తన కార్యం నెరవేరేందుకు ఎంతవరకవసరమో అంతప్రేమనటన చేశాడు. అతడు నిన్ను ప్రేమించలేదు. అతనికి హృదయంలేదు. కేవలం అత నోస్వార్థపరుడు. నిరంతరం రాక్షసులచేత తనకు బాధ లుంటాయని తెలుసుకుని వాటిని బాపుకొనే నిమిత్తం నిన్ను చేపట్టాడు. తనకార్యం నెరవేరిన వుత్తరక్షణం నిన్ను దులిపేశాడు. అంతే. నువ్వాతణ్ణి యింక మరచిపోక తప్పదు.

దేవ — అవును. మరిచిపోక చేసే దేముంది? నువ్వు చెప్పినట్లనోస్వప్నం. ఆ అనుభవ మింకలేదు. పోదాం పదండి ఆడుకునేందుకు. ఆ తటాకంలోదిగి యీత నేర్చుకుందాం. నీ కీత వచ్చా శర్మిష్ఠా? (నిట్టూర్పుతో) నాకు కచుడే నేర్పాడు యీత.

శర్మి — అలాగే పద.

[అంతా తటాకంలోకి దిగి యీత లాడుతూంటారు. కొంచెంసేపట్లో పెద్ద గాలికుమారం వీస్తుంది. ఒడ్డున వేరువేరుగావున్న చీరలన్నీ కలిసి ఓ పెద్ద కుప్పగా అవుతాయి. క్రమంగా చినుకులు ప్రారంభిస్తాయి.]

శర్మి — అదిగో! వర్షం ప్రారంభమైంది. ఇళ్లకు పోదాం పదండి.

[అని గట్టెక్కును. తొందర తొందరగా అందరూ వచ్చి ఎవళ్ల చీర వాళ్లు వెతుక్కొని కట్టుకుంటారు. పొరపాటునశర్మిష్ఠ దేవయానిచీర కట్టుకుంటుంది. దేవయాని శర్మిష్ఠచీర కట్టుకొనక శరీరానికి చుట్టబెట్టుకొని]

దేవ — శర్మిష్ఠా! నా చీర నువ్వు కట్టేసుకొన్నావు. ఇదిగో నీచీర. ఇది తీసుకుని నాచీర యిచ్చేయి.

శర్మి — చినుకులు ఎక్కువై పోతున్నాయి. వేగం యింటికి పోవాలి. అందాకా అదికట్టుకుని పద. ఇంటివద్ద కిచ్చేస్తాను.

దేవ — మేము బ్రాహ్మలం. మీరు మహారాజులు. మీరు కట్టిన బట్టలు మాకురాణించవు. అటువంటివాటిని మేము కట్టుకోము. అలా చేస్తే మాకు శోభించదు. అందుచేత నాచీర యిచ్చేయి.

శర్మి — పొరపాటుచేతనన్నా, యిప్పు డీచీర నేకట్టేసుకున్నానుకదా. నే మళ్లీ విప్పియిస్తే పనికి వస్తుందా?

దేవ — అది నాచీర. నాచీర నాకు పనికి రాకపోవడమేమిటి? నాచీర యిస్తావా? యివ్వవా? మా బ్రాహ్మణుల సంగతి నీకు తెలియదుసుమా. వాళ్లకు కోపంవస్తే ముల్లోకాలూ మట్టిం చేయగలరు.

శర్మి — దేవయానీ! మీ బ్రాహ్మ లెంత గొప్పవాళ్లయినా, మారాజులేకదా వాళ్లను పోషిస్తున్నది. అంతదూరం ఎందుకూ? యిప్పుడు మీరు ధరిస్తున్న వస్త్రాలు, ఆభరణాలు మా నాన్నగా రిచ్చినవే కదా!

దేవ — నోటికి వచ్చినట్లు పేలుతున్నావు శర్మిష్ఠా! జాగ్రత్త.

శర్మి — మీరు బ్రాహ్మలుకదా, మీ కింతకోపం రావచ్చా? చినుకు లెక్కువయాయి. ఇప్పుడు చీర మార్చుకునేందుకు అవకాశం లేదు. తరవాత యిస్తాను. ఆచీరకట్టుకో. అనవసరంగా దుర్భాషలను రానీయకు నోటివెంట. తప్పు. పోదాం రా.

దేవ — అలా కాదు. నాచీర కట్టుకున్నప్పుడే నే నిక్కడినించి కదులుతాను.

శర్మి — (ఆలోచించి) సరే! లలితా! నే నింటికి పోయి చీరమార్చుకుని యీ చీరిక్కడికి పంపిస్తాను. అంతవరకు దేవయాని ఒక్కర్తె వున్నప్పుడు ఏమగాళ్లన్నా చూడటం తట

స్తే స్తే ప్రమాదం సంభవిస్తుంది. అందుచేత యీమెను నీళ్లు లేని ఆపాడునూతిలో దింపేసి రండి. ఆమె చీర వచ్చాక కట్టుకొని వస్తుంది. ఆమె కోరినట్లే చేయవచ్చు. వర్షం ఎక్కువైంది. నే పోతున్నాను.

(నిష్క్రమించును.)

[లలితా వాళ్లు దేవయానిని బలవంతంగా నూతిలో తోసేస్తారు.]

లలిత — నీచీర నే పంపుతుంది కట్టుకుందువుగా నిక్కడుండు.

వసంత — మీ బ్రాహ్మల కేదో ప్రభావ ముందన్నావు. ఈనూతిలోంచి పైకి రా చూద్దాము.

ఇందు — శర్మిష్ఠ దుర్మార్గురాలూ, ఈమె సన్మార్గురాలూనట. సోదరసమానుడయినకచుణ్ణి ప్రేమించింది ఏంనీతి!

(అంతా వెళ్లిపోతారు.)

దేవ — (తనలో) నా బ్రతు కెంత అధ్వాన్నమైపోయింది! ముల్లోకాలనూ గడగడ లాడించజాలిన శుక్రాచార్యునికూతురు కావడమేమిటి? నాకీ అగచా ట్లేమిటి? పరమపవిత్రమైన బ్రాహ్మణజన్మ ఎత్తికూడా హీనకులస్థులైన దాసీలచేత దెబ్బలు తినవలసి వచ్చింది. శర్మిష్ఠ ఎంతమాయలాడీ? చల్లగా తీయని మాటలచేతే నన్ను నూతిలో తోయించేసింది. ముందువెనక లాలోచించకుండా ఎంత సాహసానికి పెట్టుకున్నావు శర్మిష్ఠా! పులిమీసాల బట్టుకొని వూగులాడబోయావు! దీని పర్యవసాన మెంతదారుణంగా వుంటుందో వూహించావూ? నన్ను తృణీకరించడ మంత సులువైంది కాదుసుమా. నేను పూర్తిగా ప్రేమించిన ఆకచుడే దిక్కులేక నాక్రోధాగ్ని కింధనమైపోయాడు. నువ్వనగా ఎంత?...అబ్బా!... యీపాడునూతిలో నా కూపి రాడటంలేదు ఈ దుర్వాసన నే భరించలేను. తండ్రీ! నా యీదుర్వస్థ నీకు తెలియదుకదా! నాకిం కెవ్వరు దిక్కు?......తండ్రీ! (అని గట్టిగా ఏడుస్తుంటుంది.)

[కొంతసేపటికి ప్రవేశం యయాతిమహారాజు వేటదుస్తులతో గుర్రంమీద. అతని దుస్తులన్నీ తడిసి వుంటాయి. గుర్రం ఆయాసంతో నురుగులుగక్కుతూంటుంది.]

యయా — అబ్బా! యిప్పటికి వెలిసింది, యీపాడు వర్షం. దీనిమూలంగా నాపరివారంనుంచి వేరయిపోయాను. అగమ్యంగా, విచ్చలవిడిగా, వెర్రెత్తి, ఎంత ఆపబోయినా ఆగక పరుగెత్తింది గుర్రం. ఈ ప్రదేశ మెక్కడిదో? (అని గుర్రం దిగి నలుదిక్కులూ చూస్తుంటాడు. ఇంతలో దేవయాని ఆర్తధ్వని వింటాడు.) ఆఁ! ఏమి టది? ఎవళ్లదో ఆర్తనాదంలా నుందే! ఎక్కడినుంచో కదా!......అదే......ఏదో స్త్రీ కంఠలా నుంది. (నలుదిక్కులూ వెదుకుతూ దేవయాని వున్న నూతిని సమీపించి లోనికి తొంగిచూచి) ఇందులో ఎవరో స్త్రీమూర్తి వుంది. ఎవరమ్మాయీ! నువ్వు? ఇందులో ఎలా పడ్డావు? యీ పంచను పట్టుకొని పైకి రా.

[అని తన శల్లా విప్పి లోనికి వేస్తాడు. దేవయాని మీదకు వచ్చి యయాతికుడిచెయ్యి అందిస్తే ఎడంచేత్తో పట్టుకొని పైకి వస్తుంది. పైకి వచ్చి అతడివేపు సిగ్గుతో బెదురుతూ చూస్తుంది. శర్మిష్ఠ చీర అదోమాదిరిగా కట్టుకొని వుంటుంది.]

యయా — ఎవరు నువ్వు? నీపే రేమిటి? ఇందులో ఎలా పడ్డావు?

దేవ — మా తండ్రిగారు శుక్రాచార్యులు. మా ఆశ్రమంలో లేడిపిల్లను పట్టుకొనేందుకు పరుగెత్తి కాలు జారి పడ్డాను. నా పేరు దేవయాని. మీ పేరేమిటి?

యయా — నన్ను యయాతి అంటారు.

దేవ — యయాతిమహారాజుగారు మీరేనా?

యయా — అవును.

దేవ — మీరెలా ఒచ్చారిక్కడికి? మాఆశ్రమానికి రారూ ఒకసారి?

యయా— వేటకోసంవచ్చి దారితప్పి యిలావచ్చాను. ఆశ్రమానికి మరోసారి వస్తాను. ఇంక నువ్వు జాగ్రత్తగా యింటికి పో. నే వెళ్ళిపోతాను.

[అని గుర్ర మెక్కి వెళ్లిపోతాడు. దేవయాని అతనివేపుచూస్తూ ఆలోచిస్తూ వుండిపోతుంది.]

## మూడవదృశ్యం

[వృషపర్వమహారాజు పురబాహ్యప్రదేశం. వర్షంపడి వెలిసి నేల అంతా బురదగా వుంటుంది. చెట్ల ఆకులమీదనుంచి చిటపటా చినుకులు రాల్తూ వుంటాయి. ఆకాశంమీద మబ్బు విప్పారి పోతూ వుంటుంది. ఓ నున్ననిరాతిమీద దేవయానీ కూర్చుని ఆలోచిస్తూంటుంది. శర్మిష్ఠచీరను అదోలాగు కట్టుకుని వుంటుంది. తల విరియబోసుకుని వుంటుంది. జుట్టు, బట్ట, శరీరం తడిసి వుంటాయి. ఇంతలో శర్మిష్ఠ పంపిన దేవయానిచీర పట్టుకొనిశ్యామల వస్తుంది.]

శ్యామ — దేవయానీ! యిక్కడికెలా వచ్చావు? నీకోసం ఆపాడునూతి దగ్గరకు వెళ్లాను. అందులోనుంచి నిన్నెవరు పైకి తీశారు? నీఒళ్లు, బట్టలు తడిసిపోయాయి. ఇది పెట్టి తుడుచుకో. ఇదిగో నీచీర. ఇది కట్టుకొని యింటికిరా. అలా నూతిదగ్గరకు వెళ్లి, అక్కడినుంచి నిన్ను వెతుక్కుంటూ రావటంచేత ఆలస్యమయింది. అయితే దేవయానీ! ఇక్కడెం దుకూర్చున్నావు? వచ్చినదానివి తిన్నగా యింటికి వచ్చేయక.

దేవ —శ్యామలా! నువ్వు శర్మిష్ఠతో వెళ్లిపోయావు కాబట్టి తరవాత లలితా వాళ్లు నన్ను అనినమాటలు వినలేదు. అంత పరాభవం ఆయాక? తిరిగీ ఏమొహం పెట్టుకుని వూళ్లోకి వచ్చేది? శర్మిష్ఠ నన్నెంతమోసం చేసింది? నా చీర తను కట్టేసుగోవడమే కాకుండా, నేను మళ్లీ విప్పి యిచ్చేయమంటే నన్ను పాడు నూతిలో తోయించేస్తుందా? దాని ఆసరా చూసుకుని కూటికి చాకిరీ చేసే దానిచెలికత్తెలు నన్ను అనరానిమాటలు ఆడతారా? నేనంత చులకనగా కనిపించానా వాళ్ల కళ్లకూ?

శ్యామ — దేవయానీ, శర్మిష్ఠచేసిందాంట్లో నాకు తప్పేమీ కనపళ్లేదు. నువ్వు అలా వనంలో వస్త్రవిహీనంగా ఒంటరిగా ఏపురుషుడికంటన్నా పడ్డావంటే యింకేమయినా వుందా? ఎంతప్రమాదమన్నా జరిగిపోదూ? నువ్వు నా చీర యిస్తేగాని కదల నన్నావు. ఇంటిదగ్గర యిస్తాను రమ్మని బతిమాలింది శర్మిష్ఠ నిన్ను. నువ్వు వినకపోతే అలా చేయవలసి వచ్చింది. నీ చీర విప్పియిచ్చేద్దామా అంటె వర్షం ఎక్కువయిపోతోంది. మరెలాగు?

దేవ — ఆవనంలోకి అలావర్షం పడ్తూంటే ఏపురుషులు వస్తారు? అదోమిషగాని.

శ్యామ — రాకపోవచ్చు. కాని ఒకవేళ రావటమే తటస్థిస్తే? ఏదైనా ప్రమాదం జరిగిందంటే 'అదిగో శర్మిష్ఠ చీరయివ్వకపోడం చేతనే' అని లోకులు నిందించరూ ఆమెనూ? ఇదద దేవయానీ, యీచీర కట్టుగో. జరిగిందేదో జరిగిపోయింది. ఇంక దాని గురించి మరాట్టే తల పెట్టక యింటికి వచ్చేయి.

(దేవయాని చీరపుచ్చుకుని కట్టుగుంటుంది.)

శ్యామ — దా. యింకపోదాం.

దేవ — శ్యామలా! నువ్వు తిన్నగా మా తండ్రిగారి దగ్గర కెళ్లి జరిగినసంగతి చెప్పి నే నింక యీ వూళ్లో కాలుపెట్టదల్చుకో లేదని, ఆయన్ను ఒకసారి రమ్మని చెప్పు. వెళ్లు. మా బ్రాహ్మణులకున్న ప్రభావం చూడమను శర్మిష్ఠనూ, వసంతనూ వాళ్లందరినీ, ఇప్పుడు తెలియజేస్తాను.

శ్యామ —దేవయానీ! అనవసరంగా యీగందరగోళం అంతా ఎందుకూ? నే చెప్పినమాట విని యింటికి వచ్చేయి.

దేవ — నిన్ను నేను సలహా అడగలేదు. నువ్వు వెళ్ళి చెప్పినపని చెయ్యి.

శ్యామ — (బయలుదేరబోయి ఎదురుగా శుక్రాచార్యుడు రావడం చూసి) అదిగో! మీ తండ్రిగారిక్కడికే వస్తున్నారు, నిన్ను వెదుక్కుంటూ కాబోలు. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి నే పోతాను. (వెళ్ళిపోతుంది.)
(శుక్రాచార్యుడు ప్రవేశిస్తాడు ఆత్రంతో)

శుక్రా — అమ్మా, దేవయానీ, ఏం చేస్తున్నా విక్కడ? యీవాళ ప్రొద్దుటినుంచీ నాకగపడనే లేదు. నిన్ను చూడకుండా వుండలేను తల్లీ! దా ఇంటికి పోదాం.

దేవ—తండ్రీ! మీ రీ నిర్భాగ్యురాలిని మరచిపోండి. మీ ఒక్కరికే కాకుండా పూజ్యమైన బ్రాహ్మణ వంశాని కంతకూ అపకీర్తి తెచ్చాను. నే జీవించిన కొద్దీ నావంశానికీ, జాతికీ, అపకీర్తి వస్తోందేకాని లేశమాత్రమైనా కీర్తి రాలేదు. ఆనాడు ప్రణయభంగ మైనప్పుడే నే నంతరించవలసింది. ఆ అపకీర్తి చాలక ఒక హీనురాలి దాసీలచేత నిన్ను, నీజాతిని అగౌరవపరిచేందుకని యింకా జీవించివున్నాను. తండ్రీ! నా కడుపులోని దుర్భరావేదన నన్ను మాట్లాడనీయకుండా వుంది. ఇంక నే నీపాడు జీవితాన్ని గడపలేను. మీరు యింటికి వెళ్ళిపోండి. నే నీబాధ భరించలేను. నాబ్రతుకు నే నిక్కడనే సమాప్తి చేసుకుంటాను.

[అని రొమ్ముగొత్తి ఏడుస్తూ ఎక్కడికో వెళ్ళిపోవడానికి పూనుకుంటుంది. శుక్రాచార్యుడు చేయి పట్టుకుని ఆపుతాడు.]

శుక్రా — అమ్మా! సంగతి తెలియపర్చకుండా ను వ్విలాగు తెలివిలేక విలపిస్తే ఎలాగు? నీకు నాకు జరిగిన అగౌరవం ఏమిటి? మనజాతినీ, వంశాన్నీ, దూషించ సాహసించిన దుర్మార్గు లెవరు?

దేవ — తండ్రీ! యీవాళ శర్మిష్ఠ, లలిత, వసంతా యింకా చాలామంది నేను బట్టలు విప్పి ఒడ్డున పెట్టుకుని స్నానంచేస్తూవుంటే పెద్ద గాలివాన వచ్చి మాబట్టలన్నీ కలిసిపోయాయి. మేము గబగబ వచ్చి ఎవరిచీరలు వాళ్లు కట్టుకోడంలో శర్మిష్ఠ నాచీర కట్టేసుకుని, తిరిగి నే నిమ్మంటే యింటికి వెళ్ళి పంపిస్తాను అందాక ఏమగవాళ్లూ చూడకుండా వుండాలని నన్ను పాడునూతిలో తోయించి వెళ్ళిపోయింది. దాని చెలికత్తెలు మననూ, మనవంశాన్నీ, జాతినీ, యిష్టం వచ్చినట్టు దూషించారు. ఎంతయినా సరే, నే నా దుర్మార్గురాలి వూళ్లో మరి కాలుపెట్టను, మీ కిష్టమయితే, మీరు వెళ్ళి వాళ్లెంత అగౌరవపర్చినా వాళ్లదాస్యం చెయ్యండి. శర్మిష్ఠ వాళ్లకు అనువు యియ్యకుంటే వాళ్లు మనలను అనగలరా?

శుక్రా —అమ్మాయీ, నువ్వు చెప్పిందంతా బాగుంది. కాని మనం బ్రాహ్మలం. బ్రాహ్మణులకు దీర్ఘకోపం కూడదు. అహింస మనకు పుట్టపాలతో పెట్టింది. అసలు బ్రాహ్మణ జాతికి గౌరవము, దివ్యత్వము ప్రసాదించింది వాళ్ల ప్రశాంత జీవితమే. శాంతమే సర్వ శ్రేయాలకు మూలము. ఆగ్రహం అన్నివిధాలా చెరుపు. శర్మిష్ఠ చేసిందాంట్లో రవ్వంత తప్పుంటే వుండవచ్చును. కాని మనం ధార్మికంగా ఔదార్యంగా దాన్ని క్షమించాలి, సహించాలి. ఇంతకూ శర్మిష్ఠమాత్రం ఏమంత పెద్దతప్పు చేసింది? వర్షం పడుతుంటే తొందరగా వెళ్ళి పోవలసి వచ్చింది. చీరకోసం నీతో తగాయిదా పడుతూ వర్షంలో తడుస్తూ వుండటానికి శర్మిష్ఠ నీలాగు సామాన్య స్త్రీ అనుకున్నావా? మహా రాజకుమార్తె, అత్యంత సుకుమారి కాదూ? శర్మిష్ఠే వుంటే దాని చెలికత్తెలు నువ్వు చెప్పినట్లు అంతగా తుళ్లిపడతారా? వాళ్లుచేసిన నేరానికి రాజుతో చెప్పి శిక్షిద్దాము. ఒకళ్లు చేసిందానికి మరొకరిని బాధించకూడదు.

దేవ — తండ్రీ! నువ్వెంత చెప్పినా తిరిగి వచ్చేందుకు నా మనస్కరించటంలేదు. పరాభవం చేత దగ్ధమైపోతూ నా అంతరాత్మ ప్రతిహింస వాంఛిస్తోంది. అది బ్రాహ్మణలక్షణం కాకుంటే కాకపోవచ్చును. నేనుమాత్రం ప్రతీకారంచేసి తీర్తాను. అలా చేయలేకపోతే ఆ ప్రయత్నంలో నా ప్రాణాలను వదిలేస్తాను.

శుక్రా — బిడ్డా! వృథాయాసాలను పోకనే చెప్పిన మాట విను. వాళ్లు క్రూరభయంకర రాక్షసులు. వాళ్లమీద కక్షకట్టి మనం వర్ధిల్లడం దుర్లభం. వాళ్లు మనమీద గౌరవం వుంచినంత సేపే మన ఆటలు సాగుతాయి. కాని వాళ్లు తిరగబడితే మనం ఎదిరించలేము. ఎంత మంది సాత్త్వికులు లీదుష్టులచేతిలోపడి నశించలేదు? నువ్వు చిన్నపిల్లవు. నీకు ప్రపంచజ్ఞానములేదు. 'తాబట్టిన కుందేటికి మూడేకాళ్లన్నట్లు నీపట్టుదల నువ్వు విడిచిపెట్టకున్నావు. నామాట విని యింటికి రా. నన్ను బలవంతపెట్టకు.

దేవ — వాళ్లను ఎదిరించి నిలవలేకపోతే వాళ్లను బెదిరించి మరణించ గలం కదా! ఈ హీనమైన పిరికిజీవనం చేసేకన్న వేయిరెట్లు అదే నయం. తండ్రీ! ఏమయినా సరే. నే నూళ్లోకి రాతల్చుకోలేదు. నే నిదిగో వెళ్లిపోతున్నాను. నన్నాపవద్దు. (అని బయలుదేరును.)

శుక్రా — బిడ్డా! నువ్వే నాజీవనాధారము. ఈ జీవికిగల ఆశాజ్యోతి నీవుగాక మరేముంది? నువ్వు లేనినాడు నేనుమాత్రం యీనగరంలోకి వెళ్లి ఏం చేయాలి? నేనూ నీతోటే వచ్చేస్తాను. అదిగో మహారాజు, శర్మిష్ఠ వస్తున్నారు. ఈ సంగతి గురించి వాళ్లతో విపులంగా చర్చిద్దాము.

[సపరివారంగా వృషపర్వుడు, శర్మిష్ఠ ప్రవేశింతురు.]

వృష — గురువర్యా! నమస్కారము. నాబిడ్డ శర్మిష్ఠవల్ల తమ దేవయానికేదో అపచారం జరిగిందనీ, దాని ఫలితంగా ఆమె యీనగరం విడిచి వెళ్లిపోవ నిశ్చయించి మిమ్మలను రప్పించిందనీ విని మాశర్మిష్ఠ భయపడి నన్ను తీసుకుని తమ దర్శనానికి వచ్చింది

శుక్రా — రాజా! నీవాళ్లు మత్తెక్కి నన్నూ, నా బిడ్డనూ, నావంశాన్నీ, జాతినీ, తూలనాడారు. ఇది క్షమించరానిదోషం. దీనికి మా దేవయాని మంచి ప్రతీకారం నిశ్చయించింది. అది సమంజసంగా వుంది. నా ఆశయం కూడా అదే. ఇన్ని సంవత్సరాలనుంచీ మీా రెన్ని దుష్కార్యాలు చేసినా మేముసహించి వూరకున్నందుకు చివరకు మంచి అవమానం జరిగింది. కొందరు కూటికి గుడ్డకూ కరువై సేవకవృత్తిలో నున్నవాళ్లు ముల్లోకాల్లోనుకూడ పూజనీయమైన మావంశాన్నీ, జాతినీ నిందించారు.

వృష — మహాప్రభూ! క్షమించి నే విన్నవించుకునేది కొంచెం సావధానంగా వినమని ప్రార్థిస్తున్నాను. ఈ విషయంలో శర్మిష్ఠ కేవలం నిర్దోషి. తప్పుచేసిన ఆ చెలికత్తెలు పదిమందీ తగినశిక్ష అనుభవిస్తున్నారు అప్పుడే. మంచికోసం పోయి చెడ్డ తెచ్చుకున్నది నాబిడ్డ. ఏప్రమాదం రాకుండా చేసే ప్రయత్నంలో భయంకరమైన ప్రమాదం తెచ్చుకుంది. ఇది కేవలం దాని ప్రారబ్ధం. దాని చెలికత్తెలు పదిమందీ చేసిన నేరానికి నిర్దోషులైన మమ్మలనూ, ప్రజలనూ, దేశాన్నీ మీారు విడిచిపెట్టితే, మారాక్షసవంశం, రాక్షసరాజ్యం ఏంకావాలి? మాయందు కటాక్షించి తమరు నిలబెట్టిన మావంశాన్ని, రాజ్యాన్ని తమరే రక్షించండి. తమరు నెలకొల్పిన రాక్షసరాజ్యాన్ని, తమ చేతులతోనే నశింపజేయకండి. తమ రేమి చేయమన్నా చేయడానికి సిద్ధంగా వున్నాను. మావల్లవచ్చిన అపచారానికి మీాకు తోచినశిక్ష విధించండి. ఎంతదారుణమైనదైనా సరే సంతోషపూర్వకంగా అనుభవిస్తాను. అంతేకాని తమరు మము

లనూ, మా ప్రజలనూ దేవతలబారి కప్పచెప్పి వెళ్లి పోకండి. మాయందు కరుణించండి (అని మొరకరిస్తాడు.)

శుక్రా — రాజా! శే. ఈ జరిగిన అవమానం దేవయానికే కాబట్టి ఆమెకోరిక ఎలా వుంటే అలా చెయ్యాలి. ఇప్పుడు దేశాన్ని విడిచి వెళ్లదల్చుకున్నది ఆమె, ఆమెకోసం నేను. కాబట్టి నువ్వు ఆమెని శాంతింపజేసుకో.

వృష — అమ్మా! దేవయానీ! నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను. మామీద ఎంతదారుణ శిక్ష విధించినా అనుభవిస్తాను. కాని మీరు మాత్రం మమ్మలను విడిచిపెట్టకండి.

దేవ — అలాయితే, రాజా! నే చెప్పినట్లు చేస్తావా? అది చాలా కష్టమైనపని. దానికి మీ శర్మిష్ఠ ఒప్పుకోదేమో?

వృష — నీ కొసం దేహం ఎంతమాత్రం వద్దు. నా వాళ్లంతా నా ఆజ్ఞలకు బద్ధులు.

దేవ — అలాగయితే, మీశర్మిష్ఠ, దాని వెయ్యమంది చెలికత్తెలు నాదాసీలు కావాలి.

వృష — అబ్బ! ఎంతకఠినశిక్ష విధించావు దేవయానీ! నాబిడ్డ నిర్దోషికదా! ఆమె ఒక్కతెనుమాత్రం తప్పించు.

దేవ — ఎంతమాత్రం వల్లకాదు.

శర్మిష్ఠ — నాన్నగారూ! యీవిషయంలో నావల్ల పొరపాటు లేదన్నసంగతి నాకు తెలుసు. ఈ దేవయానికి తెలుసు. అందరికీమించి పూజ్యులైన గురువుగారికి తెలుసును. అయినా నా కర్మవశంచేత నా కీశిక్ష విధించబడ్డది. ధర్మరీత్యా నే నీశిక్షకెంతమాత్రం బాధ్యురాలిని కాను. కాని దానిని నే నంగీకరించకుంటే నావంశమేకాదు రాక్షసజాతి అంతా నశిస్తుంది పేరైనా లేకుండా. అందుచేత దేశక్షేమంకోసం, మన ప్రజారక్షణకోసం, నాస్వసౌఖ్యాన్ని ధారపోసి నే నీ శిక్ష అనుభవిస్తాను. నా ప్రజలనూ, జాతినీ, వంశాన్నీ కాపాడుతాను. దేవయాని పాదు చేయదల్చుకున్న రాక్షస వంశం నేను సంరక్షిస్తాను.

వృష — బిడ్డా! నా ఏకైకపుత్రివైన నువ్వు యీ విధంగా శాశ్వతదాసీవై వివాహాది సౌఖ్యాలను విసర్జించి, నిర్వంశంగా నశింపవలసిందే! సహస్ర సంఖ్యాపరిచారికలచేత దాస్యం చేయించు కున్న నువ్వే నేడు దాసీవి కావలసివచ్చిందా? ఆపాడుదాస్యం నువ్వెలా చేయగలుగుతావు? నీ కేమి తెలుసును?

శర్మిష్ఠ — తండ్రీ! అది నానుదుటివ్రాత. దాని నెవ్వరు తప్పించగలరు? ధర్మానికే ఎప్పటికన్నా జయమంటూ వస్తే నాకష్టాలు గట్టెక్కుతాయి. అంతవరకు కర్మఫల మనుభవించక తప్పదు. ఇంక నువ్వు విచారించక యీదీనురాలిని మరిచిపో.

వృష — బిడ్డా! నిన్ను మరిచిపోవడ మెట్లా సాధ్యమవుతుంది? నేనేకాదు కదా, తరతరాల మన వాళ్లుకూడా నువ్వుచేసిన నిరుపమానమయిన యీ త్యాగాన్ని మరిచిపోలేరు. మహారాజ పుత్రివై యుండికూడా సామాన్యప్రజాక్షేమం కోసం నీస్వసౌఖ్యాలను పూర్తిగా విసర్జించి కేవలం దాసీ వైనావు. ఇంతటిత్యాగం చేసిన నీకీర్తి ఆచంద్రతారార్కం వెలుగుగాక!

శుక్రా — తథాస్తు! రాజా! తథాస్తు!
[అందరూ నిష్క్రమింతురు.]

---

# ధర్మదీక్ష

శ్రీ చ. జమదగ్నిశర్మ

అవి మహారాజు లాదిగా నఖిలజనులు
గౌరవింపంగ, పోషించువారుఁ గలుగ
ధర్మగోమూర్తి నాల్గుపాదములు మోపి
రాజమార్గాన విహరించురోజు లహహ!

కాలిక్రిందఁ బడ్డ గడ్డిపోచకు నైన
ధారుణీశు లడిగి ధర్మ మీయ
దినదినాభివృద్ధిఁ గను ధర్మధేనువు
కుంటువడుట కేమి కొఱఁత కలుగు?

నృపకులభూషణుండు మనునీతిమహాత్ముఁడు ధర్మమూర్తి యై
యపకృతి యెట్టివారలకు నైన ఘటిల్లిన దిద్ది తీర్చి నే
రుపున పరిష్కరింతు ననురూపముగా నని చాటఁ బంచి, మం
డపమున ఘంటఁ గట్టి తను డాయగ నెంచెడివారు మ్రోయగన్.

అతఁడు ధర్మసింహాసనం బధివసించి
పంచదశవత్సరములు పాలించెఁ గాని
మ్రోయలే దొక్కనాఁడైన న్యాయఘంట
సూర్యుఁ డుండంగ చీకటుల్ చొరగవశమె?

* * *

వేసవిగాడ్పుకంటె నతివేగముగాఁ బఱువెట్టునేర్పు ని
ర్వ్యాసితనీలిమాంబరచరచ్ఛరదబ్దసమానకాంతి, య
భ్యాసవశైకవర్ధితమహాబల, మన్నియుఁ గూడి యొక్క ప్రో
వై సరివచ్చువారువము లారథ మీడ్చుచునుండె వీథిలోన్.

అది భూభృన్మనునీతిచోళసుతువాహ్యాళ్యర్థమై యుంటచే
నదలింపం బని లేకయే తొలఁగఁగా నావంక కీవంక కే

ఘుడు రచ్చోటిజనుల్ తమంతటన, యేక్రోశంబుదాకో చతు
ష్పదము ల్గాదు జడంబులైన సరి యేప్రాంతస్థము ల్గావు పో!

ఆ సమయంబునం దచట, నప్పుడె యీనినయా వొకండు, సం
త్రాసపరీతచిత్త యయి, రాజపథంబును వీడి ప్రక్కగా
నోసరిలంగ నెంచియు, నిజోద్భవుఁ డగ్గులువెట్టలేక యా
యానముతో నిలంబడుట, నాతని దేహము నాకుచుండగన్.

అహినోటఁ బడఁబోవునట్టి తెక్కలురాని పిల్లకై వెతనొందుపిట్టవోలె
ప్రభురథం బది వచ్చి పైఁబడు ననుభీతి వెనుకకుఁ జూచుచు విడువలేక
తను వెల్ల త్రాసమై తనముద్దుబిడ్డని మావి వోవగ పలుమాఱు నాకి
అంబయంబా యని యాక్రోశ మొనరించి రథవీక్షణమున నిర్మగ్నులైన

జనులఁ దనవంకఁ ద్రిప్పనో నని తలంచి
యఱచి, యలసటపడి, చేయునదియు లేక
ఆత్మసంత్రాససంరక్షణార్థ మావు
దారి కడ్డుగ నిలఁబడె తప్పగునొకో ?

రయమున వచ్చుస్యందనము రాకకు డెందము తల్లడిల్ల భీ
మయమగు కోడెదూడ యనుమానముచే నొకగంతు వేయగా
భయమున నావు దానిదరి ప్రాలి ప్రవన్నిబిడాశ్రువారి ని
ర్దయులగు ప్రేక్షకాళిని విదారితమానసులం బొనర్పగన్.

బలిఁ గొన నెంచువోఁ తనదు ప్రాణము వోయెడిఁగాక బిడ్డ ని
శ్చలముగ నుండెఁ జూతునను స్థైర్యముతోఁ దనమేను గోడగా
నిలిపి ప్రియాత్మజాతునకు నెమ్మది నుంపుట కొక్క బాష్పవా
రుల పరిఖన్ బలం బయి నిరూపితదుర్గము గట్టినంతటన్.

అనుకొనినంత సేపయిన నయ్యెనొ లేదొ, వియజ్జ్వలద్ద్యుతిన్
గసలిన శాంకరీవిభువికారము నొందినయట్లు శీఘ్రలం
ఘనమున దూడపైనిఁ బడె ధర్మవిభుస్యందన, మొప్ప డేగనో
తనసుతుఁ డడ్డు తప్పకొని తత్ఫలజన్మనివోలె నక్కటా !

స్యందనఘట్టితాంగుఁ డయి శాశ్వతదుఃఖము తల్లి కిచ్చిపో
యెం దనమేనిరక్తములు నేఱులుగాఁ బ్రవహింప; చూపరుల్

పొందిన దైన్యభావములు పోటులుగా నలరాజపుత్రుఁ డా
పెం దనవారువంబులను, వెంటనె యేగెను పాదచారియై!

గడగడలాడి సేవకులు కార్యము దోఁచక రాజపుత్రువెం
బడిఁబడి పోయి రెచ్చటికొ, బాటను వీడి జనంబు లెల్లరున్
వెడలిరి స్వస్థలంబులకు, వీడని దుఃఖముతోడ గోవునున్
దడఁబడి బిట్టుగా నలిచి, తత్సుతుఁ గాంచుచు నేడ్చె దీనతన్.

* * *

ఇన్నినాళులు నూరకే యున్నయట్టి
ధర్మఘంటిక గణగణధ్వానములను
మ్రోసె నొకమాఱు మంత్రి పురోహితాది
బృందపరివేష్టితుం డగు విభుఁడు నడల.

ఏ మిది ధర్మదోష మిది యెట్లు ఘటిల్లెను దీని కారణం
బే మని లేచె నీతివిభుఁ డెంతయు దైన్యము దోఁప, ధర్మ దీ
ప్తామతి సుస్థిరుం డగుట సత్వర మేగెను ధర్మఘంటికా
భూమిని జేరఁ, జేరి యట భూపతి గాంచెను గోవు నొక్కటిన్.

గోవఁట! ధర్మఘంటనఁట! కొమ్ములతో వడిఁ గొట్టునంట! తా
నేవిధి దీనిభావము గ్రహింపఁగఁజాలును? చాలకున్నచో
భూవిభుఁ డీతఁ డేమగును? పొచ్చెము లెట్టివి వచ్చెనోకదా!
దైవమ; దారిఁ జూపు మని ధర్మముకై విభుఁ డెంచుచున్నడన్.

గోవును మ్రోయుటాపి కనుగోనలలో జల మూరుచుండ నే
దో విపరీతభావ మటులో తెలియందగునట్లు చెప్పి తా
నేవల దారిఁ దీసె, విభుఁ డేమియుఁ దోఁచక దానివెంబడిన్
బోవుట కుద్యమించె, నటు వోయిరి వెంబడి మంత్రిముఖ్యులున్.

మంత్రముగ్ధునివోలె నమ్మనుజవిభుండు
గోవు వోయెడిమార్గానఁ బోవుచుండె
నేది యెట్లున్నదో యెవ్వ రెఱుఁగలేక
మనుజవిభువెంటఁ బోయిరి మంత్రిముఖులు.

ఒకపరి గోవు తా మరలి, యున్నదిశల్ పరికించి, వెంట పే
డక చనుదెంచుభూవిభుని డగ్గఱి, క్రమ్మఱ ముందు కేగి, పో
వక నిలుచుండి, భూవిభుడు వచ్చినయంతట సాగిపోయి, ప్రే
క్షకులకు విస్మయం బొదవఁ గంపిలుగాత్రముతోడ నేగుచున్.

తనసుతుఁ డింతమున్ను రథతాడనఘాటికిఁ జచ్చినట్టి చో
టున కటు లేగి డెందము గదున్వడిఁ గొట్టుకొనంగ నిల్చె, మో
మున నతిదైన్య మొప్ప విభుమోమును జూచుచు శోకమూర్తి యో
యని జను లెల్ల రార్తియుతులై కనులం దడి పెట్టుచుండగన్.

దేహము ముక్కలై చెదరి దిక్కులకుం బడి, రక్తధార లా
రోహములై, ఘనంబు లయి, త్రొక్కిన చక్రపథంబుఁ బట్టి యా
జ్యాహుతిఁ బ్రజ్వరిల్లెడి హుతాశనవైఖరిఁ దోఁపఁజేయ భీ
త్యాహతవీక్షితం బయిన యాపశువత్సముఁ గాంచె భూపుఁడున్.

"ఎవ్వరు మూల మింతకు నిదేల యిటుల్ పదిమంది యుండుచో
నివ్విధి నింత వేగమున నేగినవారలు, కన్ను లున్నవే?
నవ్వడి మాని వత్సమును జంపి యెటో చనినారు, వీడుచో,
నెవ్విధి ధర్మ ముండు నిఁక, నేగుఁడు శిక్ష విధింపగావలెన్."

అని భూనాయకుఁ డాత్మసేవకులతో నాడంగ నవ్వారు భీ
తిని యోచించుచు ముందువెన్కలకు సందేహించుచుండన్ వడిన్
జనె నారాజకుమారుఁ డచ్చటకు, నాశ్చర్యంబుగా నెల్లరున్
వినుచుండ న్వచియించె స్వీయకథ, నావేశంబుతో భూపుఁడున్.

"నారాజ్యంబున ధర్మభంగ మిటు లేనాఁడేని రానేర్చెనే?
నేరం బన్నది రూఢి యానెడల నేనేకాదు సాక్షాన్మహా
స్వారాజ్యేశులుగూడ పొందఁదగుశిక్షన్ బొందియేతీరనా
మీరల్వింటిరికాదె నాసుతుని యామ్లేచ్ఛప్రకారంబులన్.

ఆయుర్దాయము మూడి వీఁ డిటుల నన్యాయంబు గావించి మీ
జే యోచింపక దీనికిం దగిన నిర్ణేయంబు గావించి మీ
రే యాజ్ఞాపన మాచరింపుఁ" డన వారి న్వీరు వీక్షించి తా
నేయంశంబును దెల్పి చెప్పక ప్రజల్ మిన్నుం బరీక్షింపగన్.

"భయముం బొందెద రేల ప్రాణములకున్ భంగంబు గల్పించు దో
షయుతుం డయ్యె నితండు గాన నితఁడే స్వప్రాణము ల్వీడగా
నయ మౌ" నంచు ధరాధినాయకుఁడు నాజ్ఞాపించె ము న్నాతఁడె
క్కి యతండే నడిపించినట్టిరథ మాక్షేత్రంబునన్ బెట్టగన్.

మనమునఁ జింత వీడి, యనుమానముఁ దాల్చక, దేవ దేవచిం
తన మొనరించుచున్, దనయధర్మపువర్తన కేడ్చియేడ్చి భీ
తిని విడనాడి, రాసుతుఁడు తేజము మోమునఁ దోఁప, రాజవీ
థినిఁ బడియుండె ధర్మమను దేవతకుం బ్రణమిల్లుకైవడిన్.

మనుభూమీశుఁడు ధర్మపాలన యశోమార్గాంతరోద్రిక్తుఁ డై
తనుఁ దానై రథ మెక్కి వారువము లంత న్దోలె, నప్పోటు చే
సిన పాపం బది యెట్టిదో తిరుగ నాక్షేత్రంబునం రక్తముల్
సొనలై పాఱె జనాళిబాష్పజలరాసు ల్గూడి వేగంబునన్.

అంబుదముల్ వియత్తలమునందున నుండి తదీయరక్తపా
తంబులుపోవ ధారుణి యథాస్థితిగా నొనరించుకోర్కెతో
గ్రొంబలగంబులై కురిసె; గూడుల కేగెడి పక్షికోటిరా
వంబులు మాఱుమ్రోగె నరపాలునిధర్మము నెత్తిపాడుచున్.






# త్రివేణుమండల చక్రములు

శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య

త్రివేణు వనగ మూడు వెదురుబొంగులు గలది అని అవయవార్థము స్ఫురించుచున్నది. ఈ శబ్దము రామాయణమున రెండుచోట్లను, మహాభారతమున రెండుచోట్లను గోచరమగుచున్నది. ఈ నాలుగుచోట్ల యందును నిది రథప్రస్తావములం దున్నది. స్థూలముగ నిది బండిపర్యాయము గావచ్చును. వాల్మీకిరామాయణమున అరణ్యకాండలో

౧. త్రిభిస్త్రివేణుం బలవాన్ ద్వాభ్యామక్షమ్మహాబలః
ద్వాదశేనతు బాణేన ఖరస్య సశరం ధనుః
ఛిత్వా వజ్రనికాశేన రాఘవః ప్రహసన్నివ...
—స. ౨౭; శ్లో. ౩౦

౨. వరం త్రివేణుసంపన్నం కామగం పావకార్చిషం
మణిహేమవిచిత్రాంగం బభంజ చ మహారథం.
—స. ౫౧-౧౪.

మొదటి శ్లోకములోని త్రివేణుశబ్దమునకు "త్రివేణు ర్నామ రథముఖస్థో యుగాధారదండః" యని యొక వ్యాఖ్యానమును "రథముఖస్థావయవవిశేష:" యని ఇంకొక వ్యాఖ్యానమును తెలుపుచున్నవి. రెండవ త్రివేణువునకు "యుగంధరః" అను పర్యాయపద మున్నది.

ఈరెండు ఉల్లేఖములకును సరిపోవు నాంధ్రీకరణముల నన్వేషింపగ బ్రహ్మశ్రీ గోపీనాథ వేంకట కవీంద్ర విరచిత రామాయణమున "మూడంబకంబులఁ గూబరంబును రెండమ్ముల నొగలను" ఇత్యాది, మొదటి ప్రయోగమునకును "త్రివేణు సంపన్నంబును పావక సన్నికాశంబును"— ఇత్యాది రెండవ ప్రయోగమునకును అగపడినవి.

మఱియు నాంధ్రవాల్మీకి వాసుదాసుగారి రామాయణమునందలి యాంధ్రీకరణంబు లిట్లున్నవి.

మొదటిశ్లోకము —

"విఱుసన మూఁటిచే నొగయు
వేగమ యక్షము రెంట"[3]

రెండవశ్లోకము —

కామగంబు త్రివేణు కలితంబు పావకా
ర్చిమ్మహా రథము ధరిత్రి గూల్చి"[4]

మఱియు బ్రహ్మశ్రీ కావ్యతీర్థ జనమంచి తాండవకృష్ణా పరాభిధేయ శేషాద్రిశర్మ కవిశ్రేష్ఠులు విరచితమగు ఆంధ్ర శ్రీమద్రామాయణమున మొదటి యుల్లేఖాంధ్రపరివర్తన మిటు లున్నది.

"సాయకత్రయమున స్యందనవేణువు నష్టకమ్మిని రెంట"[5]

రెండవ దిటు లున్నది:—

"అరుదను నొగతో వెలయుచు
వరమై కామగతి నొప్పి వహ్ని సమరుచిం
బరఁగి మణిహేమచక్రో
త్కరమయి తగు తన్మహారథంబును ద్రుంచెన్." [6]

---

౧. అరణ్యకాండ. పుట ౬౭. రాముడు ఖరుని విరథునిజేయు ఘట్టము.

౨. అరణ్యకాండ. పుట ౧౨౪ జటాయువుచేత రావణుఁడు విరథుఁ డగుట.

ఈ గోపీనాథరామాయణము వెంకటగిరి లోన యందు శ్రీరాజా ముద్దుకృష్ణ యాచేంద్ర బహదర్ వారి యాజ్ఞచే ముద్రితమైనది.

౩. అరణ్యకాండలో ౪౩౫ వచనము.
౪. ,, ౭౫౪ సీసపద్యము.
౫. ,, ౪౩౦ సీసపద్యము.
౬. ,, ౧౩౪౩ కందము.

పైని ఉదాహరింపబడిన మూడు తెలుగు సంపూర్ణరామాయణములును మనకాలమున రచింపబడినవి. బ్ర. శేషాద్రిశర్మగారి రచనయందు గొప్పవిశేష మేమనగ సర్గకు సర్గగా తెలిగించి మూలములోని శ్లోక సంఖ్యలుగూడ కనుపరచినారు ఇది చాల గొప్పపని.

పై మూడు రామాయణములును ఆధునికములు. ప్రాచీనగ్రంథములగు రంగనాథరామాయణమును, భాస్కరరామాయణమును చూడగ మొదటిదానియందు త్రివేణువుగాని దీనిపర్యాయములుగాని లేవు. భాస్కరమున మొదటియుల్లేఖఘట్టమున నీపద్య మున్నది.

"ఒగి విల్లు మూపులయుం
దెగిపడ నొకటొకట హరులు ద్రెళ్ల నిరుగడన్
మొగి రెంట మూఁట నిరుసులు
నొగలు విఱుగ నొకట వాని నొప్పించుటయున్."

బహుశః భాస్కరుడు త్రివేణువును నొగలని తీర్మానించి యుండును.
మహాభారతకర్ణపర్వము. అ. ౧౬-౧౨ లో "ఛిన్నత్రివేణు చక్రాక్షః"* అనియు, అ. ౧౯-౧౦ లో "ఛిన్నత్రివేణు సంఘాతాః హతాశ్వపార్ష్ణి సారథీః"† అనియు నున్నవి. వీనికి వ్యాఖ్య లభింపలేదు. వీనికి సరిపోవు వాక్యములకొరకు సోమయాజి రచనయందు వెదుకగ సేనాంగ చతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె" ఇత్యాది విధమున కమ్మీదల మాట లగుపడుచున్నవి. ఇక మనకాలమున దిగంతవ్యాప్తకీర్తిప్రతిష్ఠలతో వర్ధిల్లుచుండు మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీకృష్ణభారతము ఈ రెండుచోట్ల నిట్లున్నది.

మొదటిది "యుగాక్షాదులతోడ రథంబులు విశీర్ణంబులు గావించియు౧" రెండవదానికి "రథంబులు చెక్కులు గావించియు"౨ అనియున్నవి.

ఈ "త్రివేణు" శబ్దమువలన వ్యాస వాల్మీకాదుల కాలమున శకట నిర్మాణ మెట్లుండినదియు గోచరింపగలదు. త్రివేణుశబ్దముచే నాహ్యమానమగు బండి యెటులుండు ననిన దానినిటు లూహింపనగును:—మొదట ఇరుసుండును. ఇరుసుపైన కొయ్య అడ్డ (అడ్డముగ వేయబడు కొయ్యయుండును). ఈ అడ్డపైన పొడుగుపాటి రెండు కొయ్యలనుగాని వెదురుబొంగులు గాని ఒక తట్టున యేకాగ్రములుగ నుండునట్లు ఏటవాలుగ నమర్చి ఆటుతర్వాత, యడ్డనుండి పైనిచెప్పిన రెండు కొయ్యలుకూడు నగ్రమున చేరునటుల ఇంకొక కొయ్యనుగాని వెదురునుగాని యమర్చి ఈ మూడును కలియుచోట కాడి కట్టబడును. ఇట్లేర్పడిన పంజరాకృతి ఇటు లుండును:—




ఇట్టి యాకృతి నెరిగినవారై ప్రాచీనజ్యోతిషికులు రోహిణీనక్షత్రమునకు శకటాకారమును నిఘంటు చేసిరికాబోలును. ఇట్టి యాకారనిర్మాణములుగల రెండెడ్లులబండ్లు ఇప్పటికిని నెల్లూరు కడపమండలములందు వాడుకలో నున్నవి. అడ్డనడుమనుండి వచ్చు నొగకు బదులు కొంత రొక లావుత్రాటిని బిగింతురు. మొత్తమునకు ఆకారము పైన చూపిన ప్రకారమే యుండును.

కొన్ని రెండెడ్లులబండ్లకు బండి ఆయ మెంత పొడవుండునో అంతకు సరిపోవు నొక పెద్ద నొగ అడ్డమీద అమర్చబడియుండును. ఈ నొగమీద దీర్ఘాయతచతురస్రమగు (Oblong) నొక పెద్ద చట్టను బిగింపబడియుండును. ప్రాయికముగ యిప్పటి రెండెడ్ల బండిట్టిదిగ నున్నది. వీనియాకృతి యిట్లుండును. ఈ చట్టమును పరము అందురు.

---

* † ఇవి కలకత్తాప్రతిలోనుండి యుదాహరింపబడినవి.
౧. శ్రీకృష్ణభారతము. క. ఆ. ౧. వ. ౧౨౪.
౨. " " " ఆ. ౧. వ. ౧౭౫.




క. గ—అడ్డ.
చ. జ—నొగ.
ట. డ—కాడి.
త. ద. ప. బ—నొగమీద నుండు పరము.

నాగరకత పెంపగుకాలది ప్రాతకాలపుత్రి వేణువు పరముగల బండిగ మారియుండును.

ఎన్నియోరకముల గట్టికొయ్యలు సృష్టిలో నుండగ ప్రాతకాలపువారు వెదురు నేల శ్రేష్ఠమయిన దానిగ మెచ్చిరనువాశంక కలుగవచ్చును. వేణువునకు వైదికప్రాశస్త్యపవిత్రతలు గలవు. యజ్ఞయాగాదులందు వేయబడు ప్రధానశాలకు ప్రాగ్వంశ మని పేరు. దీనిని ప్రాచీనవంశ మనియు చెప్పుదురు. వంశ మనగ వెదురే యగును. ఉదాహరణమునకు మూడంగుళముల మందముగల (నడికొలత= Diameter) ఒక వెదురుబొంగును అదే మందముగల ఇతర గట్టికొయ్యను (పర) బరువును మోయువిషయమున సరిపోల్చి పరీక్షించి చూచినయెడల వెదు రేపాటియు వెనుదీయదు. బహుశః గట్టికొయ్య బరువునకు వంగిన వంగును. నడుమ బోలగుటచేత వెదురు వంగదు. అంతియగాక అగట్టి కొయ్యకంటే తేలికగ నుండును. ఇది యొక అధికగుణము. ఇట్టి గుణముల కనిపట్టి ప్రాచీనులు వేణువును గ్రహించి యుందురు. ఇత్యాది గుణదోషవిచార మెట్లు పరిణమింప నున్నను కేవల నాగరకదృష్టితో విచారించినయెడల త్రివేణుశబ్దమున ప్రాచీన నాగరకతాభిజ్ఞానము నిలిచి యున్నదని యేర్పడ గలదు. ఈ శబ్ద మమరమున లేదు. భారత రామాయణములు దప్ప ఇతర కావ్యములందు మృగ్యముగ నున్నది. దీని స్వరూప నిర్ణయ విషయమునను పైని ఉదాహరింపబడిన ఆంధ్ర మహాకవు లేకగ్రీవముగ భావమును జూపలేదు. బహుశః త్రివేణ్యాకృతి గల బండ్లు క్రొత్త క్రొత్త మాదిరులుగ జేయబడుచుండుటచే ఆపేరుకూడ వాడుక తప్పినది కాబోలు. ఇత్యాది యూహాపోహ లెట్లున్నను త్రివేణుశబ్దమున ప్రాచీన భారత నాగరికతాభిజ్ఞానము కొంత నిలిచి యున్నదని గ్రహింపనగును.

ఈ త్రివేణువిచారమునకు సాజాత్యమై రథావయవ సంబంధముగల "రథాన్ మండలచక్రాన్" అను నొక ప్రయోగము శ్రీమద్రామాయణమున గలదు. అయోధ్యాకాండ సర్గ ౭౦- శ్లో. ౨౨ లో వాల్మీకి "మండల చక్రాన్" అను నొక సమాసమును ప్రయోగించి యున్నాడు. భరతుడు గిరివ్రజమునుండి తిరుగ అయోధ్యకు వచ్చునపుడు అతనివెంట నడచిన వస్తువాహనాదులలో

'రథాన్ మండలచక్రాంశ్చయోజయిత్వాపరశ్శతం
ఉష్ట్రగోఽశ్వఖరైర్భృత్యా భరతం యాంత మన్వయుః.'

అని యున్నది. "మండల చక్రాన్" అను దానికి గోవిందరాజ వ్యాఖ్యలో "వర్తుల చక్రయుక్తాన్" అని యున్నది. తీర్థీయమున "మండలాని - మండలాకారాణి మండలాకారతయా యోజితాని చక్రాణి యేషాం తాన్ రథాన్ " అని వ్యాఖ్యానింపబడినది

చక్రము రథాంగ మనుట ప్రసిద్ధముగదా! "మండల చక్రాన్ " అనుటయం దేమయిన విశేషము కలదా? మండల మనగ వర్తుల మనియు (గుండ్రము), సమూహ మనియు నిఘంటువులలో అర్థములు గలవు. ఇంకను కొన్ని యర్థములున్నవి గాని అవి అప్రస్తుతములుగ నుండును. 'మండలచక్రాన్' అనగా గుండ్రని చక్రములు గల రథములు అని అర్థము చేసిన యెడల కోణాకారములు గల చక్రము లెందైన నెప్పుడైన నుండినవా అట్టివానిపై బండి నడచునాయను నాక్షేపము రాగలదు. చక్రములే లేక పరముమాత్ర ముండి అట్టిదానినే వాహనముగ నొకకాలమున జనులు వాడుకొనుచుండి కాలక్రమమున నొక బుద్ధిమంతుడు గుండ్రని చక్రముల కనిపెట్టి యుండి అట్టి చక్రములు గల బండ్లు అప్పుడప్పుడే వాడుకలోకి వచ్చుచుండినందున గుండ్రని చక్రములుగలబండ్లు అని

అవధారణము చేసి "రథాన్ మండలచక్రాన్" అని చెప్పవలసియుండునా? అట్లగునెడల బహుశః వాల్మీకి కాలమునకు చక్రములులేని బండ్లుకూడ యుండినవని కాబోలును. హిమవత్ప్రాంతములలో మంచుగడ్డలు పేరుకొని ఘనీభవించి యుండు స్థలములలో చక్రములు గల బండ్లకంటె చక్రములులేని, కట్టెచట్టములు గల బండ్లను లాగుట సులభముగ నుండును. ఇప్పటికిని రష్యాదేశపు ఉత్తర భాగములందు ధ్రువమండల సమీప ప్రాంతములందు చక్రములు లేక చట్టములుమాత్రము గల బండ్లు వాడుకలో నున్నట్లు భూగోళ గ్రంథములలో చూడబడుచున్నది. ఇట్టివాహనములను ఇంగిలీషున (Sledges) స్లెడ్జెస్ అని అందురు. బహుశః కడు ప్రాచీనకాలమున మనదేశమునను హిమవత్ప్రాంతములలో స్లెడ్జెస్‌వంటి చక్రహీనములగు బండ్లుండుటచేత గుండ్రని చక్రములు గల బండ్లు (రథాన్ మండల చక్రాన్) అనుట కారణమై యుండునా?

ఈ యూహ యొప్పదగనియెడల "మండల చక్రాన్" అనగ చక్రసమూహముగల బండ్లు అని యుండవచ్చును. సాధారణస్థితిలో ప్రతి బండికిని రెండుచక్రము లుండును. కొన్ని కొన్ని బండ్లకు మూడుచక్రములు, నాలుగుచక్రములు అనుభవములో చూడబడుచున్నవి. ఆరుచక్రములు గల వాహనములును గలవు. సాధారణముగ దేవాలయములలోని పెద్ద పెద్ద తేరులకు ఆరుచక్రము లుండును. నాలుగుమూలలందు నాలుగుచక్రములును, ఈ నాల్గింటికి నడిమయమున— అనగా తేరుపీఠమునకు సరిగ క్రింది భాగమున పైనచెప్పిన నాలుగుచక్రముల మట్టమునకు రెండుచక్రము లుండును. ఆరుచక్రము లుండుటవలన మార్గమధ్యమున గుంటలు మిట్టలు తగిలినయెడల రథమున కూర్చున్నవారికి ఒడ లదరకుండ నడచు నని శిల్పులు చెప్పెదరు. (చక్రబహుత్వము లేక ఒంటి చక్రము గలిగి నిలుపు లేక సంచరించునది సూర్యరథ మొకటి పౌరాణికముగ నున్నది.)

"మండలచక్రాన్" అనుమాటలను తెలుగు కవులు ఎట్లు పరివర్తించి రని చూడగ రంగనాథ రామాయణమున దీనిపోలిక యగపడలేదు. భాస్కరమును నింతియ. ఆధునికరచనల జూడగ గోపీనాథం వారు ఒక పెద్దవచనములో "అప్పుడు భృత్యులు **మండలచక్ర**రథహయఖరోష్ట్రధేనుసహితులై యతని వెంట (భరతునివెంట) జనిరి" యనియున్నది—ఆంధ్ర వాల్మీకి వా. సు. దాసుగారు అయోధ్యాకాండలో ౧౭౬౩-వ పద్యమున నిట్లు చెప్పినారు:—

"తమ్ముడుఁ దాను నెక్కి సుర
  ధాముమువెల్వడుసిద్ధుపోల్కి వే
గమ్మున నూరు వీడి బల
  కాండముగొల్వగ **మండలోరు** చ
క్రమ్ముల నొప్పుతేర్లు కుర
  గమ్ములుగోవులు నుష్ట్రసంఘముల్
సమ్మతిఁ గొంచు భృత్యజన
  సంతతి వెంబడిరా మహోత్సరన్."

ఇక కళాప్రపూర్ణ శేషాద్రిశర్మగారి భరతుడును '**మండలాకారచక్ర**ముల్ గండుమిగుల, నలరు రథముల బహుళతంబులను గొనుచు*' నయోధ్య వెడలి నట్టున్నది. మండలాకారచక్ర గత రహస్యమును వ్యాఖ్యాతలుగాని భాషాపరివర్తకులుగాని వెలిబుచ్చకున్నారు. బహుశః శకటపరిణామ విన్యాసమున త్రివేణుమండలచక్రములు కొన్ని పరిణామదశల కభిజ్ఞానములుగ నుండగలవు (A state in the evolution of carriages). భావిలోని శబ్దము లిట్లు విజ్ఞాన వికాసముల నప్రయత్నముగ బోధింపగలవు.



* కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారి ఆంధ్రరామాయణము అయోధ్యాకాండ ౨౪౧౦-వపద్యము.

# ఆంధ్రతేజము

శ్రీ ఉదయగిరి సన్యాసిరాజు

౧

కాకతీయ వంశ కంధి చంద్రుండును
మనుమసిద్ధి, తెలుఁగుమగలు గడఁగి
సైన్యయుక్తుఁడైన క్షేత్రపాలునితోడ
సంగరంబు సలుప సాగి రపుడు.

కొండ లొండొంటితోడ నుద్దండవృత్తి
ఖండనము సేయుభంగి నా రెండు తెగల
దండిమగ లొండొరులతోడ ఖండనంబుఁ
జండతరధాటి నొనరించుచుండి రపుడు.

యాదవులతోడఁ బోరాడి యలసి, సొలసి
బెగడుపడి వెనుకంజను వేయుచున్న
తెలుఁగుమగలకు గణపతిదేవరాజు
జలదగంభీరముగ నిట్లు పలికినాఁడు.

"కుప్పించి యెదిరికి ముప్పు ఘటింపుఁడీ
వీరరక్తము మేనఁ బాఱదొక్కొ
తండ్రుల వారసత్వపుఁ గీర్తి మకుటంబు
చెలరేగు మని బుద్ధి సెప్పదొక్కొ
ఉఱుకుము గ్రక్కున నతికెద శత్రుఁడీ
ఖడ్గంబు కరములఁ గ్రాలదొక్కొ
ధట్టీల మొలఁజుట్టి తరలుఁడీ పగవారి
మాటలు గుండెల నాటవొక్కొ
అఖిలలోకమ్ము 'లద్దిరా!' యన్నయట్టి
తొల్లిటి తెలుంగుకీర్తి యీ దొరలడంబు
గని భయంబున నెటకేని జనియెనొక్కొ
అక్కటా! పాఱఁగతమేమి? యాంధ్రులార!

పిఱికి నెత్తురు బిఱబిఱ వెన్కకుం ద్రిప్పఁ
గఱకుకత్తివలనఁ గలదె ఫలము
ప్రణయపాశమ్ము నెమ్మనమును బంధింప
గట్టియీఱెవలనఁ గలదె ఫలము
భంగపడినవారు భయముఁ గొల్పుచునుండ
ఘనగదవలననుఁ గలదె ఫలము
జయముపై మనమున సందియమ్ము జనింప
గడిది బలమువలనఁ గలదె ఫలము
మానవంతుల మనుమాట మఱపురాఁగ
మగల మేమను మాటయే మఱపురాఁగఁ
గాలదండము లున్ననుఁ గలదె ఫలము
వీరమత్తేభహరులార! శూరులార!

ఇంతకు ముట్టవచ్చి యిఁక
నేగతి వైరికి వెన్నుసూపి యా
వంతయు సిగ్గులేక నిజ
వాసము సేరుదు రంతెకాక, మ
న్నెఁతురె యాడువాండ్రు మిము?
నీచు లటంచుఁ దలంచి స్రుక్కరే?
చింతిల నేల! చచ్చి దివిఁ
జేరుఁడు, చూఱఁగొనుండు కీర్తిఁడీ.

కులపతి 'గోలుగోలు' మని
కుందఁగ బిల్లలు దిక్కులేమిఁడీ
వలవల నేడువఁడీ మిగుల
వందుఱియు నేమిఁ జేయలేక ప్రే

మలత విశ్శృంఖలంబును స
    మంచితలీల నడంచి 'ధైర్యమ'న్
బలితపుఁగత్తిఁ గోసి యిట
    వచ్చితి రేటికి వెన్ను సూపఁగన్.

మేటిమగ లాంధ్రు లను తొంటిమాట వట్టి
బూటకము జేసి నిజజన్మభూమి వగవఁ
బగకు వెన్నిచ్చి యీగతిఁ బాఱఁదగునె?
తెలుఁగుదొరలార! మీతెల్వి తెల్లవాఱె!

ఉడుకు నెత్తురు వడివడిగఁ బాఱదె మేన?
    నడలఁగొట్ట రదేమి వెడగుపగఱ
దండిశత్రులదెబ్బ గుండెల నాఁటదే?
    దండింప రేమి పెన్దుండగీండ్ర
సాటివారలపోటుమాటలు వినరావె?
    కాటి కనుప రేమి మేటిమగల
జిత్తుల మారులై మొత్తు టెఱుంగరే?
    మొత్త రేమి గదల మత్తుమొనల
పాఱుబోతుల తీరునఁ బాఱు టరయ
వీరధర్మము గాదని మీ రెఱుఁగరె?
పోరిలో నిల్చి పేరందఁ గోర రేమి
వీరమత్తేభహరులార! శూరులార!

అనుపమమై జగద్వినుత
    మై సుఖదాయకమై తెలుఁగుపా
వనయశ మేరికిం బడయ
    వచ్చునె? పుత్రకళత్రమూలమై
ధనగృహహేతుభూతము,
    దారుణదుఃఖవిశేషయుక్తమై
తనరెడునట్టి సంసరణ
    తాపము వాయక కుందుచుండిరన్.

దారాపుత్ర ధనప్రణీతమగు మి
    థ్యామోహకం బైన సం
సారం బారసి సారహీన మని వి
    జ్ఞానుల్ శరచ్చంద్రికా
స్ఫారంబైతగు కీర్తిం బడయ వె
    చ్చంబెట్టి రీకాయముల్
వీరాగ్రేసరులార! మీరు నటు లీ
    వేళం జరింపందగున్.

బడబడ డాబులు వాగుచు
గడబిడ నొనరించు చవట కదనమునందున్
గడగడలాడును పరుగిడు
గడకు మడియున అచుకుక్క కఱచమనె చెపుఁడీ!

సారము లేని కర్మముల
    జాడలఁబోవుచు మందబుద్ధినై
యూరను బేరులేక పడి
    యుండుటకంటె నరాతి సైన్యమున్
బోరుల నోర్చి కీర్తిరమఁ
    బొందుటయో యని నిల్చి, స్వర్గమున్
జేరుటయో తగున్ పురుష
    సింహునికిన్ గమనించి చూడగన్.

కదనమునన్ జయంబుఁ గొన
    గా నగునేని, యశేషసంపదల్
సదమలకీర్తియుం గలుగుఁ
    జచ్చినచో సురసద్మ సౌఖ్యమొం
దుదు రెటులైన మేలగు, జ
    నుల్ నగ నిండ్లకుఁ బాఱిపోకుఁడీ
యదను పరీక్షవేళ, మన
    యాంధ్రపరాక్రమలక్ష్మి కారయన్

తెగువకుం జొచ్చి యత్తఱిఁ దెలుఁగువీరు
లసమసంగ్రామకేళి నయ్యాదవులను
వడలఁగొట్టిరి గణపతి యబ్రమంద
శౌణదేశాధిపతి దుఃఖజలధి మ్రుంద.

శౌర్యధనుఁడైన సకలాంధ్రచక్రవర్తి
పలికె గంభీరముగ జైత్రపాలుతోడ
తమకు నిప్పుడు యుద్ధధర్మములఁ జెప్ప
వచ్చినాఁడను నేర్చుకోవలయు రాజ!

"జంకొకింతయు లేక చటుకునఁ బగఱపై
దుఱుకుట యది పురుషోచితంబు
పాడిదప్పక, రణవ్యాపారమున శత్రు
నోర్చుట యది పు షోచితంబు
శరణువేడిన ప్రాణశత్రుని కభయంబు
నొసగుట యది పురుషోచితంబు
అరికిఁ జిక్కక మహాహవమున నీల్గి పే
రొందుట యది పురుషోచితంబు

గోచిపెట్టు టెఱుంగని గోలమైన
బాలుని రహస్యవిధి నేలపాలు సేయఁ
జూచు టది యక్కటా! పురుషోచితంబా
సమరధర్మముఁ గన వేల? జైత్రపాల!"

జైత్రపాలుఁడు పలికె "నీ 'శాస్త్రచర్చ
కొంచెమో గొప్పయో యెఱుంగుదును నేను
శక్తికలదేని సమరమ్ము సలుపరమ్ము—
చేతఁగాదేని స్వగృహమ్ము సేరఁబొమ్ము."

గణన సేయు టెట్లు? గణపతి విజయకా
రణము నాఁటి ఘోరరణమునందు!
తెలుఁగువీరు లాత్మతేజ మందుట దైవ
బల మటంచు యాదవులు వచింత్రు.

తెలుఁగుదొరయైన గణపతిదేవరాజు
పూర్వవృత్తాంతమునుఁ దలపోసి పలికె
"విజయము లభింపగా విఱ్ఱవీగి నన్నుఁ
జంపఁదలఁచితి వొప్పునే? జైత్రపాల!

తులలేని కలతోడఁ జెలువారుఖడ్గంబు
గరముల దాల్చిన గరువతనము
వెలలేని మణులతోఁ గులుకుసూపెడుమకు
టముఁ దలనిడిన యాడంబరంబు
చలియించుకులగిరివలె నొప్పుకరి నెక్కి
కూరుచుండిన యట్టి గొప్పతనము
పలువురు రాజుల గెలిచి వీరుఁడ నను
పేరు పెట్టికొనిన పెద్దతనము

నెందుబోయెను వీనుల విందుగాఁగ
మా కెఱిఁగింపుమా నేఁడు ప్రాకటముగ
రాజ! యీమాట లేల? ఘోరాజి విడిచి
పొమ్ము ఘోరాటవులకుఁ దప మ్మొనర్ప.

చీటికి మాటికిఁ బెడగు
చేతలు సేయుచు నన్నుఁబోలుబల్
పోటరి లేఁడటంచుఁ బువు
బోడులసన్నిధి విఱ్ఱవీగి, యీ
చేటునుఁ దెచ్చికొంటి విఁకఁ
జేయున దేమియు లేదు గానఁ బో
రాటఁ దొలంగి యోడితి న
టంచు వచింపుము నిన్నుఁ గాచెదన్.

మానవజన్మ మెత్తి పలు
మారులు శత్రులు పోటుమాటలన్
మానసమందు నాఁట నవ
మానము నోర్చి శవంబురీతి మే

నూనుటకంటె స్వర్గసుఖ
    మొందుట లెస్స" యటంచు వెండియుఁ
దా ననికిం గడంగె యదు
    నాయకుఁ డద్దిర! శౌర్య మద్దిరా!

చైత్రపాలుఁడు వరియించె స్వర్గలక్ష్మి
గొల్లవారలు మిక్కిలి తల్లడిలిరి
గణపతి వరించె 'జయలక్ష్మి' రణము ముగిసె
నరుణకిరణుండు శాంతుఁడై యస్తమించె.

ఒక్క మంచిముహూర్తాన "నోరుగల్లు
పట్టణంబునఁ" బట్టంబు గట్టికొనియె
తెలుఁగు నేలకు" "గణపతిదేవచక్ర
వర్తి" సామంతులెల్లరు భళి యనంగ.

"పగతుఁ డెంతటిబలవంతుఁడైనను భయం
    పడక వానిని బోర మార్కొనంగ
పగవానికొడుకులఁ బట్టి చంపక రాజ్య
    భాగము వారికిఁ బంచి యీయఁ
బగవారలకు నోడి పారినవాని!
    మరలఁ దొల్లిటిరాజ్యగరిమఁ గూర్చ
బాహుబలస్ఫూర్తి పరిఘవిల్లఁ గడంగి
    యాంధ్ర దేశం బెల్ల నాక్రమింప
నాంధ్ర తేజోవిరాజితుఁడైన కాక
తీయగణపతిచక్రవర్తి యొకరుండ
నేర్చు; కల్లగదా పరుల్ నేర్తు రనుట!"
అని తెనుఁగు తేనిఁ 'దిక్కన' యభినుతించె.

---

# ఈసప్ వృత్తాంతము

శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు

౧

అద్భుతమైన లోకజ్ఞానమూ, అద్వితీయమైన వాక్చమత్కృతీ, సాటిలేనిసమయస్ఫూర్తీ—ఈమూడువిశేషాలూ ఒకే వ్యక్తిలో చక్కగా పరిస్ఫుటం కావడం చాలా అరుదు. అటువంటి మూడు ప్రజ్ఞలూ ఒకరిలోనే మూర్తీభవించిన మహామహులు, లోకంలో ముగ్గురే కనబడుతున్నారు. ఇటీవల తెనాలి రామలింగమూ, అంతకుముందు అక్బరు బాదుషా ఆస్థానమందు రాజా వీరబలునూ, ప్రాచీనకాలంలో పడమట గ్రీసుదేశప్రాంతాల్లో ఈసప్ మహాశయుడూ—ఈముగ్గురికీ సాటి? ఈముగ్గరే!

తెనాలి రామలింగడి కథలూ,వీరబల వినోదాలూ, ఈసపు నీతికథలూ అంతా చదువుతూనే ఉంటారు. ఈ కథాకుసుమాలు వాడిపోవు. దేవపారిజాతాల్లాగ ఎప్పటికీ వికసిస్తూ, ఘుమఘుమలాడుతూ కమ్మగానే ఉంటున్నవి. మొదటి యిద్దరూ ఆంధ్రులు, హైందవులు. వారి పూర్వోత్తరాలు చాలామందికి తెలిసే ఉన్నవి. కాని, చిన్నప్పటినుంచీ, అన్ని దేశాల్లోను, అన్ని భాషల్లోనూ చదువుకుంటున్న నీతికథలువ్రాసిన ఈసప్ చిత్రకథమాత్రం మనవాళ్లకు చాలామందికి తెలిసినట్టు కనబడను కనుక తెలిసినంతవఱకు అతిసంగ్రహంగా అతని జీవితకథ యీదిగువ వ్రాస్తున్నాను.

౨

మహనీయుల జీవితకథలు సర్వసాధారణంగా విషాదపూరితంగా ఉంటవి. ఈసపుజన్మకథకూడా ఆ హంశమునే స్థిరపరుస్తున్నది. నీచదశలో పుట్టి పెరిగిన ఆ మేధాశాలికి పేరుప్రఖ్యాతులు వచ్చినవిధం అంతా చాలా చిత్రంగా ఉంటుంది. అవసానదశ విషాదపూరితమై మిక్కిలి జాలిగొలుపు తున్నది. మొత్తంమీద అతనికథ అద్భుతం అనిపిస్తుంది.

ఈసప్ ఎప్పుడు పుట్టాడో, ఎక్కడ పుట్టాడో స్పష్టంగా ఎవరికి తెలియదు. కొందరు అతను అబిసీనియా దేశంలో పుట్టినట్టు చెబుతారు. కొందరు అతను ఫ్రిజియా దేశపువా డంటారు. ఆకాలంలో ఫ్రిజియా దేశం నేటి టర్కీ దేశంలో చేరి ఉన్నది. మరికొందరు మరొకలాగ చెబుతారు. నిశ్చయం తేలలేదు.

ఈసప్ జన్మం క్రీస్తుకుముందు ఆరువందలఏళ్ల కిందట నంటారు. అనగా ఇప్పటికి రెండువేలఐదు వందల సంవత్సరాల కిందటిమాట. ఆరోజుల్లో ఆపడమటిరాజ్యాల్లో మనుష్యులనుపట్టి పశువుల్లాగ సంతల్లో అమ్మేసేవారు. అధికారమూ, అంగబలమూ, అర్థబలమూ కలవారు పేదలనూ, బలహీనులనూపట్టి, బజార్లలోనూ, సంతల్లోనూ బానిసలకింద అమ్ముతూ ఉండేవారు. కాస్త ఒడ్డూ పొడుగూ ఉండి, కండపుష్టీ, సురూపముగల మొగబానిసలకు వెల ఎక్కువ పెట్టేవారు. సౌందర్యవతులైన ఆడదాసీలకున్నూ ఎక్కువ వెల ఉండేది.

వెల ఎక్కువపెట్టడమనుకు ఈసపుదగ్గిర శరీర లక్షణం ఒకటైనా మంచిది లేక పోయింది. మనిషి తారుకంటె కూడా కారునలుపు. అష్టావక్రుడు, మరుగుజ్జు, అల్పకాయం, గూని వీపు. మొహం, కోతిమొహం. ఇలాగ చెడులక్షణాలు ఎన్నికావాలో అన్నీ ఈసపురూపంలో కనబడేవి. బొమ్మచూడండి!

ఈసప్

పుట్టినదేశమూ, కాలమూ, నిశ్చయంగా తెలియనప్పుడు, అతనితల్లి తండ్రు లెవరో, బాల్యంలో ఏమి

చేష్టలు చేసేవాడో, చిన్నతనంలో ఏమి విశేషాలు జరిగినాయో విద్యాబుద్ధులు ఎక్కడ ఎలాగు నేర్చుకున్నాడో - ఇవన్నీ తెలుసుకోవడం అసాధ్యం.

3

బానిసగా విక్రయింపబడక పూర్వం ఈసప్ తాను పుట్టిపెరిగిన దేశం విడిచి, తన యజమాని వెంట మరికొందరు బానిసలతో కూడా ఒకఅభ్యావపు ఎడారి దాటి వెళ్లవలసి వచ్చింది. అతనిని గురించి స్పష్టంగా లోకానికి తెలిసిన మొదటి సంగతి ఈయెడారి ప్రయాణమే. ఈబిడారులో ఒక్కొక్క బానిసీడు వాడివాడి ఈడునుబట్టీ, బలసామర్థ్యాలనుబట్టీ, పెట్టెలూ, తట్టలూ, బుట్టలూ, మూటలూ మొదలైన బలువులు మోసుకొని పోవలసి ఉండెను. "నేను బలహీనుణ్ణి, పెద్దబలువు మొయ్యలేను. దయచేసి నాకేదైనా తేలికబుట్ట ఇప్పించండి" అని ఈసపు తనతోటి బానిసలను బతిమాలుకున్నాడు. "సరేలే - నీకువేది కావలిస్తే ఆబలువే ఎంచి తీసుకో! మిగిలిన సామానులు మేము మోసుకొని వెళతాం" అన్నారు, వాళ్లు. ఎందులో ఏమి సరకులున్నవో, అంతా తణిఖీచేసి చూసుకున్నాడు, ఈసప్. తుదకు అందులో ఒక పెద్దబుట్ట తాను మోస్తానని కోరి వాడు ఎంచుకున్నాడు. తేలిక మాటకోసం దేవులాడక ఈసపు అంతబలువు బుట్టకోరి ఎందుకు ఎంచుకున్నాడో తోటివాళ్లకు మొదట బోధపడలేదు. "వాజవాగమ్మ! తెలివితక్కువ! మొద్దు. కాకపోతే అంత బలువుబుట్ట ఎంచుకుంటాడా?" అని వాళ్లంతా తోచినట్టు ఆక్షేపించారు. ఈసప్ ఏమీ మాటాడలేదు. వాడు ఎత్తుకున్నది రొట్టెలబుట్ట. దారిలో మజిలీచేసినప్పుడు ఆబిడారులో మనుష్యులంతా తినేతిండి ఆరొట్టెలే! మొదటినాడు పగలల్లా నడిచి, రాత్రి పడ్డాక వాళ్లందరూ ఒకదగ్గిర మజిలీ చేసి,వాడిగంపలో వున్నరొట్టెలేతీసి అంతా తిన్నారు! అందువల్ల వాడిబలువు మూడింటఒకపాలుతగ్గిపోయింది.

మర్నాడు పొద్దున్నలేచి బయలుదేరే ముందు మళ్లీ అంతా అందులో రొట్టెలే తిన్నారు. రెండు పాళ్లు బలువు తగ్గిపోయింది. మధ్యాహ్నం మజిలీతో ఈసప్‌బుట్ట పూర్తిగా ఖాళీ అయిపోయింది. తరువాత అడంగు చేరుకొనేదాకా పొట్టివాడు ఖాళీబుట్టతోనే నడిచాడు. "ఏమో అనుకున్నాంరా! అబ్బ! తొత్తుకొడకా! ఎంత గడుసువాడివిరా! మంచి గమ్మత్తే చేశావే! పెద్దబలువు ఎంచుకున్నట్టు తమాషా చేశావు. మూడుపూటలతో తేలిక అయిపోయిందిరా నీగంప! మేం మా బలువులు మోస్తూ నడవలేక చస్తున్నాం. పొట్టివాడికి పుట్టెడుబుద్ధు లంటారు ఇందుకే కాబోలు" అని నవ్వుకుంటూ,ఆశ్చర్యపడుతూ, వాడి తెలివి తేటలు మెచ్చుకుంటూ తోటిబానిసలు ప్రయాణంసాగించారు.

4

బిడారువర్తకులు తెచ్చిన సరుకు అంతా గ్రీసు దేశంలో చెల్లిపోయింది. బానిసజనంకూడా అమ్ముకం అయిపోయారు. ముగ్గురుమాత్రం మిగిలిపోయారు.

ఆముగ్గురులో ఒకడు మంచి సంగీతపాటకుడు. రెండోవాడు గొప్పవక్త. వాళ్లిద్దరూ సురూపులూ, యౌవనులున్నూ. మూడవవాడు ఈసప్ పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేరకం—అతికురూపి. నిదానించి తరిచి చూస్తేమాత్రం వాడిబుద్ధి అగాధమైన మహాసముద్రం.

బలేజోరుగా సాగుతున్నది బానిసలబజారు. చుట్టుప్రక్కలదేశాలనుంచి సురూపులూ, చక్కనిచుక్కలూ, కావలసినంతమంది దాసదాసీజనం దిగారు. బజారు నిండిపోయింది. వాళ్లను అమ్ముకునే యజమానులు వాళ్లవాళ్లగుణగణాలు ఎలుగెత్తి సాటి చెప్పుతున్నారు. చూసేవాళ్లు చూస్తున్నారు,కొనేవాళ్లు కొంటున్నారు.

గ్రీసుదేశస్థులు సహజంగా స్ఫురద్రూపులు. తూర్పుదేశాలవాళ్లంటేనే వాళ్లకుచాలా నిరసనభావం. అందులోనూ,మంచిఆణిముత్యాలమధ్య కుంకుడుపిక్కలాగుఉన్న ఈసపును చూస్తే అక్కడివాళ్లకు అసహ్యం వేసి తొలిగిపోయేవారు."కురూపీ,కురూపీ సురూపాలు లెక్క పెడుతున్నావా?" అని కొందరు వేళాకోళాలు చేస్తూ నడిచేవారు. అటువంటి రంగంలోకి వేంచేశాడు—తన శిష్యబృందంతో కూడా 'జాంథస్' అనే పేరు గల గ్రీకు విద్వాంసుడు. అతడు ఈసపునూ, ఆ ప్రక్కలను ఇటూ అటూవున్న బానిసలనూ పరికించి

చూశాడు. అందులోనూ మాటకారిని పలకరించి, "నువ్వు ఏమి చెయ్యగలవు?" అని ప్రశ్నించాడు. "నేను అన్నీ చెయ్యగలను" అని సగర్వంగా జవాబు చెప్పాడు, వక్త. "నీ కేంచేతనవును?" అని గాయకుణ్ణి అడిగాడు, విద్వాంసుడు.


జాంతసు

"నాకు అన్నీ చేతనవును" అని సంగీతప్రపాటకుడు అన్నాడు.

ఈ మాటలకు పకపకా నవ్వాడు — ఆయిద్దరి మధ్యా ఉన్న ఈసప్. ఆ నవ్వు ఆకర్షించింది, విద్వాంసుణ్ణి. అత డీపొట్టి వాణ్ణి బాగా పరకాయించిచూశాడు. "ఈ...వికృత...ఘటం ఏం చెయ్యగలదు?" అని అడిగాడు — "ఈ యన సర్వకార్య నిర్వాహకుడు. ఆయన సర్వశక్తుడు. ఈ ఉభయుల మధ్య చిక్కడ్డ నాకు వారు ఏమీ మిగల్చలేదు, నేను ఏమైనా చేతా మనుకున్నప్పటికీ" అన్నాడు, సాభిప్రాయంగా.

పైకి ఎంతో అందవికారంగా ఉన్నా ఈసప్ యొక్క ఉపజ్ఞా, అంతస్సారమూ, ఈ జవాబుతో విద్వాంసుడికి స్పష్టమయినాయి. అయినా చూతామని మరి నాలుగు ప్రశ్నలు వేసి చూశాడు. తొణుకూ బెణుకూ లేకుండా సూటిగా మంచిమంచిజవాబులు ఈసపు చెప్పాడు. అందువల్ల పొట్టివాడు సామాన్యుడు కాడనినీ, మసిపాతచాటున మెరుస్తున్న మేటివజ్రంలాంటివా డనినీ విద్వాంసుడు బాగా గ్రహించాడు. ఆట్టేబేరం ఆడకుండా కోరిన వెల యిచ్చి ఈసప్‌ను కొని జాంతసు తనయింటికి తీసుకొని పోయాడు.

✻

ఆ విద్వాంసుడి భార్య అసాధ్యురాలు. మన హరిశ్చంద్రనాటకంలో కలహకంఠిలాంటి దనవచ్చు; అంతకంటె మంచి ఉపమానం కావాలంటే శ్రీకృష్ణుని అష్టభార్యలలో సత్యభామవంటి దనికూడా చెప్పవచ్చు. ఈసపుని చూసేసరికి ఆవిడ మండిపడిపోయింది. కొంటె ఉద్దేశంతో తనను అపహాస్యం చేదామనీ, అవమానం చేద్దామనీ, తన భర్త ఇటువంటి కురూపిని వెంటతెచ్చి తనయింట పెట్టాడని ఆమె భావించుకున్నది. "నాపరువూ, మర్యాదా, నాగౌరవం, నాదర్జా ఎక్కడ? ఈ కునిష్టిముండాకొడుకెక్కడ? వీ డెలా దాపరించాడు' మీకు. నాకు నలుగురిలో అప్రతిష్ఠ కోసం వీణ్ణి మీరు కొనుక్కొని వచ్చారా? బుద్ధీ జ్ఞానం ఏమైనా వుందా? మీకు" అంటూ, 'వేటువడ్డ ఉరగాంగనలాగు బుస్సుమని లేచింది మొగుడిమీదికి.

"అలా కాదుసుమీ. పొరపాటుపడ్డావు. నీ అప్రతిష్ఠ నా అప్రతిష్ఠకాదా? నీగౌరవం నాగౌరవం కాదా? నిన్ను చిన్నబుచ్చి నే నేంకావాలి? శాంతించి చూడు. వీడు చాలా తెలివైనవాడు. మనకు చాలా ఉపకారి కాగలడు సుమా!" అంటూ మంచిమాటలతో ఆమెను ప్రసన్నంచేసుకోడానికి ఆమెభర్త చాలా ప్రయత్నించాడు.

"మీరు వెయ్యి చెప్పండి-లక్ష చెప్పండి. మన యింట్లో యీదరిద్రుగొట్టుముండకొడుకు ఉండడానికి వల్లపడదు. కోతివిదెయ్యంలాగ వీ డెందుకూ మనకు?" అంటూ కసిరికొట్టింది—ఆవిడ.

భార్యామణికి సంజాయిషీ చెప్పలేడు. వీణ్ణి వదిలిపెట్టలేడు. పచ్చివెలగకాయ గొంతుక పట్టుకున్నట్టువుంది—పాపం ఆయింటి యజమానికి. ఈదంపతుల సంభాషణవింటూ, ఏమీ మాటలాడకుండా ఒకమూల ఇంతసేపూ ఒదిగివున్న ఈసప్‌ను చూచి, యజమానుడు "ఏంవిరా? బెల్లంమొత్తిన రాయిలాగు మాటాడవేం? బజారులో చెప్పిన పెద్దకబుర్లకు సంతోషించి నీవల్ల ప్రయోజనం వుంటుందని నిన్ను కొని తీసుకొనివచ్చాను. నన్ను పట్టుకొని చెట్టు దులిపినట్టు ఆవిడ దులిపివేస్తూవుంటే, కోరైనా మెదల్చవేం?" అని కోపంతో అడిగాడు.

"అగ్నిప్రమాదాలూ, జలప్రళయాలు మొదలైన మహోపద్రవాలనుంచి మనలనుకాపాడిరక్షించే భగవంతుడు ఆడవాళ్ల ఆగ్రహంనుంచీ, సూటీమాటపోట్లనుంచీ రక్షించకపోతాడా?" అని ఆమెకు దండంపెట్టి "తల్లీ! అమ్మగారూ! ఏరు వంకరయితే నీటికి వంకర

వుందా? చెఱుకు వంకరైతే తీపి చెడుతుందా? నీలమేఘం వర్షించినట్టు మరే మేఘం అయినా వర్షిస్తుందా?

ఇనుం నలుపు—నల్లగా వుంటుం దని, కత్తులూ, కటార్లు చేత్తో పట్టుకోరా? ఉలీ, బాడిశా, గునపం, పారా, కత్తిపీట—ఇంట్లో పెట్టుకోడం మానేశారా? మానేస్తే దినం గడుస్తుందా? రంగులోనూ రూపం లోనూ ఏమున్నది? వాడుకలో ఉన్నది కాని! లొట్టిపిట్ట అష్టావక్రంగా ఉంటుంది. దాన్ని విడిచిపెట్టేస్తే ఏవర్తకుడు ఎడారి దాటగలడు? ఆవు నలుపైతే పాలు నల్లబడునా? పైతొక్కలో ఏమి ఉన్నది? తల్లీ! ప్రయోజనంలో ఉన్నదికాని? కొంతకాలం చూడండి పనికిరాకపోతే పంపించెయ్యండి"

అని సవినయంగా మనవిచేశాడు.

ఆమాటలు ఆవిడకు నచ్చినవి. మనస్సు మారింది. పని కావాలి కాని మనిషి ఎలావుంటే నేమని ఆవిడ కూడా ఒప్పుకుంది — "వంటిపిల్లో! మాయపిల్లో! ఎలుకని పట్టితే పిల్లి!" అని అనుకొన్నది.

ఆగృహంలో ఈసప్ హాయిగా కాలక్షేపం చేసేవాడు, అనగా—బానిసవర్గంలో చేరినట్టు నీచంగా కాక, కుటుంబంలో వక డైనట్టుగా. భార్యాభర్తలు ఉభయులూకూడా దయాదాక్షిణ్యాలతోనూ, గౌరవాభిమానాలతోనూ పోషిస్తూవచ్చేవారు.

జాంతస్, మంచి పండితుడు, సుప్రసిద్ధతత్త్వవేత్త. ఆతనిని చూడడానికి దేశదేశాలనుంచి విద్వాంసులు వచ్చి శాస్త్రచర్చలు చేసేవారు. ఆచర్చలలో ఈసప్ కూడా పాలుగొంటూ ఉండడంచేత సహజంగా ఆతనికిగల తెలివితేటలు సానబట్టిన రత్నంలాగు బాగా ప్రకాశించేవి.

## ౬

జాంతసు గృహజీవనంలో ఒక ఘట్టం కష్టంగా ఉండేది. ఆతనియిల్లాలు పెద్దయింటివారిపడుచు, స్వతహాగా భాగ్యవంతురాలు, సేవకాంశలను తృణీకరించగల సౌందర్యవతి. ఇవన్నీ కూడడంచేత గర్వదంభ మాత్సర్యాలకేగాని శాంతనిదానాలకు ఆమెమనస్సులో తావు లేకపోయింది. ఆమె రేమంటే అలాగు సాగిపోవలసిందే. 'అదేమం'టే కసువువచ్చిం దన్నమాటే. ఆమెకు ముక్కుమీదనే కోపం; నెత్తిమీదనే నీళ్లకడవ—

ఇంట్లో ఏడుపులూ, అల్లర్లూ, కలతలూ ఎందుకని భర్త సర్వసాధారణంగా ఆమెకు లొంగి సర్దుకొని పోతూవుండేవాడు. అతడు వంగినకొద్దీ ఆమె దురుసుతనం పెచ్చుపెరుగుతూ వచ్చేది. భర్తమీద ప్రేమలోపంచేతకాదుగాని పారిజాతకుసుమంమూలంగా సత్యభామవల్ల శ్రీకృష్ణునికి కలిగిన చిక్కులవంటివే ఆగృహమేధికి భార్యవల్ల తఱచుగా కలుగుతూ వచ్చేవి.

ఒకనాడు భార్యాభర్తల సంవాదం తీవ్రంగా సాగింది. మామూలుగా లొంగిపోయినట్టు ఆవేళ భర్త లొంగలేదు, వంగలేదు. దానితో పట్టరానికోపం వచ్చి భార్య పుట్టింటికి వెళ్లిపోయింది. ఆమె వెళ్లడంవల్ల భర్తకు చాలా కష్టంగా ఉండినా, పైకి ఏమీ తెలియనీయక ఎలాగో కాలక్షేపం చేసేవాడు.

రోజులు గడుస్తున్నాయి. భార్య తిరిగి రాలేదు. ఇంట్లో ఆమె లేకపోవడం ఆతనికి దుస్తరంగానూ, దుర్భరంగానూ ఉంటూవచ్చింది. ఎంత వున్నా, ఏమి వున్నా గృహలక్ష్మిమసలని ఇల్లు పాడిల్లు అని ఆతనికి స్పష్టం అవుతూ వచ్చింది. విశ్వం అంతటిలో ఆతనికి ప్రియతమ భార్యకదా! అటువంటి అర్ధాంగి అతని ప్రక్కను లేకపోవడం అతను ఎంతకాలం భరించగలడు? ఆవిడను తిరిగి రప్పించుకోవడం ఎలాగు?

తన యజమాని పడుతున్న దురవస్థ యావత్తు ఈసప్ గ్రహించాడు. ఆయన వెళ్లి బతిమాలితే ఆవిడ మరింత కొండెక్కుతుంది; కనుక ఆపెట్టు చెడకుండా ఆవిడనే యిక్కడికి రప్పించడానికి—మాత్స్యంలో మోక్షం—సులభోపాయం ఆలోచించాడు. ఆసంగతి యజమానితో రహస్యంగా చెప్పాడు. ["మాయింట్లో గొప్ప శుభకార్యం జరుగుతుంది. ముహూర్తం ఇవాళకు పదిహేనురోజులు ఉంది. ఆవేళ తెల్లారకుండా మాకు చేపలు* మంచివి కావాలి. ఎన్నిబుట్టలైనా

* గ్రీకులు శుభకార్యాల్లో విందులకు మత్స్య మాంసాలూ, మద్యాలూ భారీగా వాడేవారు.

పుచ్చుకుంటాం. నువ్వు ఎన్ని తెప్పించగలవు?" అని వడిబజారులో అంతా వినేటట్టు పెద్ద జాలరితో గట్టిగా చెప్పండి. మంచి మంచి మాంసాలు కావలసి ఉన్నాయనీ,అందచెయ్యమనీ కటికవాడితో చెప్పండి. పళ్లూ, ఫలాలు కావాలని పళ్లవర్తకుడితో చెప్పండి. ప్రశస్తం అయిన ద్రాక్షసారాయి పీపాల్తో కావాలని ఆరుకాణదారుతో చెప్పండి. ఈ సంగతులు అందరికీ తెలిసేలాగు బాగా ప్రకటించండి. అవతలపని వాడు వదిలిపెట్టండి. ఆనాటికి అమ్మగారు ఇంటికివచ్చి మీపాదాలు పట్టుకుంటారో లేదో మీరే చూస్తారుగాని"—] అని ఈసప్ ఉపాయం చెప్పాడు.

జాంతస్‌గారి యింట్లోనే 'డారిక' (Doricha) అనే పేరుగల స్త్రీ ఒకతె ఉండేది. ఆమె మంచి సౌందర్యవతి. ఆనాటిసుందరులలో ఆమె అగ్రగణ్య. లోగడ ఆ స్త్రీరత్నం బజారులో దాసీకింద అమ్ముడవుతూవుంటే జాంతస్ ఆమెనుకొనితెచ్చి ఉంచాడు. "జాంతస్ ఆమెను ద్వితీయభార్యగా గ్రహిస్తాడు. పెళ్లిముహూర్తం దగ్గిరగానే వుంది" అంటూ ఈసప్ ఒకపుకారు లేవదీశాడు. ఎందుకీవిందు? ఈభోజనాలెందుకు? అని ఎవరైనా అడిగితే "అమ్మగారు కాపరం వదులుకొని పోతే, ఈ అయ్యగారు ఎంతకాలం 'నాతిగల బ్రహ్మచర్యం' చేస్తూ ఉంటారు? సుందరమ్మను కొనితెచ్చుకున్నారు. ఆ పెళ్లికే యీ హడావిడి అంతాను!" అని అడిగిన వాళ్లతోనూ అడగనివాళ్లతోనూ కూడా ఈసపు ఊదుపెడుతూ వచ్చాడు. సవతిరాకకు సమ్మతించే తత్వం కాదు అమ్మగారిదని బాగా ఎరుగును కనుక ఈసప్ ఈ పన్నాగం పన్నాడు.

పట్నంలో గొప్ప అలజడి బయలుదేరింది. తాటాకుల మంటలాగు ఊరూ వాడా ఈరెండో పెళ్లి సంగతి వ్యాపించింది. తనమొగుడు మరొకర్తెను పెళ్లాడ నిశ్చయించుకున్నాడనీ, పెళ్లిప్రయత్నాలు జోరుగా జరుగుతున్నాయనీ, పెళ్లివిందుకు బ్రహ్మాండమైన ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, వార్తలు, పుట్టింట్లో వున్న అమ్మగారిచెవుల్లో కొఱకంచుల్లాగు పడ్డవి. దానితో నిప్పులుతొక్కిన కోతిలాగు ఆమె గెంతడం ప్రారంభించింది.

శుభముహూర్తం సమీపిస్తున్నది. పెళ్లియిల్లు దివ్యంగా అలంకరించారు. రంగురంగుల బుట్టలూ—జెండాలూ—లతలూ—ఆకులూ — పువ్వులూ — గంధర్వలోకసౌందర్యంతో అందరినీ ఆకర్షిస్తూంది పెళ్లియిల్లు. బంధుమిత్రులు ఒకొక్కరే సమావేశం అవుతున్నారు. రంగం రక్తి కట్టుతున్నది.

ఆ సమయానికల్లా — కోపదేవత మనుష్యరూపంతో అవతరించినట్టు—జాంతస్ పండితుడిభార్యామణి — పుట్టింటినుంచి రథం ఎక్కి ఝామ్మని కొట్టుకొచ్చింది.

జాంతస్ భార్య



"నాయింట్లోకి రావడానికి ఎవర్తెకి హక్కున్నది? నాసవతి యెవర్తె ఇక్కడ అడుగుపెడుతుంది? నాతడాఖా తెలియకుండా వుందా? రమ్మను! నరికేస్తాను - కనబడితే కూనీచేస్తా"నని ఉరుముతూ మహిషాసురమర్దనిలాగు ఆమె ఇంట్లో ప్రవేశించింది.

మందహాసం చేస్తూ భర్త ఎదురువచ్చాడు. ఆడపులిలాగు ఆమె అతనిమీదకు ఉరికింది. "ఏమ్మే పెళ్లా? నే నుండగా ఈయింట్లో అడుగుపెట్టడానికి ఎవర్తెకు గుండెవుంది? పెళ్లాడడానికి మీకెక్కడ గుండెవుంది?" అని గాండ్రించింది. శృంగారం ఉట్టిపడేటట్టు మందహాసంచేస్తూ, భర్త, రెండుచేతులూ చాచి, కౌగిటిలోకి

రమ్మని సుస్వాగతం యిస్తూ "అబ్బెబ్బే! మళ్లీ పెళ్లి ఎవరికి? అలాటిపని ఎన్నడైనా జరుగుతుందా? నన్ను మరిచిపోయి పుట్టింట్లో నువ్వు ఉండిపోతే నేను నీకోసం వెంగపెట్టుకున్నాను. నాసంగతి నీకు జ్ఞాపకం చేదామని మన ఈసప్ వేళాకోళానికి ఈఎత్తు ఎత్తాడు. అంతే"—

"ఆఁ. వేళాకోళం- పాపం! వేళాకోళం అయితే ఈ అలంకారాలూ - ఈవంటలూ, పెంటలూ, విందులూ, గోవిందులూ ఎందుకు?" అని గద్గదకంఠంతో అడిగింది.

"పుట్టింటికి వెళ్లి క్షేమంగా మళ్లీవచ్చిన మా గృహలక్ష్మిగారి సుస్వాగతమహోత్సవంసందడి యిదంతాను" అంటూ ఆమెను కౌగిటిలోకి తీసుకుని తనవక్షానికి గట్టిగా అదుముకున్నాడు. పెనిమిటి భార్యలు ఒకనిముషంలో రాజీపడిపోయారు. ఇదంతా నా ప్రభావంకాదా అని ఈసప్ ఆంజనేయులులాగు ఉబ్బి గంతులేశాడు.

ఇటువంటి ఆడవాళ్లతో ఏమివచ్చినా విపరీతమే. అంతకుముందల్లా—సవతివస్తుందన్న దుఃఖం తొలిగిపోగా - భర్తకౌగిటి సుఖంలో పడి మునిగిపోయి, ఉక్కిరిబిక్కిరై, ఆమె వెక్కి వెక్కి ఏడవడం ఆరంభించింది. అక్కడ సమావేశం అయిన బంధుమిత్రులంతా అతని ఏకపత్నీవ్రతాన్నీ, ఆమె పాతివ్రత్యాన్నీ ప్రశంసించారు. అనవసరంగా చిరకాలం వియోగం పొందిన దంపతులను మళ్లీ కలపడానికి వారిభృత్యుడు-ఈసప్—వేసినఎత్తు దివ్యంగా సఫలమైనందుకు అందరూ అతగాణ్ణి వేనోళ్ల శ్లాఘిస్తూ కమ్మగా విందారగించారు.

ఈసప్ కీర్తి మిన్నుముట్టింది. ఆతత్త్వజ్ఞుడితో శాస్త్రవాదాలకు దేశదేశాలనుంచి పండితులువచ్చేవారు, తృప్తులయ్యేవారు. "పైకి కురూపి-లోపల మహాజ్ఞాని." అని ఈసప్‌ను ప్రశంసిస్తూ తిరిగి వెళ్లేవారు.

౨

ఈసప్‌మహాత్ముని సమయస్ఫూర్తి మహాద్భుతమైనదని నిరూపించడముకు రమ్యమైన ఉదాహరణం ఒకటి మనవిచేస్తాను.

అతని యజమానుడు జాంతస్ మంచి విద్వాంసుడైనా బహుమద్యప్రియుడు. వారియింట్లో బంధుమిత్రులు తరుచుగా సమావేశం కావడమూ, అప్పట్లో మంచినీళ్లకంటె మద్యం అధికంగా వినియోగం కావడమూ మామూలైపోయింది. ఒకసందర్భంలో ఈపానం మితిమీరిపోయింది. "తాగకు చాలించండి, ఇంతచేటు తాగకూడదు" అని ఈసప్ మందలిస్తున్నా వినిపించుకోక తెగతాగి అతడు మతిచెడి ఉన్నాడు.

అతని పాతశత్రువులు కొందరు ఇటువంటిసమయంకోసం చాలాకాలంనుంచి ప్రతీక్షిస్తున్నారు. "బాగా దొరికిపోయాడు; ఇదే మంచి సమయం" అనుకొని అతని శత్రువులు తియ్యని మాటలాడుతూ పందెపు ప్రసంగంలోకి దింపారు. సంభాషణ ఈ తీరున నడిచింది.

"జాంతస్ మహావిద్వాంసుడు శాస్త్రపారం చూసేశాడు."

"ఆహా—చూసేశారు—శాస్త్రపారమే కాదు—సముద్రాలపారంకూడాచూశారు. అద్భుతశక్తులున్నయి. కావలిస్తే చూడు-సముద్రం అంతా తాగగలరు."

"సముద్రం అంతా తాగేయడమే?"

"ఒక్కదెబ్బకు"

"తాగలేకపోతేనో?"

"తాగలేకపోవడం ఉంటుందా?"

"మాటవరసకు తాగలేకపోతేనో?"

"తాగలేకపోతే వారిసర్వస్వమూ పందెంకింద మీకు ఇచ్చివేస్తారు. సరా?"

"ఇచ్చేస్తారా? నిజంగా?"

"అటు సూర్యుడు ఇటు తిరగబడ్డా వారిమాటకు తిరుగు ఉంటుందా?"

"కావలిస్తే అలాగు దస్తావేజు వ్రాసి ముద్రవేసి ఇస్తారు."

"అయితే—రేపు వచ్చే బుధవారంనాడు జాంతస్ పండితులవారు మన సముద్రోదకం యావత్తూ నిశ్శేషంగా పానం చెయ్యగలందుకూ, అలాగు తాగలేకపోతే వారి చరస్థిరరూపకమైన యావదాస్తులూ వీరికి చెందడానికీ పందెం వ్రాయించి తెండి."

"అవశ్యమూ."

అలాగే శత్రువులు వెంటనే పందెం దస్తావేజు వ్రాసి తెచ్చారు. ఒళ్లు తెలియకుండానే అందుమీద

జాంతస్‌పండితుడు తన ఉంగరం తీసి సిక్కాముద్ర వేసేశాడు. ఈ విధంగా దస్తావేజు ఖాయపర్చుకుని శత్రువులు చల్లగా జారారు. మత్తెక్కి జాంతస్ కుంభ కర్ణుల్లాగు గుఱ్ఱుపెట్టి నిద్రపోయాడు.

మర్నాడు మధ్యాహ్నంవేళకు లేచాడు. మైకం వొదిలింది. తెలివి వచ్చింది "ఏమండోయి! స్వామీ! సముద్రం తాగేప్రయత్నం ప్రారంభం చెయ్యండి. లేకపోతే, చిల్లిగవ్వ అయినా మిగుల కుండా ఆస్తి అంతా శత్రువులు లాక్కుంటారు. దస్తావేజుమీద సిక్కాముద్రకూడా వేసి ఇచ్చేశారు" అని ఈసప్ జ్ఞాపకం చేశాడు.

"మత్తెక్కిపోయి, ఆగాడిదకొడుకులు చెప్పి నట్లల్లా చేశాను. పట్టుమని పదిచెంబుల నీళ్లు తాగలేను కదా? సముద్రం అంతా ఎలా తాగగలను? ఒళ్లూ, పయీ తెలియక వాళ్లు తవ్విన గోతిలో పడిపోయాను. నీపాట్ల ఉపాయాలపుట్ట. ఏదో ఉపాయంచేసి నువ్వే నా కీగండం తప్పించి ఒడ్డున వెయ్యాలి-తప్పదు." అన్నాడు. "అయితే సరే! దానికో చమత్కారం ఉంది, యుక్తి పన్నే ఉంచాను. అలా చేస్తే మీశత్రు వులచేత గడ్డి తినిపించవచ్చును. వినండి" అని రహ స్యంగా ఏమేమో చెప్పాడు.

బుధవారం వొచ్చింది. ఆవేళ జాంతస్‌పండి తుడు సముద్రం తాగేస్తాడు, చూతా మని వేలకొలది జనం సముద్రతీరానికి వచ్చారు. జాంతస్‌వెనక ఈసప్ ఒకపెద్ద చెంబుకూడా తెచ్చాడు. అప్పుడు జాంతస్ లేచి "మిత్రులారా! మనం అంతా ఇక్కడ ఎందుకు సమావేశం అయ్యామో మీ కందరికీ తెలిసే ఉన్నది. ఈసముద్రంఅంతా నేను తాగేస్తానని ఒప్పుకొని ఖరారు నామాకూడా వ్రాసి ఇచ్చాను. ఆప్రకారం తాగి తీరాలి. అయితే ఇక్కడ ఒకముఖ్యమైన విషయం తమరు గమనించాలి. నేను తాగుతా నన్నది సముద్రం మాత్రమే. అందులోకి నిరంతరమూ ప్రవహిస్తున్న నదులన్నిటినీరూకూడా తాగడానికి నేను ఒప్పుకో లేదు. కనుక ఇందులోకి ఏనదీజలమూ ఒక్కచుక్కై నా రాకుండా కట్టుదిట్టం చేసి పందెం వ్రాయించు కున్నవారు ఆపివేసిన ఉత్తరక్షణమందు అసలుసముద్ర జలం యావత్తు అవలీలగా తాగేస్తాను, తప్పను. ఇదు గో చెంబుకూడా తెప్పించాను. చూడండి" అని ఉప న్యాసం చేశాడు.

కృత్రిమంగా అతని ఆస్తి అపహరింతామని పందెం వ్రాయించుకున్న వాళ్ల నదుములు నటుక్కు మన్నాయి.

"శహబ్బాష్! వాహ్‌రేవాహ్! దొంగతొత్తుకొడుకులు అడ్డంగా మడిపోయారు. ఇది ఈసప్‌వేసిన కస్సారా! వాడివింటికి ఎదురు లేదురా!" అని ఆశ్చర్యపడుతూ జనసమూహం ఈసప్ తెలివితేటలు ఎంతో మెచ్చు కున్నారు. "ఇంతదురాశా? ఇంత అక్రమానికి దిగడమా? చెప్పుచ్చుకొని బాగా కొట్టాడు" అని వంచకులను అందరూ పొడిచి తగిలేశారు. జాంతస్‌పక్షంవాళ్లంతా మహానంతోషంతో తిరిగి వచ్చారు.

"నీధర్మమా అని నాపరువు మర్యాదలు దక్కి నవి. నాఆస్తి నాకు నిలబెట్టావు" అంటూ కృతజ్ఞుడై మహానంతోషంతో ఈసప్‌ను జాంతసు అప్పుకున్నాడు. "అప్పుడు నాయిల్లు నిలబెట్టావు. ఇప్పుడు నన్నే నిల బెట్టావు. నాఋణం తీర్చేశావు కాని నీఋణం నేను తీర్చలేను. ఇక నీవు నాకు దాసుడవు కావు"అనికూడా జాంతస్ ప్రకటించాడు.

గ్రీసులో 'శామోస్'మండల మహాజనసభలో అధికార్ల పద్ధతులప్రకారం ఈసపుదాస్యం వదిల్చి స్వేచ్ఛ ప్రసాదించారు. నాటినుంచీ ఆమండల రాజ కీయసభలలోకూడా ఈసప్‌కు ప్రాముఖ్యం వచ్చింది.

## ౮

ఆ దినాల్లో లిడియా (Lydia) అనే సమీప దేశాన్ని క్రీసస్ (Croesus) అనేరాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఆయన కుబేరుడు, బలవంతుడు. ఈ 'శామోస్'రాష్ట్రప్రజలు తనఏలుబడికి లోబడి, ఏటేటా కొంతకప్పము కట్టుకోడానికి ఒప్పుకోవాలనీ, లేకపోతే యుద్ధానికి వచ్చి నలిపివేస్తాననీ వర్తమానం చేశాడు. అటువంటి సందర్భంలో శామోస్‌ప్రజలు తమ తరుఫున రాయబారిగా ఈసపుని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. శత్రురాజు "మనసు నొవ్వకుండ, మనపని చెడకుండ

"రాయబార మీవు సేయవలయు"నంటూ అతనిని లిడియాకు పంపించారు.

క్రీసస్‌మహారాజు ఈసపురూపిని చూచి మిక్కిలి అసహ్యపడ్డాడు. "ఛీ ఛీ – రోత ముండకొడుకు వీడెక్కడ దొరికాడు? ఉప్పెన రాకుండా చీపురు కట్ట అడ్డుపడుతుందా? శామోస్ దేశంమీదికి దండు ఎత్తకుండా నన్ను ఆపడానికి వీడితరమా? వీడి అబ్బతరమా? వీణ్ణి చూస్తేనే నాకు కడుపులో తిప్పుతున్నది, పొమ్మను అవతలికి" అని కసిరికొట్టాడు, ఈసపు నిర్వికారధైర్యధుర్యుడై మందహాసం చేస్తూ, రెండుచేతులూ జోడించి సవినయంగా ఇలాగు ప్రసంగం ఆరంభించాడు.

"దేవరవారు కాస్తసేపు అవధరిస్తే నే నొక్క చిన్నకథ మనవిచేస్తాను. అది విని తమరు ఏమిచేసినా సంతోషమే—"

"ఏవి టాకథ?" అని మహారాజు ఉరిమాడు.

"ఒకచిన్నపిల్లవాడికి, బాల్యచాపల్యంచేత మిడతలను పట్టి చంపుతూఉండడం సరదా. ఒకనాడు ఒక మిడత దొరికింది. దానిని పట్టి చంపబోతూవుంటే, "నాయనా! నీకు నేను ఏమి హాని చేశాను? ఏమి అపకారం చేశాను? నాచావువల్ల నీకు కలిగే లాభం ఏముంది? నన్ను ఎందుకు నిష్కారణంగా చంపేస్తావు? నీకేకాదు—ఎవరికైనా, ఎప్పుడైనా నావల్ల కించిత్తైనా ఏమైనా ఇబ్బంది కలిగిందా? ఆడుతూ, పాడుతూ, ఆటూ యిటూ గంతులువేస్తూవున్న నన్ను చూస్తే నీలాంటి పిల్లకాయలకు వినోదమా? ఇబ్బందా? నిజం చెప్పు, పైకి అనకపోయినా నీలో నువ్వే ఆలోచించుకో, నీకు పుణ్యం వుంటుంది. చంపకు నన్ను ఇలాగు బతకనీ నాయనా! నీకు దండం పెట్టుకుంటాను" అన్నది చేతులు జోడించి, దీనంగా, జాలిగా. పిల్లవాని మనసు కరిగింది— దయారసం ఉదయించింది. "చంపడం ఎందుకు పో! నీమానాన పోయి బతుకు" అంటూ వదిలేశాడు.

ఆ మిడత యెక్కడో దూరాన లేదు. తమయెదుటనే ఉన్నది. నేనే ఆమిడతను. దేవరవారి సన్నిధానమందున్న నాపైని, ఆబాలుడులాగే దయారసం పొలికించమని దీనంగా వేడుకుంటున్నాను. అందచందాలు ఏమీలేని కురూపినే నేను. ఐనా ఒక కంఠమూ, రవంత మాటలాడేశక్తి నాకు భగవంతుడు అనుగ్రహించాడు. నాతోడి మానవసోదరుల మేలుకోసం నాస్వల్పశక్తి వినియోగిస్తున్నాను.

"పెద్దవాళ్లు పిల్లలనూ, బలవంతులు బలహీనులనూ, నోరుగలవాళ్లు నోరులేనివాళ్లనూ, ధనవంతులు పేదలనూ బాధించకూడదు. ఏమంటే, ఒకడు ఎగిరి తాటిచెట్టు మొవ్వని తంతా డనుకుంటాం. వాడి తలమీద కెగిరి తన్నేవాడు మరొకడుంటాడు. ఈతన్నులకూ తాపులకూ అంతువుండదు. నిత్యమూ పోరుతప్ప భూమిమీద శాంతి అనేది ఉండదు. కనుకనే ప్రజాక్షేమమూ, మనశ్శాంతీ కోరే పెద్దలు "లోకా స్సమస్తా స్సుఖినో భవంతు" అనగా లోకంలో ఒకళ్లు మరొకళ్లని ఏడిపించడమూ, వాళ్ల ఉసురు పోసుకోవడమూ, అనేవి లేకుండా, మనుష్యులంతా సుఖంగా ఉండేటట్టు అనుగ్రహించు భగవంతుడా! అని ప్రార్థిస్తూ ఉంటారు. మా ప్రజల తరఫున నేను తమరినీ, భగవంతుణ్ణీకూడా అదే విధంగా తమ శ్రేయస్సూ మాక్షేమమూకోరి ప్రార్థిస్తున్నాను." అని తన రాయబారం విన్నవించాడు. క్రీసస్‌మహారాజు ఈ సంగతులన్నీ మనస్సున బాగా నాటించుకున్నాడు. నిరపరాధులమీద నిష్కారణం దండెత్తి వాళ్ల ఉసురు ఎందుకు పోసుకోవాలి? అనిపించింది; యుద్ధప్రయత్నాలు మానేశాడు. "నీవూ మీవాళ్లూ నెమ్మదిగా బ్రతకండి" అని సత్కరించి సగౌరవంగా ఈసపుని అతడు వీడుకొలిపాడు. దేశస్వాతంత్ర్యానికి భంగంలేకుండా, యుద్ధప్రయత్నాలు జరపించకుండా యుక్తియుక్తంగా రాయబారం నిర్వహించి వచ్చిన ఈసపుమహనీయుని గౌరవార్థం ఆదేశప్రజలు అతని శిలావిగ్రహం చెక్కించి బహిరంగంగా ప్రతిష్ఠచేశారు.

ఈ గౌరవవైభవాలు ఇంకా అతిశయించినవి. ఈసపుసంభాషణామృతం తనివితీర త్రాగగోరి క్రీసస్ మహారాజు అతనిని మళ్లీ పిలిపించి కొంతకాలం తనవద్ద ఉంచుకున్నాడు. అప్పుడే ఈసప్ 'ఎపిలోగ్జ్' అనే గ్రంథం రచించాడు. తరవాత సప్తమునీపా మహాసభవారు అతనిని ఆహ్వానించి ఎంతో గౌరవంచేశారు,

అక్కడనుంచి బాబిలన్ మహాపట్నం ఏలే మహారాజు ప్రత్యుత్థానంచేసి అతనిని పిలిపించుకొని ఎంతో సత్కరించాడు. ఈసప్ తుదకు బాబిలోన్ నగరంలో స్థిరపడ్డాడు.

## ౬
## చరమదశ

ఈసప్‌ను పీడించే దీర్ఘ విచారం ఒకటి ఉండేది అదేమంటే:—అతనిని ప్రేమించేదీ, అతని ప్రేమను గ్రహింపగలిగేదీ—స్త్రీ మాత్రము అతనికి ఎక్కడా కనబడలేదు. ఏకాలంలో అయినా, ఏదేశంలో అయినా, 'కన్యావరయతే రూపం' అన్న న్యాయం చొప్పున చక్కని చిన్నవాళ్లే చూసి ప్రేమించి పెళ్లాడతారు కాని, ఏకన్యలూ ఇటువంటి వికృతాకారుణ్ణి ఎంచి పెళ్లి చేసుకోరుగదా! తాను ఎన్నాళ్లు బ్రతికినా ఘోటక బ్రహ్మచర్యమేగాని గృహస్థాశ్రమస్వీకరణభాగ్యం లేకపోయిందికదా అని మిక్కిలి విచారం పొందుతూ ఉండేవాడు.

తనను స్థానుకూలం చేయగలవాడని నమ్మకుని అతడు తుదకొక పిల్లవాణ్ణి దత్తత చేసుకున్నాడు. పంచప్రాణాలూ వాడిమీద పెట్టుకొని పెంచుతూ వాణ్ణి బాగా వృద్ధిలోకి తెద్దామని ఊహించాడు.

తానొకటి తలిస్తే దైవం మరోవిధంగా చేస్తూ ఉండడమే లోకంలో కనబడుతున్న పద్ధతి. తెచ్చుకున్న దత్తుడు బుద్ధిమంతుడు కాలేదు. సరేకదా, పరమనీచుడూ, విశ్వాసఘాతుకుడూ, పాపాసక్తుడూ అయి, పెంచినతండ్రిసంతకంకూడా ఫోర్జరీ చేసి పీకలమీదికి తెచ్చాడు. అప్పుడు ఈసపుకు ఉరిశిక్ష విధించబడ్డది. అతడు నిర్దోషి అని ఎరిగిన రాజభటులు కొందరు అతనిని చల్లగా, నేర్పుగా, దేశం దాటించేశారు. నిలకడమీద మహారాజుకు నిజం బోధపడి, ఏలాగైతేనేమి, సజీవుడై ఉన్నందుకు సంబరపడి, ఈసప్‌ను సగౌరవంగా తోడితెచ్చి స్వస్థానంలో నిలిపాడు.

ఆకాలంలో డెల్ఫిక్ అనేపట్నంలో ఒక మహావిద్వాంసుడు సరస్వతీపీఠం స్థాపించి శిష్యగణంతో విద్యాగోష్ఠి చేస్తున్నాడని ఈసప్‌కు తెలిసింది. జిజ్ఞాసకలవాడు, కనుక, ఈసప్ ఆపట్నానికి బయలుదేరి వెళ్లాడు. తీరా వెళ్లిచూస్తే అదంతా వట్టి బూటకమనీ, వాళ్లంతా దొంగలనీ అతనికి స్పష్టమైంది. అందుపైని "అమేధ్యకథ" అని ఒకటి వ్రాసి వాళ్లదొంగతనం అంతా బైటపెట్టాడు. ఆదురాత్ములకు ఆకథాకారకుడైన ఈసప్‌మీద కోపంవచ్చి, అతనిమీద కక్షసాధించడానికి మాయోపాయం ఒకటి పన్నారు.

అదెలాగనంటే:—ఆదొంగలు వాళ్ల అధికారంకింద ఉండే ఒక దేవుడిగుడిలో, బంగారపుగిన్నె ఒకటి వాళ్లే తెచ్చి ఈసపుబసలో అతను చూడకుండా దాచిపెట్టి, అతనే దొంగిలించాడని చోరీకేసు బనాయించారు.

ఆరోజులలో చోరీనేరానికి ఆదేశాల్లో మరణదండన విధించేవారు. ఈసపుకుకూడా ఆదేశిక్ష విధించబడ్డది. నిడివిమీద నిజం బైటపడుతుం దని భయపడి, వ్యవధానం ఏమీ లేకుండా వెంటనే ఈసపుని ఒక మహాపర్వతశిఖరం ఎక్కించి అగాధంగా ఉన్న దిగువలోయలోకి తోయించి చంపించేశారు. వాళ్ల అక్కసు తీర్చుకున్నారు.

కల్పితకథల మూలంగా లోకానికి శాశ్వతంగా నీతిబోధ చేస్తూఉన్న ఈ మహనీయుడికి కొసకు ఈ తీరున ఇటువంటి దుర్మరణం ప్రాప్తం అయింది.

మహాపురుషులూ, గొప్ప పతివ్రతలూ, అంతా కష్టజీవులే. వారి చరిత్రలు విషాదచరిత్రలే! మరణములు దుర్మరణములే. ఏఁవిటో యీచిత్రం అనిపిస్తుంది—తరిచిచూస్తే. ఆంధ్రప్రతిభామూర్తి మంత్రి తిమ్మరుసును శ్రీకృష్ణదేవరాయలవంటి ప్రభుసత్తముడు కళ్లు తీయించి కఠినంగా దండించి చంపించాడు.

ఎందరో మహానుభావులను లోకం ఇలా కూనీ చేస్తున్నది. అందులో ఈసపుమహాత్ముడు ఒకడు. అతని మరణానంతరం నిజం బయటపడింది. విద్యాపీఠపుదొంగలనుకూడా ఉరితీశారు. అయితేమాత్రం? చెయ్యి కాలినతరువాత ఆకులు పట్టుకొన్నట్టు గతజలసేతుబంధనం. ఈసపుభౌతికదేహం మళ్లీ వస్తుందా? అతని యశోదేహం, ఎప్పుడూ ఉండేదేకదా!

# నీతిపద్యమాల

శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులు

ఇంటిగుట్టు పరుల కెఱిఁగించుటే దాని
నాశమునకుఁ గారణ మగు; నింటి
గుట్టుచెడుడు లంకకుం జేటు మూఁడెగా!
నమితభీమ విశ్వనాథరామ!

పిల్లివంటివారు పెక్కు రుందురు గాని
కుక్కవంటిమనుజుఁ డొక్క డయినఁ
గానిపింపఁ డేమి కలియుగధర్మమో! న.

యుగము ననుసరించి భగవంతుఁడే యుండఁ
గడమవారిమాట నుడువ వలెనె?
తండ్రిజాడఁ జనుట తనయులవిధిగదా! న.

శోక మడఁచి, భీతి రాకుండఁ జేసి, వి
శ్వాసి యగుచుఁ బ్రీతిపాత్ర మయిన
యతఁ డొకండె కాక యందఱు మిత్రులా? న.

మొగము నెదుట మధురముగ మాటలాడుచు
వెనుకనుండి హాని వెదకువారు
మిత్త్రరూపులైన శత్రువుల్ కాకేమి? న.

పుణ్యపాపములను పుట్టినకతమున
మంచిచెడుగు లుండు మానవులకు;
చెడుగువిడిచి మంచిచేకొను యోగ్యుండు; న.

ఫలముఁ గోరకుండఁ బని చేయు మీ వంచు
హరి విధించెఁ దొల్లి యర్జునునకు
నట్లు చేయుజీవుఁ డర్జునుం డౌఁగదా! న.

మంచిముత్యములను మించి మెఱయుమాయ
ముత్తియములు మొట్టమొదటఁ గాని
పోనుపోను వానిపోఁడిమి తెలియురా! న.

గాత్రమునకుఁ గేలుఁగవ చందమునను చ
క్షులకు రెప్పలవలెఁ గోరకుండ
మేలు చేయువాఁడె మిత్త్రుండు నిజముగా; న.

పిల్లిప్రేమ, కులటప్రేమయు, వేశ్యల
ప్రేమ పుడమిఱేనిప్రేమ యొకట
నిమిషమాత్రమైన నిలువ దదేమయా? న.

దైవ మంత్ర తంత్ర దైవజ్ఞ గురు విప్రు
లందుఁ దీర్థమందు మందునందు
నమ్మకమునుబట్టి నడచురా కార్యముల్! న.

మేరువునను తృప్తి లేకనివాఁ డైనఁ
బట్టెఁడన్నమునను బడయుఁ దృప్తి
కాన దాన మన్నదాన మొక్కఁడెచుమా! న.

అప్పు చేయుతండ్రి, అసతియౌ తల్లియు,
ప్రియము లేనిభార్య, వినని కొడుకు
పూర్వజన్మపాపమునకు ఫలములయా! న.

ఒక్కదాని కిద్ద ఱక్కఱపడినచోఁ
బ్రాణహానివఱకు వచ్చు నౌను;
పూటు చేసికొనరె? సుందోపసుందులు. న.

నిన్న చిలికినట్టి నీరుమజ్జిగ - ఉప్పు
కలిపి దినముఁ ద్రాగవలయు లెస్స
అమరు లెఱుగనట్టి యమృతమిదేచుమా! న.

ప్రతిదినమును నిమ్మపం డొక్కటి భుజించు
చున్నవారు పున్నె మున్నవారు
వారికంటె నెవ్వ రారోగ్యవంతులు? న.

వంగకాయకూర వరియన్నమును జంట
వాని మెసవుకొనెడివారుఁ గలరె ?
అంద తేమొకాని యాంధ్రులు విసువరా! న.

వచ్చుబడిని మించు వ్యయము చేసెడివాఁడు,
దోడు లేక పోరఁ దొడఁగువాఁడు
రుచులు విడువలేని రోగియుఁ జెడుదురా. న.

ఘోరతపము చేయుధీరుని కైన మ
నమ్ము లొంగె ననుచు నమ్మరాదు!
కౌశికుండు మేనకను వెంబడింపఁడే? న.

లోభి ధన మొసంగ లొంగును; క్రుద్ధుండు
వంగి మ్రొక్కినంత లొంగు; మూర్ఖ
వాని ననుసరించి వర్తింప లొంగురా! న.

కసదరిద్రు లైన పసరాల దగ్గఱ
నెప్పటికిని నోరు విప్పరాదు;
నక్కమీఁద నెవఁడు నారస మేయురా? న.

బాల్యమందుఁ దండ్రి, వయసున భర్తయు
వార్ధకమున సుతులు వారిసుతులు
లొంగితీరవలయు సంగనలకు నింక! న.

పండితులును శౌర్యవంతులు నగుకంటె
భాగ్యవంతు లగుట పరమహితము
పండితుల్ సూరులు పాండవు లేమైరి? న.

గొప్పపదవియందుఁ గూర్చుండి పూజ్యుల
కోపపాత్ర మయినఁ గూలు టరుదె?
నహుషుఁ డింద్రుఁ డయ్యు నాగమై కూలఁడే?

హితులపలుకు మది కనిష్ట మైనను విని
యట్లు నడవకున్న హాని యగును
ఎదురుమాట వినక విలపించెఁ గురురాజు! న.

మంచిమాట లాడు మనుజునిఁ గని మెల్ల
వారు సంతసించి గారవింత్రు
కాన నదియె లెస్స దానికి లోపమా? న.

ఎట్టియాపద తనుఁ జుట్టుకొనిన దేవ
తను స్మరించుచుంట తగును; భీష్ముఁ
డంపశయ్య నుండి హరిని స్మరింపఁడా? న.

మలయమారుతములు మధుమాధవములందు
వీచి మనసుఁ బల్లవింపజేయ
వరుణమారుతములు వడఁగొట్టఁజేయవా? న.

కష్టపడిన సిద్ధి కలుగునో కలుగదో
కలుగుఁగాక దానివలన ఫలము
లేనికార్యమునకుఁ బూనరు ప్రాజ్ఞు లౌ! న.

మొదటనుండి యుండు ముఖ్యులకంటెను
మధ్య వచ్చువారు మాన్యు లగుదు
రమ్మకంటెఁ బెండ్ల మధికురా లౌఁగదా! న.

మొదటినుండి యున్న ముఖ్యులకన్నను
మధ్య వచ్చువారిమాట వాఁడి;
చెవులకంటెఁ గొమ్ముఁగవ వాఁడియౌఁగదా!

ప్రాణతుల్య మైనభార్యను విడవాడి
బ్రహ్మచారి యయ్యెఁ బ్రజలకొఱకు
రామచంద్రువంటి రాజులు గలిగిరే? న.

కలయ వన్నవానిఁ గలుపును విధి మున్నె
డెడయ వన్నవాని నెడయఁజేయుఁ
దలఁచుకొననియర్థములఁ దెచ్చి కూర్చురా!

పుస్తకములయందె పొలుపారువిద్యయుఁ
బరులచేతి కీయఁబడిన ధనము
నక్కఱైనవేళ కంద దందదు సుమా! న.

ఒకటి రెండు చేయ నున్నారు విలుకాండ్రు
కాని రెంటి నొకటి గాఁగఁ జేయు
విల్లుకాఁడు పువ్వువిల్లుకాఁ డొక్కఁడే! న.

సోదరుండు చేయుచున్నట్టిపని తన
తండ్రి చేయుచుండుదానిఁ దుదకు
వైరి చేయుపనియు మారుఁ డొక్కఁడెచేయు,

రంభమనుమరాలు రాణియై యుండినన్
వారకాంతపంచఁ జేరు మగఁడు
చపలచిత్తుల కది స్వాభావికంబె కా! న.

రాజ్యలక్ష్మి చేరి రసికత నెడఁబాపు
రాచచెలిమి నమ్మ రాదు సుమ్ము!
ద్రుపదుఁ డేమిచేసె ద్రోణు నెఱుంగరా? న.

దేహయౌవనమ్ము దిగజాఱుకొలఁదియు
భావయౌవనమ్ము ప్రబలుచుండుఁ
గాన కవికి వార్ధక మ్మెట్లు గలుగురా? న.

అప్పు లిచ్చుకంటె నప్పులు గొనుకంటె
నప్పు లేక యుంటె గొప్పఁదనము
అప్పు లేనిపురుషు లరుదుగా నుండు రా! న.

ఒకరికల్మి చూచి ఓర్వఁజాలక యేడ్వ
నొక్కకన్ను పోవు నిక్కముగను
తనదు లేమి కేడ్వఁ దక్కినదియుఁబోవు! న.

పాలు పోఁగిన వని పనికత్తియను చంపి
యర్ధలక్ష్మితోడ నాత్మతోడ
సర్వనాశమయ్యె షణ్ముఖంగ్రామణి! న.

ఒరుల యింటియందు నున్నప్డు తప్పక
మూఁగి గ్రుడ్డి చెవుడు మూఁడినట్లు
సంచరించువారు సర్వోత్తములుసుమా! న.

పూర్వజన్మమందు పూఁపించినదియె యీ
జన్మమందు ఫల మొసంగు మనకు
వందుకొనని దెట్లు వచ్చునురా? మామ! న.

అమ్మ లేదు పెండ్లమా? నిరంకుశురాలు
కొడుకు మాట వినఁడ యడవి కేఁగు
మట్టియింటికంటె నడవియే మేలురా! న.

ఆఁడుదానిచేతి కబ్బిన ధనలక్ష్మి
యంతరించినట్లు మాయ మగును
ఇద్దఱాఁడువారి కొద్దిక కలుగునా? న.

కలిగినపుడె కష్టకాలమ్మునకుఁ గొంత
నిలువ యుంచుకొనెడి తెలివె తెలివి
అన్నిరాత్రులందు వెన్నెల యుండునా? న.

గారవముగ నీదు కంఠసీమను వేయఁ
బడినయట్టి నీతిపద్యమాల
తెలుగువారి కంఠముల నుండఁగలదురా
విశ్వనాథరామ! విజితభీమ!

---

# కృతి సమర్పణము

శ్రీ రావూరు వేంకటసత్యనారాయణ

"ఆషాఢమేఘాలమాటున దాగి తొంగి చూచే అర్ధచంద్రుడిలాగు, నిమీలితనేత్రాలతో నా కామె దర్శన మిచ్చింది. పచ్చిపోకలు పండుటాకులు, దోసిట బట్టి నా కర్పించి, మంచిగంధం, మల్లెదండలు పూలసజ్జలో వుంచి నా కందించి నమస్కరించింది

"అస లెవరండీ ఆవిడ ?"

"విను లలితా! చెపుతున్నాను. తరువాత ఆవిడ నాదగ్గిర వున్న కుర్చీలో కూర్చుని ఇలా చెప్పింది. మీరు కవులు! నిరంకుశులు! జగత్కల్యాణానికి, దేశాభ్యుదయానికి కారణభూతులు. భాషాసామ్రాజ్యానికి పట్టభద్రులు కవులకలం తుప్పుపడితే కాలచక్రపు ఇరుసే కదలదు. ప్రకృతి పస్తుపడిపోతుంది. మీరంతా కన్నుతెరచి కలం పుచ్చుకోకపోతే సృష్టికర్తకే కునికిపాట్లు వచ్చేటట్లున్నాయి. తొందరపడండి! లేవండి—కావ్యాలు వ్రాయండి! కథలు సృష్టించండి. ఆకలి డొక్కల్లో చీకటి కళ్లల్లో, చిట్లిన గుండెల్లో మీ కవిత్వపు జల్లులు కురిపించండి. పలుకుల రాణిని పల్లకీలో ఊరేగించండి—"

"ఈ ఉపన్యాసమంతా ఎవరిదండీ !—"

"నేనన్నా కదా ! అమ్మా! నువ్వు లక్ష్మీదేవివో, సరస్వతీమాతవో నా కర్థంకాలేదు. నీపలుకులు నా హృదయంలో అజ్ఞానపు కోటను పడగొట్టి జ్ఞానపీఠాన్ని ప్రతిష్ఠించినాయి. ఇది కలికాలం. కవులను ప్రతిభను గుర్తించే ప్రజలు గౌరవించే ప్రభువులు కరవయ్యారు. కవులవంక చూచినవారికి శిక్ష! సంఘం వారికి పిచ్చివా రని బిరుదు ఇస్తుంది. పత్రికలకు పంపితే పరాభవం-ఇలాంటి కాలంలో వ్రాసి ఏమిచేసేది తల్లి? అయినా నీఆజ్ఞ" అని ప్రార్థించాను."

"ఏదో తేనెతుట్ట కదగొట్టారుమళ్లీ. అస లెవరితోనండీ ఈ రగడంతా?"

"అదే చెప్పుతున్నా లలితా!" నా మాటలు విని ఆవిడ తనలో తను నవ్వుకుంది. కాసేపు నావంక తేరిపారి చూచింది. ఆమె చూపులు కలువలదండలై నాకంఠాన్ని అలంకరించినయి. ఆమెచిరునవ్వులు సేసలై నాశిరస్సున రాలినయ్. ఆమె లేచి తనచేతులు నా తలపైవుంచి ఇలాదీవించింది. నువ్వుఅమాయకుడవు. లోకంలో నీవొకమార్గం, ఒకఆదరణ చూచుకొని కవిత్వం వ్రాయడ మేమిటి? లోకాని కొక క్రొత్తమార్గం నువ్వు చూపించాలి. నీ అడుగులలో అడుగువేస్తూ ప్రకృతి వెంటపడి లేగదూడలాగు పరుగెత్తుకొని వస్తుంది. అధైర్యం పనికిరాదు. ఒక గ్రంథం వ్రాయి - ఆదరించేవారూ - అంకితం అందుకొనేవారూ కరవుకారు. నువ్వు గ్రంథం వ్రాయి. అంకితం పుచ్చుకునేవారు సిద్ధంగానే

వున్నారు. వెంటనే గ్రంథం అచ్చువేయించు. వారికర్పించు-లోకంమెచ్చుకోలు లందిస్తుంది. త్వరపడు-అంటూ ఆవిడ మన తోటలోకి నడిచివెళ్లింది.

"తోట కూడా ఒకటి వేయించా కేమిటి నాకు చెప్పకుండా?"

"విను లలితా! నేనూ ఆ తోటలోకి పరుగెత్తాను. పిట్టలు చెట్లమీదనుంచి లేచి నప్పుడు కొమ్మలు కదలి నాతలమీద పూల వర్షం కురిసింది. ఆమె మందార చెట్లలోకిపోయి మాయమైంది. ఆకొమ్మల్లో కొమ్మేఅయిందో, పూవులలో పూవే అయిందో, పున్నం వెన్నెట్లో అలగా నేమారిందో అర్థంకాక తిరిగి వచ్చాను."

"పిచ్చి కుదిరింది. రోకలి తలకు చుట్ట మన్నట్లున్నది కథ! ఈ నిద్రకళ్లతో ఎంత సేపని ఈ మొదలు చివరా లేని 'మొల్ల' రామాయణం వినేది; ఆ తూరుపుదిక్కున తొగరుమబ్బులలోనుంచి తొంగిచూచే సూర్యదేవుడికి వినిపించండి మీకథ. అస్త మానం వింటాడు - కావాలంటే - రోజూ వచ్చి వినిపోతాడు. విసు గతనికి వుండదు."

"లలితా! అయిపోయింది. రాత్రి కలలో జరిగిన కథ ఇది. కథలు కల్లలు కావు. గ్రంథ రచన ప్రారంభమాత్రం దీనాడే!—కృతిసమ ర్పణ మహోత్సవాని కెదురుచూస్తుంటారట. సరస్వతీదేవే నాకు ప్రత్యక్ష మైనపుడు-ఇక సంశయ మెందుకు?

"అజ్ఞాతంలో వున్న ఒక మహాకవికి అభ్యుత్థానమిచ్చి కవిత్వపీఠానికి ఆహ్వానించి విశ్వవిపంచి శ్రుతులు కదలించి, సరస్వతీదేవి చరితార్థత చెందింది. ఏదీ మీ తొలిగీతం?"

౨

కాలుతెగిన గొర్రెపిల్లనడకలాగు కలం పరుగెత్తడం లేదు లలితా! మొదటవున్న ఉత్సాహం, ఇప్పుడు కనిపించడంలేదు. పం తానపడి ప్రాకులాడుతోంది హృదయం. కాస్త టీ కాచి తీసుకురాగలవా?

"దేవిని స్మరించండి, ఆమె వ్రాయి స్తుంది– లేదా వ్రాసిపోతుంది. గ్రంథం మొదలు పెట్టినప్పటినుంచి కళ్లల్లో వత్తులు వేసుకొని కూర్చున్నారు. కాని పాపం, నిరుపహతిస్థలంబు—"

"లలితా! ఆగు. ఒక క్రొత్తభావం తట్టింది. ఈ పరుగులో పదిపుటలన్నా దాటు తవి. త్వరగా టీ కాయి లలితా!"

"అలాగే కాస్తాను వ్రాయండి! పాపట బొట్టులో ముత్యాలు కూర్చినట్లు... దేవుని కంఠమాలగా బొడ్డుమల్లెలు కూర్చినట్లు... పసిపాప బుగ్గల్లో పాలవెన్నెల నురుగులు విరిసినట్లు_"

"లలితా! అందిస్తూవుండు ఉత్సా హాన్ని—సౌందర్యదేవత సరస్వతీదేవి చేరి ఒక చేయి పట్టుకున్నట్లున్నది నా కిప్పుడు... గ్రంథం త్వరలోనే పూర్తి అవుతుంది. తరు వాత కృతిసమర్పణ."

"మరచిపోయినానండి! క్షమించాలి... పంచదార నిండుకున్నా దివ్వేళ. పనిదాన్ని వెళ్లమంటే పసివాడికి సుస్తీగా ఉన్నదని పరుగు తీసింది. ఈలోగా సైకిలు వేసుకు వెళ్లిరండి... పాలు వెచ్చపెట్టా నీలోగా. అందుకనే నిరుపహతి స్థలంబు...అన్నాడు."

౩

" కొమరుముత్యాలు కుంచాలతో కొలిచి ఇవ్వవచ్చే పద్యాలకు. వాగ్దేవత శృంగారగానం కరగి వాహినిగా మారి నట్లున్న దీ రచన... తప్పకుండా అచ్చు వేయించండి మొగలిపొట్లాలలాగు అమ్ము డౌతవి. గ్రంథం పే రేమి పెట్టదలచారు?"

"బహుశః స్వప్న జ్యోత్స్న... అవుతుంది. అంతా స్వప్న మే కాదూ?"

"అవునవును. ఆ వెన్నెల నిగ్గు లెన్నో వున్నాయి రచనలో . . ఎప్పటికి కావాలి గ్రంథం?"

"మీా రెంత తొందరలో అచ్చువేసి ఇస్తే అంత మేలు . . ఆలస్యమైతే అగరునూనె కూడా ఆముదపువాన నే వేస్తుంది."

"ఆలాగే! ముందు మీాపనే అయిపోయే టట్లు చేస్తాను...ఫోటోకూడా వేయిస్తారా?"

"అదీ మీారే చూడండి. అంతా మీాదే భారం. పుస్తకాలు చేతికందియ్యడం. . సొమ్ము స్వీకరించడం...అలాటి భారం మీామీాద వుంచవచ్చునని భావాలతోనే ఈ కార్యాల యంలో అడుగుపెట్టాను."

"అలాగే! దానికేమి లెండి. పదిహేను రోజులలో గ్రంథాలు అందుతవి. మీా కృతి సమర్పణ సర్వం సిద్ధంగా వుంచవచ్చు."

"అంత ధైర్య మీాయగలిగితే ఇంకేం కావాలి? వెళ్లివస్తాను. "

"ఆగండి మీా ఫొటో తీసుకుంటాం"

౪

"లలితా! గ్రంథం అచ్చుపడి ప్రెస్‌లో నిద్రపోతోంది. కృతిస్వీకారాని కెవరూ కను పించలేదు. ప్రెస్ మేనేజరుగారు తొందర చేస్తున్నారు. పెట్టిన గడువులు నాలుగింటిని గడపలలాగు దాటివచ్చాను. ఇవ్వాళ, రేపు చూచి, తనే వాటి నెవరికో, వచ్చినంత ధరకే అమ్మి సొమ్ము జమకట్టుకుంటానని ఆయన చెప్పాడు ఇవ్వాళ. కర్తవ్యం నా కేమీా తోచడంలేదు. కాకిపుండుమీాద గ్రద్దవ్రాలి నట్లయింది లలితా చివరకు"

"అధైర్యం పడకండి. దేవిపలుకులు వృథా కావు. ఎవరో ఒకరు మీా కడ్డుపడక పోరు. ఇంకా ప్రయత్నించండి. వీలైతే ఒక ప్రకటన కూడా చేయండి."

" అదీ చేసి చూచాను లలితా! వంద పుస్తకాలు వేరే ముందుగా తీసుకొని పెద్ద లందరికీ పంపాను... జవాబులు వచ్చినంత వరకు నిరాశను మూట గట్టుకొని వచ్చి నాయి..."

" ప్రెస్ మేనేజరుగారిని కొంతకాలం ఆగ మని చెప్పి చూడకపోయారా? "

" చెప్పాను సర్వవిధాలా ప్రయత్నిం చాను. ఆయన అలా తేలికగా వప్పుకునే టట్లా లేడు. కావ్యమాధుర్యంవిలువ వారి కేం కావాలి. బిల్లు ముట్టితే చాలు!"

" పోనీ! అంతగా అయితే పుస్తకాలు ఆయన్నే తీసుకోమనండి — అంకితం కూడా ఆయనకే ఇవ్వండి. దేవిదయ ఎలా ఉన్న దో అలా అవుతుంది."

"లలితా ...అది యెలా సాధ్య మవు తుంది? పవిత్రమైన కవితావస్తువును, అంత తేలికగా అంత నీచంగా, త్యజించిన పాపం వేయి నల్లత్రాచులై నా మెడను చుట్టు కోదూ."

"గత్యంతరం లేనప్పుడు, గన్నేరే కల్ప వృక్షం: కాలం, కర్మం తప్పివస్తే 'ఆ' అన వలసినచోట 'అహా' అనాలి. చేయి కాలిన తరువాత ఆకులు వెతకడం దేనికి? ముందే తొందరపడితే మంచిదికాదూ?"

"అంతా ఆ దేవి దయ."

*

"కవిగారూ! మావారు పైకంకోసం మిమ్మల్ని నిర్బంధించినందుకు క్షమించండి. వ్యాపారంలోపడ్డవాళ్లకు వేపాకు తాంబూల మని శాస్త్రం ఉండనే వుంది. ఆయనమాట అలా వుంచండి. ఇవ్వాళ మీతో ఒక మాట చెప్పదలచి పిలిచాను. దానికి మీరు అంగీకరిస్తా నంటే-"

"చెప్పండి; నా కెందు కమ్మా కోపం— సొమ్ము ఇవ్వలేకపోవడం లోపం నాది గాని మేనేజరుగారి దెందు కౌతుంది?"

"సొమ్ము మాట వదలివేయండి బాబు! ఆ బాకీ మీరు తీర్చేశారనుకోండి—లేకపోతే మీంతరఫున నేనే ముట్టచెప్పా ననుకోండి. సొమ్ము విషయంలో ఆయన చేసిన ఒత్తిడి ఒక అన్నో, తమ్ముడో తెలియక చేసినపని అనుకోండి. నామాట వినండి"

"అలా ఎలా అనుకోగలనమ్మా! తెచ్చి ఇస్తాను. ఇవ్వాళతప్పితే రేపు. ఋణం మరో లోకంలోకి పోయినా తప్పేదా తల్లి."

"అది వదలి నామాట వినండి బాబు! మీగ్రంథం ఈరోజున చదివించి విన్నాను. గ్రంథం చదువుతూవుంటే నారోగపుగుండెల్లో రుధిరజ్వాల లుప్పొంగి తరంగా లైనాయి. ఆనందరహితంగా, ఏదో ఒక కాంతుతో ఈలోకంలో ప్రాకులాడుతూన్న నాజీవితాని కీగ్రంథం ఒక పూలతెప్పగా కనుపించింది. ప్రేమసామ్రాజ్యంలో - పనికిరాని బంటుగా పడివున్న నాకు మీకవిత్వం కమ్మని గానమై వినిపించింది. కష్టాలలో తీపి సుఖంలో సారు జోడుగుర్రాలై పరుగులెత్తినాయి నాకళ్ల ముందు. నాజీవిత స్వప్నంలో స్థిరమైన ఒక జ్యోతి గోచరించింది. అబ్బా!"

"శ్రమపడకమ్మా! నాపాలిట 'వెతుక బోయిన తీగ'వైనావు. మీ హృదయంలో గల జాలి, రసపిపాస, ఈ కవిత్వానికి కానుక లైనాయి. నాకలం ధన్యమైంది. ఒక్క హృదయానికైనా ఒడ్డులు వొరసుకొనే ఆనందాన్ని అందింపకలిగింది నా కవిత్వ మన్నమాట కూడా విని నిజానికి నే నింకా బ్రతుకగల ననుకోలేదు. ఈ సంతోషంతోనే నా కన్నులు మూతపడితే కమ్మని ఆశ ఒకటి నా వెంట పడి స్వర్గసీమల్లో దింపివస్తుందేమో తల్లీ!"

"నా కథంతా నిరాశావీచికలతో నిండిన ఒక తుపాను. యౌవనపు ఓడ తెర చాప లెత్తి జీవితసాగరంలో ఒకఘడియ ప్రయాణించిందో లేదో ఇంతలోనే ఈ రుగ్మతాపిశాచి సన్నావరించింది. కురూపిని చేసింది. శుష్కజీవిని చేసింది. అప్పటి నుంచీ ఈ రోగపుమంచమే నా ప్రపంచం. ఇదే బ్రతుకు. ఇక చాలాకాలం బ్రతకడం అసంభవ మని ఒకవార్త నా చెవిలో ఇల్లు కట్టుకొని పలుకుతోంది. ఇదివరలో నా కంటికి దూరంగా కనుపించే చీకటితెరలు నా దగ్గఱకు జరిగివస్తున్నాయి. నాజీవితలత చిగిర్చినట్లుగా ఒక ఆశ మెఱుపుగా ప్రకాశించిం దీగ్రంథంలో. చిట్లిపోయిన ఈ మూగ

వీణమీద చిన్నిచేతు లేవో కదలి గంధర్వ గాన మాలపించినట్లున్నది. ఈ గ్రంథాన్ని నా కంకిత మివ్వండి. దానిని మిగిలిన జీవిత మంతా గుండెలమీద దాచుకొని బ్రతుకు తాను."

౬

"పూర్వజన్మసుకృతబల మేదో నన్నీ గ్రంథాన్ని వీరికి అంకిత మీయవలసిం దిగా పర్వరచి వుంచింది. కవిత్వకన్య ఈ యమ గుండెల్లో పట్టుపాన్పులమీద పవ ళించివుంది. ఈ గ్రంథంతో ఈ ప్రేమ హృదయానికి వ్యజనసేవ చేయడమే నా కోరిక. కాలం మారింది. కవులు అస్పృశ్యు లైనారు. గ్రంథాలు బలహీనంగా పరిణమి స్తున్నాయి. ఈ నిరాశలో ఈయమ ఒక ఆశాజ్యోతి నా ముందు అవతరించింది—ఈ పవిత్రహృదయానికి అంకితంగా, ఈమెజీవి తాని కుంకుమగా, ఈమెరసాత్మకు ఉకుగ రగా ఈ కావ్యం సమర్పిస్తున్నాను.

(సభలో హర్ష ధ్వనులు)

"ఈయమ కవిత్వమూర్తి! నాకు కలలో కనుపించి నన్నీ కావ్యరచనకు ప్రోత్సహిం చిన సరస్వతీదేవి శుష్కచ్ఛాయలే ఈమె లో గోచరిస్తున్నాయి. అందువల్లనే ఈమె కీ కుసుమదామం అర్పిస్తున్నాను.

(సభలో చప్పట్లు.)

"నా గ్రంథరచనకు ఒక పవిత్రహృద యం బంగారుపంటలు పండించుకున్న దని విన్నప్పుడు నాకు కలిగిన ఆనందం గర్వా నే నెలా చెప్పగలను ?

(సుకృతం, సుకృతం.)

ఈ కావ్యంలో గల పద్యా లన్నీ అన్ని మహాకావ్యాలై వెలసినా ఈమె స్వీకరించ దానికి అర్హత కలిగివుంది. యౌవనపు మిసమిసలు లేక ఆరోగ్యభాగం కోల్పోయి, శుష్కమైన అస్థిపంజరంలో పడివుండి ప్రపం చపుదృష్టిలో అభాగ్యపుజీవిగా పరిగ ణింపబడే హృదయంలోకూడా అనంతమైన జ్యోతీ, వెలుగూ— విశ్వాన్ని ముంచెత్త కలిగేది వున్నదని రూపించడమే ఈ కావ్య సంకల్పం.

(సభలో కోలాహలం)

"కొన్నిపద్యాలు మచ్చుకు చదివినవి విన్నారు మీరు. ఇప్పుడు కృతిపతిగారు కొద్దిగా ముచ్చటిస్తారు. ఒక్కమాట - అనా రోగ్యంతో కాగితపుపడవలాగు బలహీనమై వున్నా వీరీ ఉత్సాహ సమయంలో, సంతో షాన్నే బలంగా స్వీకరించి వచ్చారిక్కడకు. వారి ఉపన్యాసం శాంతంగా విని ఆనందించ వలసివున్నది."

(చప్పట్లు-సందడి)

"ఈ మహోత్సవ సమయంలో నేను మాట్లాడడ మనేది - సాహసమే అయినా - అవసరమైన పని అయింది. నాలో వున్న ఉత్సాహం ఉద్రేకం - నన్ను నిలబెట్టకలిగి నాయి మీముందు. ఈ కావ్యాన్ని నేను అంకితం తీసుకోవడం చంద్రుణ్ణి తలపువ్వుగా ధరించడమే అవుతుంది. కాని ఇది నాచివర కోరికను తీర్చుకోవడమే అవుతుంది. నాజీవిత చ్ఛాయలు-కవిగారు సెలవిచ్చినట్లు నామూగ వీణశ్రుతులు తిరిగి మీటినట్లుగా ఈకావ్యం లో చిత్రించినకొన్నిభాగాలు నాకు తోచి నవి. ఈశుష్కజీవితంలో పొడచూపిన నిరాశ, దైన్యం, దౌర్భాగ్యం, వడగాడుపులు అన్నీ ఈ రెండుఅట్టలమధ్య ఒక క్రొత్తవెలుగును పోగుచేసుకొని దాగివున్నాయి. జీవితంలో

భాగస్వామినినిగా వెలసి-రవ్వంతసౌఖ్యాన్ని, సహాయాన్ని ఇవ్వలేకపోయిన నేను నా స్వరూపంగానే ఈగ్రంథాన్ని నా భర్త కర్పించి నిష్కృతి పొందదలచాను. ఈగ్రంథాన్ని నా కంకిత మిచ్చిన కవిగారిని తిరిగి వేయి సారులు అభినందిస్తున్నాను తప్పలేదంటే— ఆశీర్వదిస్తున్నాను. కావ్యవస్తువును, ఔచిత్యాన్ని, రసపోషణను గురించి మాట్లాడాలంటే నాకు బలం చాలదు. నాశరీర మంతా భాంగరమైపోతున్నది.పొంగిపొరలే సంతోష సముద్రతరంగాలలో నే నొక పూవు నైపోయాను. నేను కృతిభర్త ననే వాక్యం ఎదురైన వేల్పులకు వినిపిస్తూ, దీనిలో పద్యాలు వారికి చదివి వినిపిస్తూ... పూలమెట్లమీద ప్రయాణిస్తూ పోగలను... ఇంతకన్న ఈ సమయంలో నేనేమి చెప్పగలను...కృతికర్తకు, నాభర్తకు... సభాసదులకు మరియొకసారి నమస్కరిస్తున్నాను. ఈ కావ్యాన్ని నాకళ్ల కద్దుకుని - మీ సెలవు పుచ్చుకుంటున్నాను.

---

# కంకరకూలి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణమూర్తి

మండు టెండలు జాజ్వల్యమానము లయి
అదరు లుమి సెడిమిట్టమధ్యాహ్న వేళ
లందు, వెన్నెలలో నిల్చినట్లు నిలిచి
పణుగుల పగుల్చుకూలి! యెవ్వడవు నీవు?

కంకరాల్తేరు నీయంగకములనుండి
కాల్వలౌచు ముచ్చెమటలు కారుచుండె,
మిటమిటరగుల్చు బీరెండ మెయికి దాకి
బొగ్గువోలె నీదేహము పొలుపు దప్పె.

గొడుగునీడను నీడు బుజ్జితడు చిన్నారి
పొన్నారినుదుల దోబూచులాడ,
లేచియాడెడికోడెత్రాచుపడగవోలె
శిర మెత్తి పసిబిడ్డ చిందులాడ,
ఉక్కుసుత్తెను రాలు టక్కుటక్కన మోదు
ఆలి నీసరస నూసాడుచుండ
తట్టలో కూటిముంతలసువాసనకు, నీ
గలు మూగి సెలవెట్టి గొలుకుచుండ
గుప్పుగుప్పున పొగ చిమ్ముకొనుచు నోట
అడ్డపొగచుట్ట యూన మాటాడజేయు
సకలదేహము ధూళిధూసరిత మవగ
బండలను పిండిచేతు వెవ్వండవోయి?

పాప మాబిడ్డ చింకిరిపాతలోన
పొరలి తెగపోరు పెట్టు నిద్దురకు వచ్చి,
నోరు తడియారిపోయెనేమొ రవంత
చనుగుడుప పంపు మింటిదానిని పనాపి.

కాయ దేలునీకర్కశకరములోన
ఎన్నికొండలు పిండి కానున్నవొక్కొ?
తరుగునా అవి? నీకష్టదశలు కనక
దిన దినము పాపమట్లు వర్ధిల్లుచుండ.

ఆతపోగ్రతకు దేహము కందు ననుచు, నం
గత్రాణముగ కంచుకము ధరించి
వడగాడ్పుచూపు సెబ్బర దెబ్బనీ యెండ
ననుచు నేత్రత్రాణ మమరిచికొని,
అడుగుమోపిన కాలితోడు గూడు ననుచు, పా
దత్రాణ మొండు మెత్తనిది తొడిగి
తలకు వేడెక్కి వేదన పుట్టునని, శిర
స్త్రాణ మిమ్మైన వేష్టనము చుట్టి
అంతతో దృష్టిపడక సర్వాంగరక్ష
కాతపత్రము బూని పో నడల మేము
ఉడుకుటెండలు పుటపాక మిడెడివేళ
గోచిపాతరాయుండవై కుములుచుందు.

ఇన్ని రక్షణోపాయము లున్న మాకు
రోజురో శేవో రోగాలు రొచ్చులో గద;
ప్రకృతికి శరీర మర్పించి పరగునీదు
దేహ మున్నది వజ్రదేహంబుకరణి.

నవరసపదార్థములు తినునట్టి మేము
ఇట్టు లుంటిమి రోగాలపుట్టల మయి,
గంజియంబలిత్రావి యాకలి నణంచు
కొన్న నీవుంటి పిడుగుముత్తన్న పగిది.

పగలు పగలంత చెమటూడ్చిపడెడినీ శ్ర
మమ్ము పైవారి యినుపపాదమ్ము లాని
సంచరించునుద్యోగిపిశాచములకు
ఒక'సలాం'చేయలే వమాయకుడ నీవు,

విసపుటాకలిచిచ్చుతో వేగి మండు
నీకు జానెడుపొట్టయే లేకయున్న
ఏకుటీరమునందొ హాయిగ వసించి
కులుకుదుగదోయి, చీకుచింతలకు తొలఁగి.

ఆలియు బిడ్డపాప లిటు
లల్లనాడగ పొట్టకూటికి, కే
జోలియు సొంటి లేకయె, ని
జోదరపోషణ సల్పుచున్న, ఓ

కూలి! మఱేదో వృత్తి నమ
కూర్పక దర్విధి జాలిమాలి, యీ
రాలు పగుల్చువృత్తి యిడె
నా! యని డెందమునందు గుందెదర్.

కాని యొకమాట; రెక్కలకష్ట మిట్లు
తెచ్చికొన్నది హాయిగా తిని సుఖించు
మంతెకాని, దొప్పెడుకల్లు కానపడితి
వేని నీయిల్లు గుల్లరా కూలివాడ!

---

# జగత్తు మిథ్య

శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి

నాయాత్మ, ఆత్మయే నాకు సర్వమ్ముఁ,
గాయ మే మౌనో లక్ష్యం బేమి నాకు?
ఇందందుఁ గొట్టాడనేని, భ్రమించినను,
నేను స్వాతంత్ర్యవినిర్మలాత్మకుఁడ,
ఉష్ణసంద్రమ్ములో నొప్పారుచురగ
నీబొందె నిట్టట్టు లెగురఁగానిమ్ము
మీఁదికో ప్రక్కకో మిట్టాడనిమ్ము
రండు సుఖములార! రం డార్తులార!
నాకు మీ రిద్దఱుఁ సరిసమానంబె.
ఊసరక్షేత్రాల నుద్యానవనుల
వెలుఁగుచునుండెడు వేవెల్గువేల్పు
అట్లె వెల్గుదు వివిధావస్థలందు.
నీల మున్నతము వినిర్మలం బగుచు
నంభోధినిభమైన యాకాశవీథి
యవ్యాకులంబుగా నలరుచుండుఁ గద
మబ్బులు పుట్టిన మటుమాయ మైన,

మనుగడమైనను మరణంబెమైన
రోగంబె మైన నీరోగంబె మైన
ఎండమావులఁబోలె నెగయునాలోనె
నర్తించుఁ గొనకు వినాశమ్ము నొందు.
జవ్వనం బనియెడు సరళ రేఖయును,
వార్ధకం బనియెడు వక్ర రేఖయును
పుటనంటి నామీఁదఁ బొలుపొందుచిలుఁగు.
జయపరాజయములు సమములు నాకు,
నే స్వతంత్రుండను, నే స్వతంత్రుఁడను,
నే స్వతంత్రుఁడ నొట నెంచ భేదంబు,
గ్రహతతిసూర్య నక్షత్రాంబరముల
దాఁటి యెత్తున నాదు దారమ్ము లేని
స్వాతంత్ర్య మనుగాలిపడగ తా నెగురు.
ఆనందగీతమ్ము లాలపించెదను
మనసార స్వాతంత్ర్యమహిమాన్వితుఁడను,
మిథ్య మిథ్య జగత్తు మిథ్యయే నాకు.

(రామతీర్థస్వామి)

---

# కళింగాధిపతి సామంతవర్మ తామ్రశాసనము

శ్రీ మండ నరసింహం

ఈ శాసనము శ్రీ మ. సోమశేఖరశర్మగారి వలన **The Journal of Oriental Research** అను పత్రికలో ౧౯౩౪-వ సం॥ ప్రచురింపబడినది. కళింగదేశ చరిత్రయం దిది ముఖ్య మగుటచేతను, శ్రీ శర్మగారిచే నిరూపింపబడిన కొన్ని విషయములు పునర్విమర్శనము గావించుట యవసర మని తోచుటచేతను శాసనపు రేకులను శ్రీ బలగ బావాజీగారివద్దనుండి తెప్పించి ప్రతిబింబములదీయించి వానితోబాటు నీవ్యాసమును ప్రచురింపబూనుకొంటిని.

శాసనపురేకులు దొరికిన స్థలవివరణము, లిపి, వ్యాకరణవిశేషములు, లేఖకుని స్ఖాలిత్యములు మొదలగు సంప్రదాయసిద్ధాచారములను విడనాడి, ముఖ్య విషయ విమర్శనమున కుపక్రమించెదను

ఈ శాసనము కళింగాధిపతి యగు సామంతవర్మ మహారాజుచే నీయబడినది. ఈతడు మహేంద్రాచల నివాసియగు శ్రీగోకర్ణేశ్వరస్వామిభక్తుడని శాసనమందలి రెండుమూడు పంక్తులవలన తెలియవచ్చుచున్నది. ఈ మహేంద్రాచలము తూర్పు సముద్రతీరమున విశాఖ పట్టణమండలమందలి మందసాసంస్థానమున నున్నది. దీనిపై స్థాపింపబడిన గోకర్ణస్వామి 'గాంగ' వంశపు కళింగరాజులకెల్లను తరువాతి 'గంగ' వంశపు రాజులకును ప్రధాన దైవతము. బహుశా పూర్వ గాంగ వంశపుకళింగరాజులలో నొక డీదేవాలయమును నిర్మించి యుండుటచేత తరువాతి కళింగాధిపతుల కది ముఖ్య దేవతారాధన స్థానమయ్యెను.

సామంతవర్మ కళింగాధిపతి, మహారాజబిరుదాంకుడు. ఈత డీశాసనమున లోహశృంగారవిషయ సంబంధమగు షేరవగ్రామమును అశ్వత్థచ్ఛేదసహితముగ నగ్రహారముగా నొసర్చి నలుగురు బ్రాహ్మణులకు దానముచేసెను. ప్రతిగ్రహీతలు భారద్వాజసగోత్రీకులును వాజసనేయశాఖీయులునగు (౧) ఈశశర్మ, వానిపుత్రులగు (౨) దేవశర్మ (౩) రవిశర్మ (౪) దివాకరశర్మలు. ఈ దానకాలము కార్తికదిన ౩౦ అని శాసనమున దెలుపబడినది. శాసనము శ్వేతకాధిష్ఠానమునుండి యొసంగబడినది.

ఇందు విమర్శింపవలసినవిషయము లనేకములు గలవు. తొలుదొల్త రాజధానియగు శ్వేతకాధిష్ఠానము నిరూపింపబడవలయును. తరువాత నగ్రహారప్రదాతయగు సామంతవర్మస్థానము గాంగవంశమున చూపవలయును. లోహశృంగారవిషయమును అందలి ప్రదత్త గ్రామములు నిరూపింపబడవలెను. ఈ నిరూపణము శాసనము దీయబడిన ప్రసిద్ధపరిహద్దులతో సమన్వయ మందవలెను. పిదప శాసనము దీయబడిన సంవత్సర కాలము, మాసము, తిథియు విమర్శింపబడవలెను. ఇట్టి విమర్శనమువలన చరిత్రమున శాసనప్రాముఖ్యమును, కళింగరాజవంశమున నీ సామంతవర్మ స్థానమును నిర్ణయించుట కవకాశము లభించును.

శ్రీ మ. సో. శర్మగారు శ్వేతకాధిష్ఠాన పదమును 'శ్వేతకాధిష్ఠాన'మని నిర్ణయించి భాషాతత్వశాస్త్రముచేత 'శ్వేతక' శబ్దము 'చేతక' మైనదనియు, దానివికృతి 'చేటక' మనియు, పరివర్తనమున 'చేకట' మనియు నయ్యది 'చీకటి' యైనదనియు విపులముగా చర్చించిరి. చీకటి యనునది గంజాంజిల్లా యందలి యొక జమీందారీ సంస్థానము. శాసనమం దుదాహరింపబడిన

రాజధాని చీకటి యని నిర్దేశించుటకు ఇంతచర్చ చేయ వలసివచ్చెను. ఇదివర కెందరు చారిత్రకపరిశోధకులో శ్వేతకమును శ్రీకూర్మక్షేత్రముగ నంగీకరించి యుండిరి. అంగీకరించుటయే కాదు. స్థిరముగ ధ్రువపఱచియుండిరి. శ్రీ కూర్మము ఆంధ్రదేశమున, అందు ముఖ్యముగ కళింగరాజ్యమున ప్రసిద్ధ దేవస్థానము. అచటిదేవాలయము శ్వేతకాచలముపై నిర్మింపబడినట్లు స్థలపురాణము చెప్పుచున్నది. ఆలయమందలి పలుశాసనములలో గూడ శ్రీకూర్మేశుని శ్వేతాచలపతి యని ప్రశంస కలదు. కూర్మ విగ్రహప్రతిష్ఠానంతర మాగ్రామము శ్రీకూర్మ మని పిలువబడజొచ్చెను. అంతకు పూర్వమాగ్రామము శ్వేతకమని పిలువబడుచుండెను. ఈశ్వేతకము కళింగరాజ్యమున ముఖ్యస్థానములలో నొకటి. ఈసామంతవర్మయే గాక అనేకకళింగరాజులు శ్వేతకమునుండి తమ దానశాసనములను ప్రచురించుచుండిరి.

ఇదిగాక సంస్కృతభాషయందు 'శ్చేతక' యను పదముండుట దుర్లభము. సంస్కృతభాషయందు శకార చకారములతో గూడిన సంయుక్తాక్షరము తొలి యక్షరముగా గలపదములు లేనేలేవు. ఇది భాషాతత్త్వమునకు సరిపోదు. ఒకవేళ యీపదము సంజ్ఞావాచక మనినను, సంస్కృతభాషలో వాడుకచేయునపుడు, ఆభాషామర్యాదలను పాటించవలెను. లిపిశాస్త్రమున నీ శాసనకాలపులిపిలో చకారవకారముల కంతగా భేదము కానిపించదు. సందర్భముచేతనేమి, స్థిరపరుపబడిన చరిత్రాంశములచేతనేమి, ఈ పదమును శ్వేతక మని నిర్ణయించుట సమంజసము.

శ్రీ మ. సో. శర్మగారు ఈపదమును 'శ్చేతక' మని నిర్ణయించుటవలన నయ్యది చీకటియేయనిసమన్వయించి ప్రదత్తగ్రామములు దానికి సమీపమందే యుండవలెనని యూహించి ఫేరవగ్రామము బారువ యని స్థిరపరచిరి. 'శ్చేతక' వాదము ఖండితమగుట చేతను మిగిలినవాదమంతయు దానిపై నాధారపడి యుండుటచేతను వానినిగూర్చిన విమర్శన మనవసరము.

ఇక కొన్ని శాసనములలో "శ్వేతకాత్" నగరాత్ 'పిష్టపురాత్' అనియు, మరి కొన్నింటిలో 'శ్వేతకాధిష్ఠానాత్' 'నగరాధిష్ఠానాత్' 'పిష్టపురాధిష్ఠానాత్' అనియు రెండు విధముల ప్రయోగములు గానబడుచున్నవి. స్థలనామమునకు 'అధిష్ఠానాత్' అని చేర్చుటలో విశేష మేమైయుండును? ఆపదముచేర్చ కుండునపు డర్థ మేమగును? ఈసందర్భమున కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు లోగడ నాతో కొంత చర్చ సలిపి 'శ్వేతకాత్' మొదలగు శబ్దములు రాజధానిని దెల్పుననియు, అధిష్ఠానాత్ అని చేర్చుటచేత ఆ పట్టణము రాజధానిగాక రాజు దేశమున రాజకార్యనిర్వహణమునకై సంచరించు సమయమున విశ్రమించు(బస) స్థాన మనియు నిర్ణయించిరి.

దీనికి నిదర్శనముగ నాచే ప్రచురింపబడిన వాసిష్ఠకులజుడును కళింగాధిపతియునగు అనంతవర్మచే నొసగబడిన రెండు శాసనములు గలవు. ఈ యనంతవర్మచే నొసంగబడిన రెండు శాసనములలోను మొదటిదానియందు (సిరిపురతామ్రశాసనము) దేవపురాత్ అని చెప్పబడినది. రెండవదానియందు (కిందొప్పతామ్రశాసనము) పిష్టపురాధిష్ఠానాత్ అని కలదు. దీనివలన అనంతవర్మకు దేవపురము రాజధాని యనియు పిష్టపురము కళింగరాజ్యములో రాజసంచార కార్యక్రమములో బసచేయు నొకచోటనియు స్పష్టముకాగలదు. ఒక్కరాజునకు ఏకకాలమున రెండు రాజధాను లుండు టసంభవము. అందుచేత శ్వేతకాధిష్ఠానము శ్రీ మ. సో. శర్మగారు తలంచినట్లు సామంతవర్మకు రాజధానికాక రాజసంచార కార్యక్రమముగ నాతడు మకాముచేయు స్థానమని నిశ్చయము.

ఇందుచేత సామంతవర్మకు రాజధాని వేరై యుండనోపు. దీనికి కొంచెము పూర్వముననో పరమంతో కళింగ మేలిన ఉమవర్మకు సింహపురము రాజధాని. సముద్రగుప్తుని దక్షిణదిగ్విజయ దండయాత్ర వలన నీయుమవర్మ తనరాజధానిని సింహపురమునుండి నగరమునకు మార్చియుండెను. ఈవిషయము నాచే ప్రచురింపబడిన ఉమవర్మ శాసనములవలన వెల్లడియగుచున్నది. కాబట్టి సామంతవర్మకుగూడ సింహపురముగాని నగరముగాని రాజధానియై యుండనోపు.

ఇక లోహశృంగారవిషయ విషయమందలి శేరవగ్రామమును వరాహవర్తనీ విషయములోని శ్వేతకాధిష్ఠానమున దానముచేయుటలో నొకవిశేషము కలదు. శ్వేతకమందలి శ్రీకూర్మనాథుని సన్నిధి సామంతవర్మ బ్రాహ్మణులకు దానముచేయుటలో విశేషపుణ్య మపేక్షించుటయేగాక దైవసన్నిధిచేసిన భూదానమందు దృఢవిశ్వాసముగూడ కనబడుచున్నది.

కళింగమేలిన గాంగరాజ వంశావళియందు సామంతవర్మ స్థానము నిర్ణయము కావలెను. ఈతడు 'గాంగామల కులాంబరేందు'డని తనవంశమును స్పష్టముగా చెప్పుకొనియున్నాడు. గాంగవంశమునకు పూర్వము కళింగమేలిన రాజవంశము లనేకములుకలవు. అందు చేదివంశమునకు చెందిన ఖారవేలుడు చారిత్రయుగమున ప్రథముడుగా కనబడుచున్నాడు. వానితరువాతబహుకాలమువరకు కళింగచరిత్రమేమియు తెలియరాకున్నది. తరువాత నగరమునుండియు, సింహపురమునుండియు శాసనముల బ్రచురించిన ఉమవర్మగానబడుచున్నాడు. ఈతడు దక్షిణదిగ్విజయయాత్రకై సముద్రగుప్త చక్రవర్తితో సమకాలీనుడుగా కనబడుచున్నాడు. ఈకాలమునందే రాగోలు శాసనకర్తయగు శక్తివర్మయు పిష్టపురము ముఖ్యపట్టణముగ కళింగ మేలుచుండెను. వీరికి పూర్వమో, పరమో స్పష్టముగా చెప్పలేముగాని వాసిష్ఠకులజాలగు ముగ్గురురాజులు గుణవర్మ, ప్రభంజనవర్మ, అనంతవర్మ యనువారలు దేవపురము రాజధానిగా కళింగ మేలినట్లు వారిసిరిపుర కిందోప్పుశాసనములవలన తెలియవచ్చుచున్నది. వీరిశాసనములు రెండు నాచే లోగడ బ్రచురింపబడెను. ఈవంశపు రాజుల యేలుబడి తరువాత నీగాంగవంశము కళింగమును స్థిరముగా నేలుటకు బూనుకొనినట్లూహింపవలెను.

గాంగులు బహుకాలము స్థిరముగా కళింగ మేలిరి. ఈ వంశస్థాపకు డెవడో స్పష్టముగా చెప్పలేము. మన శాసనకర్తయగు సామంతవర్మయు నీ గాంగవంశములోనివాడే! వీనికాలమున గాంగేయ ప్రవర్ధమాన విజయరాజ్యశక మేర్పడలేదు. ఈశక మేర్పాటుచేసినవా డీవంశమందలి మొదటిరాజు మాత్రము కాడని స్పష్టముగా చెప్పగలము. ఈ వంశమందు మొదటివాడుగాక తరువాతివాడగు నీ సామంతవర్మయు తన శాసనకాలమును దెలుపునపుడు గాంగేయశకమును చెప్పక వేర్వేరు శకకాలముల వివరించుటయే తార్కాణము.

ఒకటి మాత్రము నిశ్చయము. గాంగవంశపు రాజులకు మాత్రము మహేంద్రగిరియందలి గోకర్ణేశ్వరస్వామి ప్రధానదైవతము. బహుశా ఈవంశమందలి మూలపురుషు డీస్వామికరుణవలన కళింగ రాజ్యమును స్వాధీనపరచుకొనుటచేతనో, లేక నాత డీస్వామిని మహేంద్రమున బ్రతిష్ఠించుటవలననో మిగిలిన యావంశపు రాజులకెల్ల నీగోకర్ణస్వామి ఆరాధ్యుడయ్యెను. ఈస్వామి ప్రశస్తి తొలుదొల్త నాలుగైదు పంక్తులతో కూడియున్నదైనప్పటికిని రానురాను క్రమక్రమముగా వీలుగుచోటులనెల్ల విశేషణములు చేరుచు విపులము కాజొచ్చెను. గాంగవంశపు రాజులెల్లరు నీ ప్రశస్తినే స్వల్పభేదములతో తమ శాసనముల వాడుచువచ్చిరి. ఈ'గాంగ' వంశీయుల యనంతరము 'గంగ' వంశజులగు రాజు లీకళింగమేల జొచ్చిరి. గాంగులకును గంగ వంశజులకును భేదమేమియో స్పష్టముగ తెలియవచ్చుటలేదు. గంగవంశమువారు గూడ నీ మహేంద్రగిరియందలి గోకర్ణస్వామినే స్తుతించుచుండినను వారియనుక్రమణిక వేరు. పూర్వరాజుల స్తుతిక్రమమును వీరు మార్చుటయేగాక తమ వంశమును గాంగవంశమని చెప్పికొనక గంగవంశమనియే చెప్పికొనుచుండిరి. ఈ భేదములచే నీయుభయు లేకవంశమువారో భిన్నులో తెలియరాకున్నది.

గాంగేయ ప్రవర్ధమాన విజయరాజ్య శకస్థాపనమునకు ముందు కళింగమేలిన కొందరురాజులు తమ శాసనముల జెప్పినకాల నిర్దేశమిచట పరీక్షించుట సమంజసము.

నాచే తొలుదొల్త వెలువరింపబడిన వాసిష్ఠకుల రాజవంశావళి యందనంతవర్మ తన సిరిపురతామ్రశాసనమందు దానకాలమిట్లు వర్ణించెను. "అష్టాశ్మక సంఖ్యధ్యాః మహోశ్వయుజే సంవత్సరే మాఘమాస పౌర్ణమాశ్యా" దీనినిబట్టి యనంతవర్మ గౌడీయపద్ధతి నరూద

యాబ్దమానమున కాలనిర్దేశము చేసినట్లూహించవలెను. సింహపురము రాజధానిగా నేలిన ఉమవర్మ తనయేలుబడిలోని ముప్పదియవ సంవత్సరము దానకాలముగా చెప్పెను.

ఇక మనశాసనకర్త సామంతవర్మ తనదానకాలమీరీతిగ వివరించెను:—"సంవత్ ౧౮౫ కార్తిక దిన ౩౦."

సంవత్ ౧౮౫ అని చెప్పుటలో నీతడు విక్రమశకము వాడుకచేసినట్లు కనబడుచున్నది. అంకెలను వాడుటలో ౧౦౦, ౮౦, ౫ అని మూడు వేర్వేరు అంకెల నిచ్చెను. నూరును తెలుపుటకొక గుర్తును, ఎనుబదిని తెలుపుటకొక గుర్తును, అయిదును తెలుపునొక గుర్తును వాడుక చేయుటలో నొక విశేషము కనబడుచున్నది. ఆ కాలమున అంకెల విలువ స్థానమునుబట్టి గాక ప్రత్యేకముగ వానియందుండు విలువనుబట్టియే వ్యక్తమగుచుండును. అనగా నాకాలమున దశాంశపద్ధతి (Decimal Notation) వాడుకలో లేదు. అప్పటి కా పద్ధతి కనిపెట్టబడలేదు. నేటి సంఖ్యాగణనము అంకెల స్థానమును బట్టియుండును కాని యా కాలమున నీపద్ధతి లేదని స్పష్టముగా దీనివలన చెప్పగలము. దశాంశపద్ధతి యనగా అంకెలకు స్థానమునుబట్టి విలువను నిర్ణయించు పద్ధతి హిందూ గణితశాస్త్రమున చేర్పకమునుపే యీ శాసనము పుట్టిన దని రూఢిగ చెప్పవగును.

ఇక కార్తిక దిన ౩౦ అని చెప్పుటలో ముప్పదియవదిన మమావాస్యను దెలియజేయునో లేక పౌర్ణమిని తెలియజేయునో స్పష్టముగ జెప్పలేము. మాసారంభము చాంద్రమానమున బహుళ పాడ్యమినాడారంభమై పున్నమతో ముగియును. ఈ యాచారము ఉత్కళ బంగాళదేశములందు నేటికిని కలదు. నేటి యాంధ్రదేశ కాలగణనము చాంద్రమానము సౌరమానముగాక మిశ్రమమగుటచేత ముప్పదియవదిన మమావాస్యగా లెక్కింపబడుచున్నది. పూర్వకాలమున అనగా క్రీస్తుశకారంభమందలి నాలుగైదు శతాబ్దముల వరకు చాంద్రమానమే వ్యవహరింపబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. కాబట్టి సామంతవర్మ చేసిన దానకాలము కార్తికపౌర్ణమియని నిశ్చయింప వచ్చును.

ఇక సంవత్సరమును చెప్పుటలో కొందరు శకసంవత్సరమును, కొందరు గురూదయాబ్దసంవత్సరమును, కొందరు విక్రమశకసంవత్సరమును, మరికొందరు తమ యేలుబడిసంవత్సరమును — ఇట్లు పలువురు పలువిధములుగా కాలమును లెక్కించుచువచ్చిరి. దీనివలన దేశమందు కాలగణనము స్థిరమగు పద్ధతులపై జరుగలేదనియు, విశేషవ్యాప్తిగల ప్రసిద్ధమగు నొక్కపద్ధతియేని లేదనియు, వేర్వేరుపద్ధతు లొక్కరాజ్యము నందే ప్రచారమం దుండెననియు విశదమగుచున్నది. ఈ చిక్కులు మనకేగాక యా కాలమందలి రాజ్యమేలు రాజులకును గందరగోళముగ నుండుటచేతనే గాంగేయ ప్రవర్ధమాన నిజ రాజ్యసంవత్సరశకము కళింగమున నారంభమై ప్రచారమునకు వచ్చెనని యూహింప వచ్చును.

ఈ శాసనమందలి వ్రాతవైఖరి నాలుగైదు శతాబ్దముల నాటి దని సూచించుచుండ మూలమం దీయబడిన సంవత్ ౧౮౫ అనగా క్రీ. శ. ౬౮౩-వ సంవత్సర మగుటచే రెండుమూడు శతాబ్దముల భేదము గానవచ్చుచున్నది. ఇందువలన నొక క్లిష్టసమస్య విమర్శకుల నెదుర్కొనుచున్నది. వ్రాతవైఖరికి ప్రాధాన్యమిచ్చుటయా? లేక శాసనమం దీయబడిన కాలమునకు ప్రాధాన్యమిచ్చుటయా? దానకర్తయగు రాజు తన శాసనమం దిచ్చిన కాలము తప్పని యెన్నుటకు ప్రబల కారణము కానరాదు. అందుచేత లిపిశాస్త్రజ్ఞులు వివిధ లిపులను నిర్దేశించుటకు స్థిరపరచినకాలమును మార్చుకొనుట సమంజస మగునేమో! ప్రజ్ఞావంతులగు శాస్త్రజ్ఞులు చూపిన మార్గమున నిట్టి క్లిష్ట సమస్యలు వచ్చుచున్నవి. కాన వార లామార్గముల స్థిరపరచిన గాని సామంతవర్మకాలముగాని, తదితరుల కాలము గాని స్పష్టముగ నిర్ణయింప వీలులేదు.

శాసనమం దీయబడినయగ్రహారము ఖేరవగ్రామము. దీనితో నశ్వత్థచ్ఛేద మను గ్రామముగూడ చేర్చి యగ్రహారముగా జేయబడినది. ఈ ఖేరవగ్రామము లోహశృంగార విషయ (జిల్లా) ములో నున్నట్లు చెప్ప బడినది. లోహశృంగారవిషయ మింతవరకు పరిశోధకులకు దెలిసిన విషయము కాదు. పదసామ్యమున, నీ

లోహశృంగారవిషయ మనునది విశాఖపట్టణంజిల్లా యందలి శృంగవరపుకోటతాలూకా యని యెంచవలెను. శృంగవరపుకోట యనుశబ్దమున కోట యొకటి యుండుటయు, నచ్చట లోహపరిశ్రమ—అనగా కంచుపోతపని—విశేషముగ నేటికిని జరుగుచుండుటయు, పదసామ్యమువను లోహశృంగారవిషయము నేటి శృంగవరపుకోటతాలూకా యని నిర్ణయించబడినది.

ఇక ఫేరవాశ్వత్థచ్ఛేద గ్రామములు నిర్దేశింపబడవలయును. శ్రీ మ. సో. శర్మగారు ఫేరవగ్రామము చీకటికి సమీపమందలి బారువ గ్రామముగా నిర్ణయించిరి. ఫేరవశబ్దవికృతియే నేటి బారువ యయ్యెనని వారి యభిప్రాయము. సాధారణముగా మొదట చేసినతప్పు తరువాత చేయబడినతప్పుల పరంపరకు కారణ మగుచుండును శ్వేతకమును శ్చేతకమనియెంచి యయ్యది చీకటి యని స్థిరపరచి ప్రదత్తగ్రామము దానికి సమీపమున నుండవలయునని యెంచి ఫేరవమును బారువగా నన్వయించిరి. శాసనమం దిచ్చిన సరిహద్దులుగూడ నద్దానికి కిట్టించవలసి వచ్చెను.

శాసనకావ్యకర్తలు సాధారణముగా ప్రౌఢత్వసిద్ధికొరకు దేశీయములగు నాంధ్రపదముల—ందు సంజ్ఞావాచకములుగూడ — భాషాంతరీకరించి తమ శాసనముల వాడుట నక్కడక్కడ గానబడుచున్నది.

కొన్ని భాషాంతరీకరణము లుదాహరణముగా నిచ్చట పొందుపరచు చున్నాను:—

| దేశీయనామము | శాసనముల ప్రయోగించిన ప్రౌఢ సంస్కృత భాషాంతరీకరణము |
|---|---|
| ౧. కొల్లకోట<br>కొల్ల=అధికము | —బృహత్కొట్టిల గ్రామము |
| ౨. పెద్దముడియము | —బృహత్ప్రిష్టక గ్రామము. |
| ౩. రాగోలు | —రాకలువగ్రామము? |
| ౪. ఆముదాలవలస | —ఏరండపల్లిక |
| ౫. పట్టుపురము | —పిష్టపురము |

ఇటులనే ఫేరవము అశ్వత్థచ్ఛేదము అనుపదములుగూడ భాషాంతరీకరింపబడిన శుద్ధాంధ్రదేశీయపదము లని యెన్నవలెను. ఫేరవ మనగా నక్క కాబట్టి ఫేరవగ్రామ మనునది నక్కపల్లియై యుండనోపు. అశ్వత్థమనగా రావి. ఛేద మనగా పాడుచేయుట. కాబట్టి అశ్వత్థచ్ఛేద మనగా రావిపాడు అని యెంచవలెను. దీనివలన దానముచేయబడిన గ్రామము నక్కపల్లి యనియు దానిసమీపమందలి రావిపాడు అను చిన్నపల్లియ యనియు నూహించవలెను. నక్కపల్లి ప్రస్తుత మనకాపల్లికి సమీపమందలి గ్రామము. ఇది పిల్లలాడుకొను కొయ్యతో చేయబడు నాటవస్తువులకు ప్రసిద్ధి. ఈ గ్రామమున కుత్తరభాగమున మేఘాద్రిగడ్డ యను నది ప్రవహించుచున్నది. ఈ మేఘాద్రిగడ్డయే శాసనకాలమున మేఘావతి యని పిలువబడుచుండె నని యూహింపవలెను. ప్రస్తుతకాలమున విశాఖపట్టణమునకు మేఘాద్రిగడ్డనుండియే నీటిసదుపాయము చేయుట కేర్పాటులు జరుగుచున్నవి. తూర్పుసముద్రతీరమందలి బారువగ్రామమునకు సరిహద్దులేవియు సరిపడుటలేదు. బారువకు సమీపమున మహేంద్రగిరియు దానియందు బుట్టిన మహేంద్రతనయ యనునదియు గలవు. ఆనది బారువయొద్ద సముద్రములో కలియుచున్నది. ఆనదిని మహేంద్రతనయ యని పిలుచుట సమంజసముగాని మేఘావతి యనుట యుక్తమైయుండదు.

సామంతవర్మకు పూర్వము కళింగరాజ్యమందలి వేర్వేరుభాగములు వేర్వేరురాజుల యేలుబడిలో నున్నట్లు మన మూహించుటకు శాసనమున నవకాశము కలదు. "స్వభుజబలపరాక్రమాక్రాంతకళింగాధిరాజ్యః" అని నాల్గవపంక్తిలో చెప్పుటచేత సామంతవర్మ తన పరాక్రమముచేత కళింగరాజ్యము నాక్రాంతము చేసికొనె ననుకొనవచ్చును. శాసనమం దేడవపంక్తిలో "సకలకళింగాధిపతిః" అని చెప్పికొనియున్నాడు. ఈ ప్రయోగమందలి "సకల"శబ్దమువలన కళింగము వేర్వేరుభాగములుగా నుండె నని యెంచవలెను. సామంతవర్మ యీ భాగములన్నింటిపై నధికారము చేయుచుండె నని గ్రహించవలెను. ఈతడేగాక తరువాతి కళింగరాజు లనేకు లిట్లే చెప్పియుండుటచేత నిజముగ వా రన్ని భాగముల నధికారము నెరపకపోయినను డంబముకొరకిట్లు వారు వ్రాసికొనుట యాచార

మైనది. వారధికారము నెరపినను, నెరపకపోయినను కళింగము వేర్వేరుభాగములుగా నుండుటమాత్రము సత్యము. సామంతశర్మ కనంతరము బహుకాలమైన తర్వాత రాజ్యమేలిన గుణమహార్ణవుని యైదుగురు పుత్రులు కళింగమందలి యైదుభాగముల నేలిరని కామార్ణవుడు చెప్పుచున్నాడు. ఏది యెట్లున్నను, కళింగ రాజ్యము వేర్వేరు రాజుల యేలుబడిలోని వేర్వేరు రాజ్యముల కూటమని మన మెంచవలెను. ప్రస్తుత మమెరికాపరిపాలనమువంటి పాలన మచట సాగుచుండెనేమో ?

ఈ శాసన మాంధ్రదేశమునందలి పూర్వచారిత్రవిషయముల నిరూపణమునకు మిగుల సహకారమొసంగున దగుటచేత నే నిద్దానివిమర్శనమునకు బూనుకొంటిని. ఇట్టి ముఖ్యమగు శాసనమును వెల్వరించిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రుల కృతజ్ఞతకు మిగుల పాత్రులగుచున్నారు.

## మూలము [1]

### మొదటి రేకు - రెండవప్రక్క



౧ ఓం[2]. స్వస్తి విజయశ్వేతకాధిష్ఠానాద్భగవతశ్చరాచరగురోర్ [3] సక
౨ లశశాఙ్కశేఖర ధరస్య స్థిత్యుత్పత్తి ప్రలయహేతోర్మ్మహేన్ద్రాచ
౩ లశిఖరనివాసినః శ్రీ గోకర్ణేశ్వరస్వామినశ్చరణకమలారా
౪ ధనాదవాప్త పుణ్యనిచయో గాఙ్గామలకులామ్బర [4] న్దు స్వభుజవ [5]
౫ లపరాక్రమాక్రాన్త కలిఙ్గాధిరాజ్యః శక్తిత్రయప్రశమానురక్షితా శే
౬ షసామన్తః పరమమహేశ్వరో మాతాపితృపాదానుధ్యాతస్స

---

1 తామ్రశాసనమునుండి తీయబడినమూలము.

2 ముడివంటి గుర్తువలన తెలియజేయబడినది.

3 రకారపొల్లు వ్రాయబడినది.

4 అంబరేందు అని చదువుకోవలెను.

5 వకు బ అని చదువవలెను.

రెండవరేకు - మొదటిప్రక్క

౧ కలకలిఙ్గాధిపతిమ్మహారాజశ్రీ సామన్తవమ్మా కశలీలోహాళ్ల
౨ ఙ్గారవిషయ సమ్బన్ధ ఫేరవగ్రామేయథానివాసి జనపదం సమాజ్ఞా
3 పయతి విదితమస్తు భవతా [6] యథాయంగ్రామేశ్వర్థ చ్ఛేద సహి
౪ తస్సర్వ్వకర భరానపనీయ భారద్వాజసగోత్ర వాజసనేయ కీర్తిశ
౫ శమ్మణే తత్పుత్ర దేవశమ్మ రవిశమ్మ దివాకరశమ్మభ్యశ్చతుర్భ్యో బ్రాహ్మణే
౬ [7] భ్యస్సలిలధారాపూర్వ్వమాచన్ద్రార్కకాలప్రతిష్ఠ మగ్రహారంకృత్వామా

రెండవ రేకు - రెండవ ప్రక్క

౧ తాపిత్రో [8] రాత్మ నశ్చపుణ్యాభివృద్ధయే సమ్ప్ర [8] త్తేస్యచగ్రామస్యసీమాలి ఙ్గా
౨ నిభవన్తి పూర్వేణ శుష్కనదీ దక్షిణేన సమ్వోద్య పశ్చిమేన సరిస్మేఘావ

---

6 భవతాం అని చదువుము.

7 పంక్తి యారంభమున అస్పష్టమగు నేదో యొక యక్షరము చెక్కబడినది. అది అనవసరము.

8 సంప్రదత్త అని యుండవలెను.

3 తి ఉత్తరేణ కోద్రవ ఖలీ దక్షిణేన గర్తాః పూర్వోత్తరేణ యావత్పర్వతః
౪ విదితేవంనకే నచిత్స్వల్పే ప్యేవా[9] ధాకార్యాః భవిష్యతశ్చ రాజ్ఞః ప్రతి
౫ వా[10] ధయతి ధర్మార్క్రమ విక్రమేణ నావాప్త మహీమనుశాస[11] ద్భిరయ
6 దానధర్మో[12]ః నుపాలనీయః వ్యాసగీతాశ్చాత్రశ్లోకాభవన్తి బహుభిర్వ[13]

మూడవ రేకు - ఒకటవ ప్రక్క

౧ సుధాదత్తా రాజభిస్సగరాదిభిః యస్య యస్య యదాభూమి స్తస్యతస్య
౨ తదాఫలం॥ స్వదత్తాం పరదత్తాంవ్వాయత్నాద్రక్షయుధిష్ఠిర మహీమహీమతాంశ్రేష్ఠ
3 దానాచ్ఛ్రేయోనుపాలనం॥ షష్టివర్షసహస్రాణి స్వర్గేమోదతి భూమిద ఆక్షే
౪ ప్తాచానుమన్తాచ తాన్యేవనరకేవసేత్, మాభూదఫలశఙ్కావః ప
౫ రదత్తేతిపార్థివాః స్వదానాత్ఫలమానన్త్య పరదానానుపాలనం.
౬ యశోనిత్యోస్థిరాభోగాజీవిత క్షణభఙ్గురం ఇతిసంచిన్త్య నృపతే కురు ధర్మాను
[పాలనం[14]

9 'వా' అను అక్షరమునకు బదులు 'శా' అని చదువుకొనవలెను.

10 — డిటో —

11 'స' అను అక్షరమును చేర్చుకొని చదువవలెను.

12 ధర్మానుపాలన అని చదువవలెను.

13 బహుభిర్వసుధా - అని చదువవలెను.

14 పాలనం - అని చదువుము.

మూడవ రేకు - రెండవ ప్రక్క

౧



1 సమ్వత్ ౧౦౦[15], ౮౦[16], ౫[17] కార్తీకదినం 30.

---

15, 16, 17 } నూరు, ఎనుబది, ఐదు ఈ అంకెలు మూడును మూడు ప్రత్యేకమగు సర్తులచే ఏకపంక్తిని వ్రాయబడినది. దీనిని 185 అని చదువుకొనవలెను.

---

# పశ్చాత్తాపము

శ్రీ దామెర రాజగోపాలరావు

ఆడుకున్నాను నా యాటలే నేను !
పాడుకున్నాను నా పాటలే నేను ! !

నీమాటయేమరచి, నేటివరకో ప్రభూ!
అపరాధినైతి, నే నాపదుద్ధారకా !
ఆడుకున్నాను... ... ...

యౌవనోత్సవములో త్రోవతప్పితి, తిరిగి
తిరిగి, నీపదసన్నిధిని చేరుకున్నాను ! !
ఆడుకున్నాను... ... ...

నిఖిలేశ ! క్షమియించి, నీచరణదాసిగా
ఈకలుషరాశి నిక, ఏలుకొనుమా, కృపను !
ఆడుకున్నాను... ... ...

# ధర్మాచరణ ముందు ఇంట్లోనే మొదలెట్టాలి-

# ...అలాగే పొదుపరితనం

సరియైన భీమా సంరక్షణ అంటే పొదుపరితనము, దూరదృష్టి ఒక్క పట్టాదారే కావడండా, అతను భీమా చేసే సంస్థ కూడా, కల్గివుండవలెనన్న మాట.

"ఆంధ్ర" యొక్క అభివృద్ధి కేవలం పొదుపరితనము, మితవ్యయము అనేవాటిపై ఆధారపడివున్నది. గత 15 సం॥లుగా యీ సంస్థ నిల్పిన చాలా తక్కువ ఖర్చుల దామాషా రుజువు చేస్తుంది. ఇదే ఈ సంస్థయొక్క, తక్కువ ప్రీమియములు, మిక్కిలి ఎక్కువ లాభములు, ఉదారమైన షరతులు, భద్రత, మంచి బోనసు, మున్నగు ఉత్తమ లక్షణములకు కూడ కారణము.




| | |
|---|---|
| ఆస్తులు | రు. 30,00,000 మించినది |
| జీవితనిధి | రు. 23,30, 356 |
| ప్రీమియము రాబడి | రు. 8,06,546 |
| 1939 లో క్రొత్తవ్యాపారము | రు. 34,30,620 |
| ఖర్చుల దామాషా | 22.4% (కమిషన్లు పోగా) |
| వెయ్యికి సాలుకు బోనసు | రు. 15/- |

భీమా వ్యాపారం చేసి
నెలకు రు. 500 మొదలు
రు. 5,000 వరకు ఆర్జించండి.
"ఆంధ్రా" లో నేడే చేరండి.

## ఆంధ్ర

## ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

## The ANDHRA INSURANCE COMPANY LTD.

ప్రధాన కార్యాలయము : మచిలీపట్నము.

మద్రాసు బ్రాంచి :
ఆంధ్ర ఇన్సూరెన్సు భవనములు,
తంబుశెట్టి వీధి, జార్జిటౌన్.

బ్రాంచీలు :— మద్రాసు, కలకత్తా, నాగపూరు, ఎర్నాకులం, అనంతపూరు (రాయలసీమ) బరంపురము (ఒరిస్సా).

సబ్ ఆఫీసులు & ఛీఫ్ ఏజన్సీలు :— బొంబాయి, సికింద్రాబాదు, పంజాబు, బీహారు, బెజవాడ, విశాఖపట్నం.

# నీ పుట్టుపూర్వోత్తరాలు

శ్రీ వి. ఆర్. శాస్త్రి

## నాల్గవ అధ్యాయము

౧

వెనుక ఒకచోట నీకు తోక, పువ్వారాలు పెఱుగటంచేత, నిన్ను చూస్తే మనుష్యశిశువులాగు పెఱిగేట్లు తోచలేదని, చెప్పి ఉన్నాను; జ్ఞాపకమున్నదా?

నీ కింకా సరీగా కండ్లు, చెవులుగాని ఏర్పడలేదు. నీ శరీరమూ, తల చేరే ఉన్నాయి. వాటి మధ్య మెడలాగు యింకా ఏర్పడలేదు. కాని, కాళ్లు, చేతులు మాత్రం బాగానే పెరుగుతున్నాయి.

ఇంకోవారంలోగా నీకాళ్లు, చేతులు మధ్యకు మడతపడుతాయి. అంతే, అక్కడ మోచేయి, మోకాలు యేర్పడుతాయి. ముక్కు నెమ్మదిగా తయారవుతోంది. అదేమాదిరి నీలోపల ఊపిరితిత్తులు యేర్పడుతున్నాయి. కాని, నీ వింకా పువ్వారాలను వదిలిపెట్టలేదు. ఒకవేళ ఎందుకన్నా పనికొస్తాయేమోనని నీ ఉద్దేశ్యం కాబోలు!!



పటం 8

మనుష్యశిశువుకు ముక్కు ఏర్పడేవిధం. రంధ్రాలూ, గొట్టమూకూడా మడతబడిన చర్మంవల్లనే ఏర్పడుతున్నవి. ఎంతపెద్ద మెదడో! ఒకప్పుడు మన మందరమూ ఇంత అందంగా ఉండినవారమే.

ఇంకా నీకు నిజమైన ముక్కురంధ్రాలూ, వాటినుంచి గొంతులోకి పోయే కాలువా యేర్పాటు కాలేదు. ఏవో రెండు చిన్న సొట్టలలాగు ముక్కుచివర యేర్పాటయింది, అంతే.

నీకండ్లవిషయంకూడా చాలా తమాషాగానే ఉంది. కండ్లు పెఱిగేచోట, చర్మం ఎత్తుగా, కొంచెం మడతలుపడియుంది, అంతే. కనుగ్రుడ్లు, కనురెప్పలు, కనుబొమ్మ, యివేవీ లేనేలేవు. ఇంకా ముందుగాని అవన్నీ ఏర్పడవు.

ఐదువారాలు గడిచేటప్పటికి నిన్ను చూస్తే ఏదో చిన్న పందిపిల్ల మాదిరిగా ఉన్నావు!

నీకాళ్లూ, చేతులు మధ్యలో మట్టుకే మడతపడేవి. ఇతరచోట్లలో మడతబడేవికావు; పొట్టిగా ఉండేవి.

నీయెముకలన్నీ మెత్తగా ఉండేవి. వాటి అన్నిట్లోకీ, వెన్నె

ముక ఒక్కటే, ఏదో కొంచెం గట్టిగా ఉంది.

అప్పటి నీరూపం చూస్తే నీవు ఏదో 'సీల్' మాదిరిగా పెరుగబోతా వనిపించేది. నీకాళ్లు చేతులు చక్కని యీదేపాదాలుగా మారడానికి తగిన చోట్లు న్నాయి. వాటితో సముద్రంలో యీదటం, మంచు కొండలమీద జేకుతూ పోకటం వీలుగా ఉండగలదు.

చేపమాదిరిగా నీవు పెరుగబోవని నిశ్చయమైంది; ఎందుకంటే నీకు ముక్కురంధ్రాలు, ఊపిరితిత్తులు యేర్పడ్డాయి.

నీకడుపు, హృదయం కూడా బాగానే పెరుగు తున్నాయి. ఇప్పుడు నీకడుపు చాలా అట్టహాసమైంది. అందులో ఎన్నో గొట్టాలు, కాలువలు ఉన్నాయి. పెద్దఫాక్టరీలోలాగు, నీ కడుపులో చాలా పని జరుగుతూ ఉంటుంది, యెప్పుడూ. చేపకడుపుకన్న నీ కడుపు గంభీర్యంగా ఉంది. కాని, పంది, సీల్ జంతువుల కడుపులు నీకడుపుమాదిరే ఉంటాయి.

## ౨

సరి, ఎనిమిది వారాలు గడిచాయి. నీ విట్లా సున్నావో చూద్దాం.

నీ వింకా చాలా చిన్నవాడివిగానే ఉన్నావు. ఒక నిమ్మకాయంత ఉన్నా వనుకోవచ్చు. కానీ, నీలో కొన్ని నికరమైన మార్పులు ఏర్పడ్డాయి.

నీ తోక ఇంకా పూర్తిగా హరించిపోలేదు; కాని, నీకు గిట్టలు పెరుగవని నిశ్చయమైంది. నీకాళ్లు, చేతులచివర వ్రేళ్లు పెరుగుతున్నాయి. దీన్ని బట్టి నీవు మేకపిల్లగానో, జింకలాగునో పెరుగబోవని నిశ్చయమైంది. నీవ్రేళ్లు ఒకవేళ పిల్లి, పులి పంజాల లాగు మారుతాయేమో? చెప్పలేము, అప్పుడే.

కనురెప్పలు, చిన్న ముక్కుకూడా తయా రయ్యాయి.

## ౩

ఈవిధంగా కొంచెం కొంచెంగా నీకు అవ యవాలు పెరుగుతూఉంటే వాటి నన్నిటిని చేర్చి, స్వాధీనంలో ఉంచడానికి, టెలిగ్రాఫు తీగలవంటి యేర్పాటొకటి కావలసి వచ్చింది. మొట్టమొదటి ఏక కణజీవి, వేరె ముక్కలు, కణాలుగా యేర్పడి, ఒక్కొ భాగం, ఒక్కొక పని చేయటం ప్రారం భించగానే, ఇటువంటి తంతివార్త యేర్పాటు అవసర మని దానికి తోచి ఉండవచ్చు.

వెలుపలిభాగం చర్మమనీ, లోపలిది కడుపనీ యేర్పడటంతోటే ఆరెంటినీ కలిసి పనిచేయటానికి ఈ టెలిగ్రాఫ్ యేర్పాటు కావలసివచ్చింది. కడుపుకు ఆకలయ్యేది. చర్మానికి అతుక్కొని మొలిచిన కాళ్లు, రెక్కలవంటిభాగాలు అందుకని ఆహారం వెతు క్కొంటూ నీళ్లల్లో పోవాలసి ఉండేది.

కడుపునుంచి ఈదేకాళ్లకు ఆహారం వెతకాలని కబురువచ్చేది. అందుకు కాళ్లు "సరే, అల్లాగే చేస్తాం కాని ముందుగా నీవు జీర్ణంచేసుకొన్న కొంత ఆహారం మా కీయాలి. అప్పుడే మాకు యీదటానికి బలం ఉంటుంది" అనేవి. కడుపు ఆహారం యిచ్చేది; కాళ్లు యీదేవి. తినేవస్తు వేదన్నా దొరుకుతే వెంటనే వెలు పలిచర్మం, కడుపుకు కబురుచేసేది. ఆహారం మ్రింగటం తోటే కడుపు దాన్ని జీర్ణించడానికి మొదలుపెట్టేది.

కొంతకాలానికి ఎప్పుడూ యీవిధంగా వార్తలు పోతూ వస్తూ వుండేమార్గాలు జీవిలో బాగా తయారైయాయి. ఆమార్గాలనుండా వార్తలు సుల భంగా ప్రవహించేవి.

చర్మంలో పైభాగం కండ్లు, చెవులు, వాసన చూసే ముక్కుకూడా తయారయ్యా యని చెప్పింది జ్ఞాపక ముందా? ఇవి పెరుగటంచేత ఇంకా యెన్నో వార్తలు రావటం మొదలుపెట్టాయి. చూచేవార్తలు, వాసనలసంగతులు, వినబడే వినోదాలు అన్నీ వస్తూం డేవి జీవిలోకి. ఇట్లా రావటంచేత జీవిలో కొన్ని జీవకణాలు వచ్చినవార్త లన్నిటినీ చేర్చటం, తగి నట్లుగా తిరిగీ ఏదో పనిచేయడానికి ఏర్పాటుచేయటం అనే పనులలో బాగా తరిబీదైనాయి.

కాబట్టి ప్రాణులు వృద్ధిపొంది, చేపలలాగునో, యితర ప్రాణులలాగునో తయారయ్యేటప్పటికి వాటి లో కొన్ని అవయవాలు కొన్నిపనులు, మరికొన్ని

పనులను ఇతరఅవయవాలు చేయటం నేర్చుకొన్నాయి. ఇంకా వాటిశరీరంలో పెద్దపోస్టాఫీసులాగు ఏర్పాటులు జరిగాయి. వచ్చిన విషయాలను గురించి ఆలోచించటం, నిశ్చయంచేయటం అనేపనులను ఒక ప్రత్యేక భాగం నేర్చుకొన్నది. ఈలా ఆలోచించి, ఇది చేద్దాం, ఇది వద్దు అని నిశ్చయించేభాగానికే మెదడని పేరు. ఇది నీకు తెలిసి ఉండవచ్చు. తెల్లని దారాలులాగు ఉండి, ఈ వార్తలను తీసుకుపోయేవాటికి నాడు లని పేరు. వీటినే కొందరు నరా లనికూడా అంటారు. ఇవి తంతివార్త లేక టెలిఫోనుతీగల్లాగు ఉంటాయి.

ఇంతకుముందు చిన్నముక్కలుగా కోసినా చనిపోనటువంటి కొన్ని పురుగు లున్నాయని చెప్పాను. వాటిలోకూడా యీమాదిరినరా లుంటాయి. కాని వాటిలో ఆలోచించేటటువంటి మెదడుమాదిరి ఏదీ ఉండదు

జీవిలో ఏదైనా ఒకభాగం ఆలోచించటం నేర్చుకొంటే తక్కినభాగాలు, అట్లా ఆలోచించటం అనేపనిని వదిలేస్తాయి. "నీవు యీ ఆలోచన లన్నీ చేస్తున్నావుగదా! మేము యెందుకు అదేపనిచేయాలి" అంటాయి ఇతరభాగాలు. అట్లా చేయటం వృథా ప్రయాసం.

త్వరలో ఇతరభాగాలకు యీ ఆలోచించేశక్తి అలవాటు తప్పుతుంది. అసలుయిట్లా, ఏదన్నా పని చేయకుండా కొంతకాలం నిలిచిపోతే, జీవులకు ఇకమీద ఆపనిచేసే అలవాటే పోతుంది. ఇందువల్ల యీభాగాలు అవసరమైన యితరపనులను చేయవచ్చు. నీ కాలి వ్రేళ్లతో ఆలోచించటం వీలుకాదు. పిల్లిగాని, యెలుకగాని తనతోకతో ఆలోచించలేదు.

ఎనిమిదివారాలు పెరిగేటప్పటికి నీకు నరాలు చాలా బాగా అవసరమైనాయి. ఎందుకంటే నీ శరీరంలో చాలాభాగాలు తయారైనాయి — చర్మం, కడుపు, పాదాలు, కండ్లు, ముక్కు, మొదలైనవి. ఇవన్నీ పెరగటంచేత ఏన్నో సంగతులు వస్తూపోతూ ఉండే అవసరం యేర్పడ్డది.

ఈ టెలిగ్రాఫ్ తీగలవంటి నరాలు ఏవిధమైన అపాయమూ లేకుండా జాగ్రత్తగా కాపాడబడాలి లేకపోతే, మనశరీరంలో ఏయేచోట్ల యేమేమి జరుగుతూఉందో మనం తెలుసుకోలేము. నీ కాలివ్రేలు కాలుతున్నా నీకు తెలియదు. నీబొటనవ్రేలిని ఎలుక కొరుకుతున్నా నీవు గ్రహించుకోలేవు. వెంటనే, ఇటువంటి సమయాల్లో నీకాలిని, చేతిని లాగేయకపోతే ఎంతనష్టం కలుగుతుందో గ్రహించుకో!!

నీ శరీరం యావత్తూ, చాలాభాగం నీ యెముకల బయటగానే యున్నదని ముందు చెప్పాను. ఐనప్పటికీ యీ టెలిగ్రాఫుతీగలు —అంటే నరాలు— ఆలోచనలుచేసే మన మెదడూకూడా ఎముకలలోపల జాగ్రత్తగా దాచబడిఉన్నాయి. మెత్తని తాబేలుయొక్క శరీరం, యిదేవిధంగా గట్టిచిప్పలోపల దాచబడిఉంది.

పటం 9.



శిశువు మెదడు, వెన్నుపాము వీపుపైపు వీపు నిలువునా కోసిచూపిస్తే కనబడతవి.

నీ మెదడు, నీకపాలంలో, నీపుర్రెలో దాగిఉంది. ముఖ్యమైన పెద్దనరాలన్నీ నీ వెన్నెముకలో, పొడూగునా ఉండే గొట్టంలో దాచబడి ఉన్నాయి. దీన్నే వెన్నుపా మంటాము.

౪

ఈవిధంగా నీ శరీరంలో తెల్లని నరాలు క్రమంగా పెరగటం మొదలెట్టాయి. ఒకదానొకటి చేరుకొని తిన్నగా మెదడుకు కొన్నిపోయికలుసుకొన్నాయి. మరి కొన్ని, నీ వెన్నెముకలో దాచబడిన పెద్ద నరాలకట్టకు కలుసుకొన్నాయి.

ఏన్నో రకాల నరా లేర్పడ్డాయి.

వాసన చూసేనరాలు.

వేడి, చల్లదనాలను గ్రహించే నరాలు.

వినడాని కుపయోగించేవి.

స్పర్శనాదులు—అంటే ఏదైనా వస్తువును

తాకితే, అది గట్టిగా ఉందో, మెత్తగా ఉందో చూపెట్టే నరాలు.

రుచి తెలిపేవి.

చూపుడు నాడులు.

ఈ నరాలన్నీ, నీశరీరంలో వేర్వేరుచోట్లనుంచి ఎన్నో విషయాలను నీ మెదడుకు తెచ్చి చెబుతాయి. ఎక్కడెక్కడ ఏమేం జరుగుతోందో నీమెదడు వీటి మూలాన గ్రహిస్తుంది.

ఇదే మాదిరిగా, నీమెదడునుంచి, శరీరంలోని ప్రతిభాగానికి తిరిగీ వర్తమానం తీసుకువెళ్లే నరాలున్నాయి. కాలు చేయి మొదలైన అవయవాలన్నింటికీ ఈపని చేయి, ఇది చేయవద్దని కబుర్లు మెదడు పంపిస్తుంది.

“ఇదిగో యిక్కడ మాంచిమామిడిపండుందని” వాసననరాలు మెదడుకు చెప్తాయి. వెంటనే “కొరికి తినేయమని” మెదడునుంచి నీపళ్లకు, నాలుకకు, గొంతుకకు వర్తమానం వెడుతుంది. అంతే! అప్పుడే సగం మామిడిపండు ఐపోయింది!

నీ వేదన్నా పెంపుడుకుక్కను పెంచినట్లైతే యీ విషయం చూసే ఉంటావు. ఏదన్నా రొట్టెముక్కగాని, బిస్కత్తుగాని దానికి విసరివేశామా అంటే, దబుక్కున ఎగిరి దాన్ని పట్టుకుంటుంది. పట్టుకోవటమే అలస్యంగా దాన్ని మింగేస్తుంది.

ఇంకో తమాషాకూడా చేసి, దీన్ని గ్రహించవచ్చు. నీకళ్లు మూసుకో. ఎవరినైనా ఉన్నట్లుండి నీకాలిని నెమ్మదిగా గుండుసూదితో గుచ్చమను. గుచ్చటమే ఆలస్యంగా నీకాలును లాగేస్తావు. అతను “ఒకటి” అని చెప్పేలోగా నీకాలును లాగేస్తావు!! దీన్నిబట్టి యెంతత్వరగా మన తంతివార్తలు వ్యాపిస్తాయో గ్రహించుకోవచ్చు.

నీవేళ్లచివర గుచ్చితే చాలా త్వరగా గ్రహించుకోవచ్చు. దానిబదులు వీపుమీదో, లేక కాలుమీదో గనుక గుచ్చితే అంతత్వరగా తెలుసుకోలేవు. వ్రేళ్ల చివరల్లో చాలానాడుల మొనలున్నాయి. ఇదే కారణం.

౯

చేపలు, పక్షులు చాలాత్వరగా తమ నాడులచేత విషయాలను గ్రహించుకోగలవు. కాని, పూర్వం, చేపలూ, పక్షులకన్నా చాలా పెద్దపెద్ద మృగాలుండేవి. వాటిలో కొన్ని ఒక చిన్న యిల్లంత పెద్దవి; మరికొన్ని యేనుగులకన్నా, తిమింగిలాలకన్నా కూడా పెద్దవిగా నుండేవి. వాటికి “డైనసార్”లని “ఇగువానడాన్”లని శాస్త్రజ్ఞులు పేర్లు పెట్టారు. ఆమాదిరి జీవులు యిప్పుడు లోకంలో లేనేలేవు. ఇంతపెద్దవైనప్పటికీ, వాటికి చాలా చిన్న మెదడేఉంది. అంత పెద్ద జంతువుకు, దానితోకచివరగాని, కాలిపాదం మీద గాని యేదన్నా గుచ్చుకొంటే, వెంటనే తెలిసేది కాదు. తెలిసినతరువాతకూడా అవి ఎంతో నెమ్మదిగా ఏంచేయాలో నిశ్చయించుకొనేవి. అట్లా అనుకొన్న పని చేయడానికి ఎంతో సేపయ్యేది.

పటం 10

పురాతన జీవులు — పెద్దవి



టెరోడాక్టిల్

బ్రాంటు సారస్





పక్క బ్రాంటోసార్

పక్కకు ఎన్నింతలు పెద్దదిగా ఉండేదో!

వాటికి ఆలోచనాశక్తి యెంత తక్కువంటే- అవి సాధారణంగా ఆకూ, అలమూ, గడ్డీ తిని బ్రతికేవి; ఒకవేళ అవి ఉండేదేశంలో యీ ఆహారం అంతా అయిపోతే ఇంకోచోటికి పోయి వెదుకుదామని వాటికి తోట్టేదేకాదు. చాలాదినాలు ఆకలికి మాడితేనేగాని, ఆహారం వెదకడానికి వాటికి చురుకుదనం కలిగేదేకాదు ఇవి యిట్లా నెమ్మదిగా ఆహారం వెతుక్కొని వెళ్లేలోపుగా, అప్పుడే అక్కడకు చురుకైన యితరమృగాలువచ్చి ఉండేవి. అక్కడ గడ్డీ, ఆకులూ అంతా అయిపోయి, ఏకొద్దిగానో మిగిలేది. అందుకని పాపం, యింతపెద్దవైనప్పటికీ యీజంతువులు చచ్చిపోయేవి. ఒకొక్కసారి, తమకన్న చిన్నజంతువులతో యివి పోట్లాడేవి. వాటిని తరిమివేయడానికి యత్నించేవి. కాని, ఆ చిన్న జంతువులు వీటికన్నా చురుకైనవి. పెద్దమృగాలనే అవి చంపితినటం నేర్చుకొన్నాయి. పెద్దపులులు, తోడేళ్లు మొదలైన మృగాలు యీ "డైనోసార్" ల వంటి పెద్దజంతువులను చాలావాటిని చంపేసి తినేవి.



పటం 11

టెరోడాక్టిలు అనే పక్షివంటిది ఎగిరే తాండలు 6 అడుగుల ఎత్తు గలది. దీనికి రెక్కల బారు చాలాఎక్కువ.

ఇందుచేత పెద్దవిన్నీ, తెలివి తక్కువవీ అయిన మృగాలన్నీ నశించిపోయాయి. ఇట్లా తెలివిలేని కొన్ని చిన్నజీవులు యిప్పటికీ బ్రతికున్నాయి, కాని అవెప్పుడూ ఏమూలో దాక్కొని బ్రతుకుతాయి. లేకపోతే యివీ చనిపోయేవే. ఆలుచిప్పలు, గవ్వలు, శంఖాలలోని పురుగులు, నత్తలవంటివి, యివన్నీ కూడా గట్టి పెంకువంటి డిప్పల్లో దాక్కొని, ఏరాతికో, పట్టుకు బ్రతుకుతుంటాయి. వీటికి తెలి వున్నదని యెవ్వరూ అనరు.

పటం 12



తప్పించుకొని బ్రతికిన కొన్ని పెద్ద జంతువులు యిప్పటికీ వున్నాయి. కాని "డైనసార్" ల లాగ యివి తెలివితక్కువ దద్దమ్మలు కాకపోవటంచేతే బ్రతుక గలిగాయి. బ్రహ్మాండంగా పెరిగి, యింతింత కండ లుంటే మాత్రం లాభంలేదు. తగినంత మెదడూ, చురుకుతనమూ అవసరం. ఇట్లా తప్పించుకు బ్రతికిన జంతువులు తెలివిగలవని, త్వరగా క్రొత్త విషయాలు నేర్చుకోగలవని మనం సులభంగా వాటి చేష్టలనుబట్టి గ్రహించుకోవచ్చు. ఈ ఉదాహరణాలు చూస్తే నీవే యీసంగతి గ్రహించగలవు.

పక్షులసంగతి చూడు. ఎంతెంత చక్కనిగూళ్లు కట్టుతాయో! ఎంత చమత్కారంగా తల్లీ పిల్లలు యీగూళ్లల్లో నివసించుతాయో ఆలోచించు. మన దేశంకన్న యింకా ఉత్తరానికి పోతే, అక్కడ దేశాలు చాలా చల్లగా ఉంటాయి. చలికాలంలో గజగజ వణుకుతారు జనులు; పిండిజల్లినట్లు మంచు ఇల్లూ, వాకిలీ, చెట్టూచేమా అన్నిటిపైనా కురుస్తుంది. ఆసమయంలో అక్కడుండే పక్షులు బారులుకట్టి వెచ్చగా ఉండే దేశాలకు, ఎన్నోవందలమైళ్లు యెగిరి పోతాయి. తిరిగీ తమ పుట్టినదేశం వెచ్చబడే సమయానికి ఎగిరివస్తాయి.

కుక్కలు, నక్కలు, తోడేళ్లుకూడా చాలా తెలివి చూపిస్తాయి. ఇవెప్పుడూ మందలుగా నివసించి, శత్రువులను వేటాడుతాయి. ఎంతో దూరాన్నుంచే యివి ఆహారాన్ని పసిబట్టగలవు. ఎంతబలమైన జంతువైనా సరే యీ మందలచేతుల్లో చిక్కితే తప్పించుకోటం కష్టం.

కాంబంకులు, డేగలు, గ్రద్దలు, సముద్రంపైన యెగిరే తెల్లగ్రద్దలవంటి పక్షులు-వీటిపేరు "సీగల్స్" (Sea Gulls)— యివన్నీ ఎంతో పైకెగురుతాయి. అంతయెత్తునుంచీ క్రిందయేదన్నా జంతువు మెసిలితే చాలు, కనిపెట్టేస్తాయి. అమాంతంగా క్రిందికి వాలుతాయి. కాలిగోళ్లతో గ్రుచ్చి యెగవేసుకు పోతాయి!

బీవరు అనే మృగాలు చెట్లమ్రానులు, కొమ్మలూ నరికి — తమ వాడిపండ్లతో — నీటికి అడ్డంగా కట్టగట్టుతాయి. ఈమ్రానులూ, కొమ్మలతోనే చక్కని యిండ్లు కట్టుకొంటాయి. ఇంకా జింకలు, కుందేళ్లూ యెప్పుడూ గుంపులుగుంపులుగానే జీవిస్తాయి; ఒక్కొక్కగుంపుకు ఒక పెద్దజంతు వుంటుంది. అంటే అదే తక్కినవాటికి దారి చూపిస్తుంది. మంద అంతా మేత మేస్తుంటే ఒకజింక, ఒకకుందేలు కాపలా కాస్తూ ఉంటుంది. ఎవరన్నా శత్రువులు రావటం తెలియగానే మందకు సంజ్ఞ చేస్తుంది.

చలిదేశంలో యెలుగుబంట్లుకూడా చమత్కారంగా బ్రతుకుతాయి. మంచు కురిసి, గజగజవణికే రోజుల్లో యివి బయటకురావు. ఆచలికాలం మూడు, నాలుగునెలలూ ఏదో గుహచేసుకొని దాంట్లో గుండ్రంగా చుట్టుకొని వెచ్చగా పడుకుంటాయి. వీటికి ఆచలికాలమంతా ఏవిధమైన ఆహారమూ అక్కర్లేదు!! ఏనుగులెంతతెలివైనవో నీవుచూసే ఉండవచ్చు. పనులుచేయటం, సర్కసులలో యెన్నెన్నో పల్టీలు, మొగ్గలువేయటం, సైకిళ్లుత్రొక్కటం యిటువంటి పనులన్నీ ఎంతోమందిచూసే ఉంటారు. చివరకు కోతులు! కోతిచేష్టలు, చురుకుతనం, ఇంకొకళ్లుచేసిందంతా వెంటనే కనిపెట్టిచేయటం యివన్నీ నీకుతెలిసిన సంగతులే. వీటి తెలివినిగురించి నేను చెప్పక్కర్లేదు!

బ్రహ్మాండమైన "డైనసార్"లు ఎగిరే కొండలవంటి "టెరోడాక్టిలులు" నశించిపోయాయి. వాటి పెద్దవాడిపళ్లు, తెరచాపలంత రెక్కలూ, యెందుకూ పనికివచ్చాయి కావు. ఆవిధమైన మృగాలే యిప్పుడు లేవు. ఇప్పుడు మిగిలి ఉన్నవన్నీ తెలివి, చురుకుదనాలకు పేరుపొందినమృగాలే. జిత్తులమారినక్క, వాయువేగంతో పరుగెత్తి దుముకగలచిరుతపులి, చలికాలంలో ఆహారం దొరకదని ముందుగానే తనగూటిలో పప్పులు, కాయలూ దాచుకొనే తెలివిగల ఉడుతా యివన్నీ బ్రతికున్నాయి. వృద్ధి అవుతున్నాయి. మనుష్యుడు కూడా బ్రతికి యుండటానికి కారణం అతని తెలివీ, చురుకుతనమూను. అసలు సృష్టిలో యింతవరకూ పుట్టిన జంతువులన్నింటిలోకీ, మనుష్యుని చురుకుతనానికి, తెలివికి సమానమైనవి లేవు. అందుకనే యెంతెంతమృగాలనైనా, ఇతడు స్వాధీనం

చేసుకొంటాడు. సృష్టిలో ఉండే అపాయకరమైన అగ్ని, నీటివరదలు, ఆకాశం నుంచి దిగజారే మెఱుపులశక్తి, వీటినన్నింటిని మనుజుడు స్వాధీనంచేసుకో కలిగాడు. ఇంకా ఎన్నెన్నో క్రొత్తవిషయాలను కని పెట్టి, స్వాధీనంచేసి ఉపయోగించుకొంటున్నాడు. కాని యీ ఉపయోగం యెప్పుడూ ప్రయోజనకరమైందిగా ఉండటం లేదు. చాలా హాని కలిగేటట్లు మనుష్యుడు యీరోజుల్లో ప్రవర్తిస్తున్నాడు. దీన్ని గురించి తిరిగీ, చివర వ్రాస్తాను.

పటం 18



'ఆర్కియాప్టరిక్స్' అనే పేరుగల పురాతనపక్షి. ఇది లోగడ తొండ జాతిదే అవడానికి దీని రూపం, రెక్కలు, తోక, తల, నోటిలోని పళ్లు తెలియజేస్తవి. తొండజాతి జంతువుల నుండియే పక్షులు పుట్టినవని జంతుశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

## ౬

కాబట్టి నీవు, తల్లిగర్భంలో, త్వరత్వరగా నీ మెదడును పెంచుకొన్నావు. పళ్లు, గోళ్లు, రెక్కలు, వీటన్నింటికన్నా మెదడేగదా చాలా ముఖ్యమైంది! జంతువులలో కోళ్లు అంతగా తెలివైనవి కావు. ఐనప్పటికీ గ్రుడ్డు పగిలి పిల్ల బయటకు వచ్చేటప్పుడు, దాని మెదడు బాగా వృద్ధియై, పెద్దదిగానే ఉంటుంది. దాని తల, దాదాపు దానిశరీర మంత పెద్దదిగా, గ్రుడ్డులో ఉన్నప్పు డుంటుంది. కాని, నీతల నీశరీరంకన్నా యెంతో పెద్దదిగా ఉన్నది.

నీలాగుడే, తెలివిగల జంతువుల మెదడు లన్నీ యెంతో చమత్కారంగా యేర్పడి ఉంటాయి. ఈ యేర్పాటువలన నీకు త్వరత్వరగా కావలసినపనులు చేయటం వీలవుతుంది. కాలయాపనం వృథాగాకాదు. నీమెదడు రెండుభాగాలుగా ఉంటుంది. ఇందులో ఒకభాగం మాత్రమే ఆలోచించటం, కావలసిన వేర్వేరు విషయాలలో మంచిచెడ్డలు నిశ్చయించటం అనే పనులు చేస్తుంది. రెండవది యిటువంటిపనులు చేయదు. ఇది తేలికైన పనులే చేస్తుంది. ఇందుచేత ఆలోచించవలసిన భాగానికి అనవసరమైన శ్రమ కలుగదు. మనిషిలోనే కాదు; యిట్లా తెలివైనజంతువు లన్నిటిలో యీయేర్పాటుంది. దీన్నిగురించి కొంచెం విశదంగా చెప్తాను.

మీయింటి పెంపుడుపిల్లి తోటలో నడుస్తూ పోతుంది అనుకో. ఇంతకుముందే, చక్కగా కడుపు నిండా పాలు త్రాగించావు, నీపిల్లికి. దానికి యింట్లో చిన్న పిల్లికూన లున్నాయి.

ఇదిట్లా నడుస్తూంటే, దాని రెండు రకముల మెదడులూ పనిచేస్తూనే ఉన్నాయి. ఒకటి, పిల్లి ఇంతకుముందే త్రాగినపాలను జీర్ణం చేయడానికి సహాయం చేస్తూంది. ఆపా లన్నీ జీర్ణమై, రక్తం, మాంసం, ఎముక మొదలైనవిగా మారడానికని, మెదడు ఆజ్ఞాపించటంచేత కడుపులో కావలసిన రసాలు, తైలాలు తయారవుతున్నాయి. పిల్లి ఊపిరి పీల్చడానికి దాని ప్రక్కలు, ఊపిరితిత్తులూ సాగడానికి తగిన యేర్పాటు లన్నీ జరుగుతున్నాయి. అదేమీ ఆలోచించకుండానే మెత్తగా గడ్డిమీద నడిచిపోతోంది. అదే సమయంలో చూడు, దాని తోకచివర పాములాగు నెమ్మదిగా యిటూ, అటూ తిరుగుతునేయుంది. ఈపనులన్నీ కూడా పిల్లి ఆలోచించకుండానే జరుగుతుంటాయి.

ఈపనులన్నీ జరుగుతూనేఉన్నాయి కాని వీటిని గురించి పిల్లి యొక్క ఆలోచించే మెదడుభాగం యేమీ పనిచేయటం లేదు. బహుశః, అది తనకూనలను గురించి ఆలోచిస్తూఉండవచ్చు. చిన్న కూనలను నీవు చాలామంది స్నేహితులకు ఎప్పుడూ చూపిస్తున్నావు. తల్లికి యిది బాగా లేదు. వాటిని మెత్తగా మెడచర్మం పట్టుకొని, నోటితో కరచుకొని ఇంకోచోటికి తీసుకు వెళ్లాలని ఆలోచిస్తూ ఉన్నది.

నీవుకూడా యిదేమాదిరి పనిచేయగలుగుతున్నావు. లేకుంటే నీపని చాలా కష్ట మవుతుంది. ఆలోచనలు చేసే మెదడుయొక్క భాగము ఆపనిమీదనే ఉంటుంది; నీశరీరంచేసే సాధారణపనులతో దానికేమీ జోక్యంలేదు. నీవు నడుస్తున్నావు, అదేసమయంలో ఏదో పాటను యీలవేస్తూ పాడుతున్నావు,

ఊపిరిపీలుస్తున్నావు, ప్రొద్దున్నే తిన్నటిఫిను జీర్ణ మవుతూంది. కాని వీటితో జోక్యం నీకు లేదు. నీ ఆలోచన లన్నీ చదువుతున్న యీ విషయాలను గురించిగాని, లేక నిన్న చూచిన టాకీ కథనుగురించి గాని, లేక నీ వేదన్నా క్రొత్తగా చేయదలచుకొన్న ఒక ఆటవస్తువును గురించిగాని విచారిస్తూ ఉండవచ్చు.

## అయిదవ అధ్యాయము

### ౧

నాలుగు నెలలు పెరిగేటప్పటికి అప్పుడే పుట్టిన ఇంకా కళ్లయినా తెరువని పిల్లి కూనంత పెద్దగా నీవు తయారై యావు. ఇప్పటి నీరూపం చూస్తే, రెండింట్లో ఏదో ఒక్కటిగానే నీవు పెరుగడానికి వీలున్నట్లు తోస్తుంది. కోతిగాగాని, మనుష్యుడిలాగు గాని నీవు పెరుగాలి. వేరే యితర మృగంగా పెరిగే సందర్భం తప్పిపోయినట్లుంది. ఎట్లా పెరుగుతావో?

నీకు కాళ్లూచేతు లున్నాయి. కాని తోకమాయ మైంది! నీ కాళ్లను చూస్తే అంతగా పరుగెత్తడానికి పనికి వచ్చేటట్లు తోచటం లేదు. ఏదో కొంచెంగా నడవటం, చెట్లెక్కటంమట్టుకే ఆ కాళ్లతో నీకు సాధ్యమయ్యేటట్లు కనుపించుతుంది. నీ దవుడలు బలమైన వస్తువులను ఘటుక్కున కొరికి తినడానికి తగినట్లుగా లేవు. అట్లా కొరకాలంటే పొడుగుమూతి, బలమైన దవుడలు, పళ్లు, వేటకుక్కకు, ఎలుగుగొడ్డుకు ఉన్నట్లుండాలి. కాని నీ తలకాయ గుండ్రంగాను, మూతి పొడుగ్గా పొడుచుకురాక, అదుముకొనిఉంది. నీ ముఖమట్టానికి నీమూతి ఎత్తుగా లేదు. నీ ముక్కు కూడా చాలా పొట్టిగా ఉన్నది. ఇందువల్లనీవు వేటకుక్కల్లాగు పసిపట్టలేవని కూడా గ్రహించుకోవచ్చు.

డిప్లొడాకస్ పటం 14






ఇదీ పూర్వం ఉండే పెద్దమృగాలలో ఒకటి. ౬ అడుగుల ఎత్తుమనిషితో పోల్చిచూస్తే ఎంతపెద్దదిగా ఉండేదో తెలియజేయడానికి మనిషిచిత్రంతో సహా కనబర్చినాము.

నీ మెదడుమాత్రం పెద్దదిగా, కోతికీ, మనుష్యునికీ ఉన్నట్లుంది.

కోతిమాదిరి జీవులు లోకంలో తయారు కావడానికి చాలాకాలం పట్టింది. పెద్ద కండలు పెంచుకొని, చిన్న బుర్ర లంతంత ఉండి, ఆలోచనాశక్తి లేకపోవటంలాభంలేదని జంతువులు తెలుసుకొన్నాయి. అప్పటినుంచి, చురుకుతనం, ఆలోచనాశక్తి ఎక్కువయ్యే పద్ధతులమీదనే జంతువులు వృద్ధికాజొచ్చాయి. రానురాను జంతువుల మెదళ్లు పెద్దవిగా పెరుగటం సహజమైపోయినది.

నాలుగైదు నెలలు పెరిగేటప్పటికి నీకు పెద్ద తల తయారైంది. అందుకని నీవు తెలివిగల జాతిజంతువుగానే తయారు కాబోతున్నావని నిశ్చయంగా చెప్పుకోడానికి వీలైంది. దరిమిలాను పెరిగి వృద్ధి చెందిన తెలివిగల జంతువులజాతికి నీవు చేరుతావని మనం నీపెద్ద తలకాయవల్ల గ్రహించుకోవచ్చు.

ఈ అన్ని విషయాలూ చూస్తే నీవు తప్పకుండా మనుష్యశిశువులాగునే పెరుగబోతున్నావని నిశ్చయమవుతోంది. కాని ఒక్కటే ఒక్క విషయంమాత్రం కొంచెం సందేహంగా ఉంది. అదేమిటో చెప్పుకో గలవా?

నీ వంటిమీదంతా, చిన్న కోతిపిల్లల కున్నట్లు మృదువైన, పొడుగు వెంట్రుకలున్నాయి!

పటం 15 తలల రూపాలు



ఎలుగుబంటి



కోతి



మనిషి

ఆయాజంతువులు తినే ఆహారాన్నిబట్టి వాటిముఖం, మూతి, పండ్లు మారుతాయి

వేర్వేరు జంతువులమాదిరిగా ఆడుకొంటూ, వేషాలు ధరిస్తూ పెరుగటం నీవు ఇంక కొద్దిరోజులకు పుట్టుతావనేటంతవరకూ, జరుగుతూనేఉంది. క్రమ క్రమంగా వేషాలుమార్చుకొంటూ రానురాను మనుష్య శిశువుమాదిరిగా మారావు. ఐనప్పటికీ, నీవు పూర్తిగా మనుష్య పాపాయిగా తయారైన తరువాతే నీవంటి మీది యీమెత్తనిబొచ్చు రాలిపోయింది. ఇది చాలా చివరదాకా నీశరీరంపైనే ఉంది. ఎనిమిదినెలలు, నీతల్లి గర్భంలో నీవు పెరిగేటప్పటికి, నీవు పూర్తిగా మనుజుడిలాగు తయారయ్యావు. ఏదో రకరకాల జంతువులుగా పెరిగే ఆటలూ, యత్నాలూ అన్నీ ఆఖరై పోయాయి. అవన్నీ యేదో ఒక కలమాదిరిగా మటుమాయమైనాయి.

పటం 16

శిశువు పెరుగుదలలోని దశలు



౨-వ వారంనుంచి ౧౨-వ వారంలోగా యీవిధంగా మారుతుంది, శిశువు.

లోకంలో అన్నిజంతువులూ పెరిగి, క్రమంగా మనుష్యునిమాదిరి వృద్ధిచెందే పద్ధతినంతా బహు త్వరగా, ఒక్కనాటకే మాడేశావు. ఇప్పుడు, అంటే, ఎనిమిదినెల లొచ్చేటప్పటికి పూర్తిగా మొగపిల్లాడిగానో, ఆడపిల్లగానో నీవు సిద్ధమైపోయావు. పురుగు, చేప, పంది, కుక్క, కోతిరూపా లన్నీ ఎప్పుడో పూర్వపు సంగతుల్లాగు మారిపోయాయి. వాటి జోక్యమే లేనట్లు, చక్కనిపాపాయిగా నీవు పెరిగావు.

అంతా సిద్ధంగా ఉంది. ఇంకా ఒక్కనెలకల్లా నీవు పుట్టబోతావు. నీపుట్టుకతో, నే చెప్పదల్చుకొన్న యీ విచిత్రవిషయాలు ఆఖరౌతాయి. ఆపైన జరిగిన విషయాలనుగురించి నేను చెప్పక్కర్లేదు. ఎందరో చిన్న పసిపాపలు పుట్టిపెరగటం నీవు చూస్తూనే ఉన్నావు. దాన్నిగురించి నేను వ్రాయక్కరలేదు. ఐనప్పటికీ ఒకటిరెండు విషయాలు నీకు ఇంకా చెప్పవలసి ఉంది.

ఎన్నో "ప్రొటొజోవా"సరిగా కదలలేక, చూడలేక పూర్వం చనిపోయాయని చెప్పింది జ్ఞాపకమున్నదా? ఆ బహు చిన్న జీవకణం "ప్రొటొజోవా" నుండి క్రమంగా వృద్ధిచెంది చర్మం, ఎముకలూ, కండ్లూ, ముక్కు, నాడులు, మెదడు, వీటి నన్నింటినీ పెంచుకోడానికి ఎన్నో లక్షల యేండ్లు పట్టింది. ఈ విధంగా పెర

గటంలో లెక్కలేనన్ని జీవులు నశించిపోయాయి. ఆహారం లేక కొన్ని, వేడికి కొన్ని, చలికి మరికొన్ని, ఇతర జంతువులు వాటిని తినటంచేత యింకా కొన్ని, అసంఖ్యాకంగా చనిపోయాయి. చావగా బ్రతికినవి క్రొత్త విషయాలు నేర్చుకొన్నాయి. క్రొత్త అవయవాలు పెంచుకొన్నాయి. కష్టాలను అతిక్రమించి బ్రతుక నేర్చాయి. అభివృద్ధి చెందాయి. ఏదో ఒక విధంగా తయారైన జంతువుమాదిరిగా పుట్టిజీవించటం సులభం. అట్లాకాకుండా క్రొత్తపద్ధతుల నేర్చుకొనటం క్రొత్త శక్తులు వృద్ధిచేసుకొని క్రొత్త అవయవాలు పెంచుకొని జీవించటమున్నూ కష్టమైన పనులు కాని, ఇట్లా కష్టించి పెరిగిన జీవులే పైకొస్తాయి. అట్లా పైకి వచ్చిన జీవులన్నింటిలోకి మనుష్యుడే పైవాడు. ఇట్లా మనుష్యుడు తయారు కావడానికి ఎన్ని కోటానుకోట్లజీవులు చనిపోయాయో మనం ఊహించటంకూడా కష్టం.

ఇంతకష్టంమీద జంతువులు వృద్ధిచెంది మనుష్యుడుగా పుట్టినప్పటికి, నీవు మాత్రం మనుష్యునిలాగు పెరగడానికి త్వరగా మారుతూవచ్చావు. ప్రతివారం ఎటువంటి ఒడుదొడుకులూ లేకుండా, క్రమంగా నెమ్మదిగా పెరిగావు. ఎక్కువ వేడిగాని, ఎక్కువ చలిగాని లేకుండా, వెచ్చని, మృదువైన నీతల్లి గర్భంలో నీవు సజావుగా పెరుగుతూ వచ్చావు. ఎన్నో జీవులు నశించి, ఎన్నో లక్షలయేండ్లకాలం పట్టిన మార్పులన్నీ, పెరుగుదల అంతా, ఎనిమిది, తొమ్మిది నెలల్లో పూర్తిచేసుకొన్నావు. దీనికంతకూ కారణం మీ అమ్మ నిన్ను తనలోపల దాచి, సురక్షితంగా పెంచటమే.

17-పటం. గర్భంలో ఐదునెలల బిడ్డ.



ఎంత పెద్దతలో! "బొడ్డుత్రాడు" బిడ్డమెడకు చుట్టేసుకొన్నది.

పటం 18

పుట్టడానికి సిద్ధంగా వున్న శిశువు.



తల్లిగర్భంలోనుంచి విడిగాతీసి చూపబడ్డ శిశువు. గర్భంనుండి బిడ్డబొడ్డుకు పోయే "బొడ్డుత్రాడు"ను చూడు. దీనినుండి రక్తం ప్రవహించి బిడ్డను పెంచుతుంది.

# ధన్యజీవి

శ్రీ బందా రామశాస్త్రి

౧

దానియేలిక తురక; హైందవుడు మంత్రి
మొఱకుతన మొకనిప్రకృతి; సరళగుణము
మఱొకనిది.-ఒకటి కొకటి మత్సరపరి
పూర్తిఁ జెంది వైరుధ్యము బొందు; నైన
ఎల్లజనులను సమత పాలించుచుండి
హైందవతురుష్కులను భేద మడఁచివైచి
యద్ది ధర్మసామ్రాజ్యము హద్దుగ గొని
గొప్పబుద్ధిని పాలించు గోలకొండ.

౨

ఎల్లవసుమతి దురకయే యేలవలయు
హైందవుడు వాని బానిస యౌచు కొలిచి
వానిమోచేతిక్రిందినీ రానుచుండ
వలె నను అరంగజే బను పాదుశాహ.
గొప్పసామ్రాజ్యమును ఏలుకొంచుకూడ
గోలకొండను వశపర్చుకొనగవలయు
ననుదురాశను దండెత్తె నవసర మగు
సేనలను దోడుకొని యుధిష్ఠిరుడు నగుచు
సమరమున కేగువాని కీసాకు లేల
యుద్ధ మొనరింప బోవుచుంటి నని న
వాలు జేయక నొకసాధువరునమాధి
జూడబోవుచుంటి నని బొంకాడ నేల.

3

బొంకు బొంకినమాత్రాన మోసగింప
బడునె శత్రువు కుమతి యబద్ధమాడె,
ఊహచేసియె మాదన్న ఉంచెగోట
శత్రున కభేద్య మగురీతి శక్తిమించి.
అంతియేకాదు శత్రుల నాదరమున
డోడుకొని రమ్ము పొమ్ము దోర్లీల ననెడి
రీతి నొక కొంతసేన లారీకి నిచ్చి
పంపె నౌరంగజేబు లోబఱచి తెగ.

౪

మొగలుపీరులు లారిచే ముట్టడింప
బడియు నతనిధాటి నెదుర్చ బలము లేక
బంధితులు సేయబడి యా నవాబునొద్ద
నిలువబడి రాత డేమిగా బలుకునో యని.
ధర్మమూర్తి యతడు వేఱుగా దలచు నేమి?
చేత దొఱకినమాత్రాన చీల్చునేమి?
యత డరంగజేబునివలె యధముడేమి
భయముబాపి తిరుగ బంపె భద్రగతిని.

౫

ఈయుదారబుద్ధి గనియు త్రోయడు తన
దుర్మతిని పైగ నుసికొల్పు, తొందరించు
సంగరము జేయ సేనల చాటుఛక్క-
శత్రులకు దమసన్నాహసరణి దెలియ.
తగినశిక్ష విధించె నధర్మమునకు
దేవు డీమాఱునుంగూడ దెబ్బతగిలె
నాయరంగజేబుకు. ఎట్లు ఈయభేద్య
మైనకోట తేలిక భేద్యమగు నని యెడి
శంక కలుగంగ కార్చిచ్చు సంక్రమించి
యతనిహృదయము నెరియించె నతడు దీని
కేదియేని యుపాయము నిపుడు వెదుక
వలయు ననునూహ మనమును కలచుచుండ
ఏదిరో మనసున నిబ్టె పాదుకొనగ

తోచలే బలేమెత్తులే దొఱకె వెఱవ
టంచు నొకయుత్తరము వ్రాసి యనుచరునకు
నిచ్చిలారీకి దాని నందివ్వ బంపె.

౬

"ఈరజాకున్వభావము నెఱుగ డతడు
కానిచో నేల నీరీతి కాసుమీద
భ్రాంతిపుట్టించు బుత్తెంచు రాయబారి
తుచ్ఛులకు నిట్టిబుద్ధులే తోచుచుండు"
అనుచు నౌరంగజేబు నైచ్యము దలంచి
విసిగి ప్రత్యుత్తరము నీక వేనవేలు
ముక్కలుగజించె నుత్తరము నిదియదగు
ప్రతిసమాధాన మని మది బదిలపఱచి.
పైడిటంకాలకై యాసపడ డిదేమి?
మాతృదేశానురాగంబు మాపడేమి?
గొప్పపదవులకై యేల కోర్కెపడడు?
దోష మెఱుగని రాజభక్తుండతండు.

౭

లంచమునుదిన్న ఒకద్రోహి వంచనమున
కోటతలుపులు తెఱువగ గుప్పతెప్ప
లుగను మొగలులు లోజొచ్చి లొంగనట్టి
స్వామిభక్తుల లోగొన జతనుపడిరి.
ఏల?...నిముసంబులో నింక గోలకొండ
కుమతియౌరంగజేబుకు గూలిపోవు
అబ్దులురజాకుఖాన్‌లారి యడలియేమి
చేయ దోచనికంగారుచేతఁ జిక్కి
ధైర్యమును దోడుజేసుక తలపడుటయొ;
పగఱకుం గోట స్వాధీనపఱచు టొకటొ;
ఏది యిందున కర్తవ్య మేచి శత్రు
వీరుల నురుమాడుటయే మద్విధియటంచు
తెప్పపాటుకాలముకూడ లేదు వ్యవధి!
శత్రు లందినతనవారి జంపుచుండ్రి!
లేవవలె తురగము నదలించి జీను
వేసికొనవలె పటకాను బిగియపఱచి,
తెప్పపాటుకాలముకూడ లేదు వ్యవధి!
ఏమిచేయంగవలె నిప్పు డేమిచేయ
వ్యవధి చాలదు ఎట్లు లున్న నట్లె యేగ
వలయు నబ్దులా! త్వరపడు! పరుగులెత్తు!
వదులుపట్టాను సవరించువ్యవధి లేదు
జీను వేయబూనినవారి జేరలేవు.
క్షణము నాలస్యమునుజేయ శాశ్వతముగ
నిన్ను లోకము ద్రోహిగా నెన్నుసుమ్మి
మచ్చ పుట్టును నీకీర్తి మండలమున
మచ్చపుట్టిన నిక దాని మాపలేవు
కదలు మసి బూని గోల్కొండ గావుమయ్య
పగఱకుం గోట స్వాధీనపఱచకయ్య
లంచమును దిన్న ఒకద్రోహివంచనమున
శాత్రవులను గోటను దా వశంబు జేసె
అదనురా దప్పకొన నసమర్థుడవయ
ఏలకూర్చుంటివి పగఱ నెదురుచుమయ.
గెల్చితో గోలకొండ నీకీర్తి విస్త
రించు లేకచచ్చితో విహరించుచుండు
వయ్య స్వర్గభూమినిగల అతిమనోహ
రమగు నుద్యానవనముల రంభగూడి.

* * *

అతనిచేతినిశాతహేతి తనవాత
నెప్పుడీ మొగలులఁ జంపి యిముడుచుకొను
దునను తొండఱ బిరబిర దురములోని
కీడ్చుకొనిపోయె నబ్దులు నిద్ధచరితు.

౮

"గోలకొండలో స్థిరముగా గుదిరియున్న
రాజ్యలక్ష్మినహృదయనరాగ మింక
వీడిపోలేదు మానుండి వెడలిపొందు
లేనిచో నబ్దు లిక మిమ్ము లిప్తలో గ
తాసులు గజేయు నీయసిధార నింక.
ధర్మమూర్తి తాన్‌శాహి యాతనిభటులను
నొక్కడేనియు జీవించి యుండడేని

గోలకొండకు బురుజులు కూలిపోవు
ఒకయధార్మికుదౌరాత్మ్య మూతగాఁగ
లోని కేతెంచువారు మీరు నిజమైన
పౌరుషమె మీకు గలదేని బవరమునకు
దివురు డప్పుడు మాపన దెలియగలరు"
అని నవాబుల బల్కుచు నబ్దులు తన
సైంధవంబుపైని తననిశాత హేతి
వలయములు ద్రిప్పుచును అడ్డువచ్చువాడు
పోటుమానిసి కానిండు పొడిచి వాని
మస్తకము కృత్తమొనరించి మదమడంచు
నక్రమంబగు శిక్షలో సైనికులను
నడపగా వీలులేదు కాన నెట్లైన
శత్రువుల వీక నెదిరించి చంపివైచు
టయె యిపుడవశ్య మా ననుటను గ్రహించి
తుములసమరంబునకు దాను తోడరె రెండు
పక్షములును సధైర్యులై పగ బురస్క-
రించి రొండొరులను నుత్తరించుకొనిరి
హితు డిత డత డహితుడని తెఱుఁగకుండ.
దొడ్డ బవర మాయెను. మొగల్తురకబలము
నందు నంగోరుషా లది యంతరించె
నబ్దులునికత్తివాదర. ఐన నతడు
దీర్ఘసంగ్రామభారాన దేజు దొలఁగి.
పగఱకత్తి తళతళలో బాప మతని
దివ్యసుందరవిగ్రహదీప్తి ప్రిదిలి
చిదిమె రక్తము సందెల జివికినదిన
కరుడు వెల్వరించెడి కెంపుకాంతులగతి.
పగఱసైన్యమో పరిమితి మిగిలినదియు
హితు లొకటి రెండంచు లెక్కింపవచ్చు
ఎంతసేపని యొక డెదురించగలడు
ఐన నెదురించి పోరాడె; యదియె శక్తి.
అబ్దులురజాకు దేహము ఒరులవాలు
వ్రేటులకు గురియౌచు చివికెను. శిరము
బొంగరమురీతి దిరుగంగ మూర్ఛపోయె
వారువముమీద నదియును పారిపోయె.

౬

కోటమాత్రము పాదుషా కూల్చివైచె
కూల్చలేకపోయెను రజాకుప్రవీర
తాభవనమునుమాత్ర మద్దానికొఱకు
గడువిచారమునను గుండె కమరె గుండె.
"అయిన నేమాయె నత డట్టియనుపమాన
విక్రమసమన్వితుడు మన వెన్నుగాచ
కలవె లోకాన మనచేయగాని పనులు
భువి సమస్తము దలవాంచి పొదలకున్నె."
అంచు నూహించి పాదుషా యతనిమఱల
"గొప్పయుద్యోగ మిత్తుము కొలువు మాకు
జేతువేని పైగ ధనము చేత జిక్కు"
నంచు కబురంపె పైనపై నానగొల్పి.
పాదుషా తనవ్రణముల బాగుపఱచు
దానికై యతడు కృతజ్ఞతప్రణామ
శతముల నొనర్చి కొలువు విషయముమాత్ర
మెత్తకుం డేని కొకరిచే నెత్తబడితి
నంచు బ్రత్యుత్తరము నిచ్చె నచలు డగుచు.
రాజభక్తున కిద్ది కాలంబు కాదు
దేశవిద్రోహికే గాని దిక్కులేదు
పాడుకాలాన బ్రతికెడి బ్రతుకుకంటె
చచ్చి స్వర్గాన నుండుటే సబబటంచు.
పాలితుల కన్నబిడ్డలపోలె పాల
నమ్మెనర్చు తాన్ మరణించ నన్నుబోలు
అతని యుప్పుగల్ దిన్నవా రతనివెంట
పోకయుండుట తగ దంచు బుద్ధి నెంచి.
గోలకొండనవాబుపై గూర్మి దనను
వెంట తరుమ నిట నిక నే నుంట పాడి
గా దని మది నెఱింగి వీడె ఘనత ప్రాణ
ముల నతడు తనస్వామిని కలిసికొనఁగ
పైడిటంకాలకై యాసపడ డతండు

మాతృదేశానురాగంబు మాప దతడు
గొప్పపదవులకొఱకునై కోర్కెపడడు
దోప మెఱుగని రాజభక్తుం డతండు.

౧౦

అబ్దులా! ఆంధ్రదేశాన సంతరించ
లేదులే యింకను ప్రసిద్ధయోధపూజ
నమ్మొనర్చుట. భయమేమి నమ్మియుండు
తెలుగులే నీపన ధరిత్రి తెలుపగలరు.
గొప్పబుద్ధిని గోల్పోయి కొలువుచేసి
యాత్మలేనివారలుగా దయారయినను
భరతపుత్రులుమాత్రము మఱువలేదు
పూర్వవీరప్రతిష్ఠను బాగడికొనుట.

౧౧

మెఱుగుబెట్టిన బంగారుమినుకుబోలి
యంబరంబున నబ్దులు హస్త మెత్తి
జలదగంభీరరవమున బలుకుచుండ
మాతృదేశసమర్చనామహిమగూర్చి.

౧౨

స్వర్గవీథిని రంభ

ప్రాజ్యసామ్రాజ్యసంరక్షణార్థము పరి
భూతసమరసత్సమయవిముక్త చటుల
ఘనశతఘ్నుల స్వీయవక్షస్థలమ్ము
ఒకసహస్రము చెక్కలై యొనరుపబడు
ధృతిని జెసనివానిదియె మత్ప్రేమసీమ.

---

# చిన్నపిల్లల చిత్తప్రవృత్తులు - శిశు శిక్షణము

శ్రీ గిడుగు వేంకటసీతాపతి

మనలో చాలామంది విద్యాభ్యాసమంటే అక్షరాభ్యాసమే అనుకొంటారు. అక్షరాభ్యాసము సాధారణంగా మగపిల్లలకైనా ఆడపిల్లలకైనా అయిదోయేట అయిదోమాసంలో చేయడం ఆచారం; గనుక, ఈ నాలుగేండ్ల నాలుగుమాసాలలోను పిల్లలు నేర్చుకోగల విద్య ఏమి ఉండగల దనుకుంటారు; గాని, జాగ్రత్తగా ఆలోచిస్తే, ఈకాలమందలి శిశుశిక్షణము చాలా ముఖ్యమైన దనిన్ని, దీనినిబట్టి అక్షరాభ్యాసమైన తర్వాత నేర్చుకొనే విద్య ఫలిస్తూ ఉంటుందనిన్ని బోధపడుతుంది.

ఈ ప్రారంభదశలో శిశుశిక్షణము చేయబూనుకొన్నవారు చిన్నపిల్లల చిత్తప్రవృత్తులను బాగుగా తెలుసుకొన్నవారై ఉండవలెను; చిన్నపిల్లలతో సమంగా ఆడుకొంటూ, పాడుకొంటూ, పిల్లలలో పిల్లలవలెనే మెలగగల ఉత్సాహమూ, ఓర్పు, నేర్పుగలవారు కావలెను; పిల్లలయెడల వాస్తవమైన ప్రేమ, అనురాగం, వారిబుద్ధి వికసింపజేదా మనేదీక్ష గలవారు కావలెను. పై లక్షణాలు లేనివారు ఎంత గొప్ప పండితులైనా శిశుశిక్షణము చేయడానికి పనికిరారు. అట్టివారిశిక్షణములో పడినపిల్లలు పాడుకావడంనే జరుగుకును.

చిన్నవారికైనా పెద్దవారికైనా విద్యనభ్యసించేవారికి ఉండవలసిన లక్షణములలో ముఖ్యమైనది ఏకాగ్రత. ఏకాగ్రత అనగా ఏ విషయ మభ్యసిస్తామో అందులో మన మనస్సు ఇతర విషయములలోనికి చెదిరిపోకుండా పూర్తిగా అందులోనే లీనమయేటట్టు ప్రవేశపెట్టడము. దానికే తదేకధ్యానంగా, ఏకాగ్రచిత్తతతో బుద్ధిని నిలపడం అంటారు. ఇది సులువుగా సాధ్యమయేది కాదు. పెద్దవాళ్ల విషయంలోనే చిత్తము కోతివంటిది; నిలకడగా ఒకచోట పట్టుమని పదినిమిషాలుండ దంటారుగదా, పిల్లలవిషయంలో చెప్పేదేమిటి? అనాగరికులయిన అడవిజాతులవారిలో ఎంత పెద్దవారికైనా ఈ ఏకాగ్రత చాలా తక్కువ. సవరల ఆచారవ్యవహారాది విషయములు సవరభాషలో సవరలనే అడిగి తెలుసుకొందా మని సవరదేశంలో సవరవాళ్లను కూర్చోబెట్టుకొని ప్రసంగిస్తూ ఉండేవాడను. అప్పుడు నాకు ఈ విషయం అనుభవములోనికి వచ్చినది. ఉదయం బుద్ధి స్ఫుటంగా వికసించవలసిన సమయంలో వాళ్లను కూర్చోపెట్టి ఒక విషయంగూర్చి పట్టుమని పదినిమిషాలు ప్రసంగించేసరికి ఆ సవర వాళ్లలో ప్రతివాడు విసిగిపోయి, ఆవలిస్తూ నేను అడిగే ప్రశ్నలపై దృష్టిలేక ఇటూ అటూ చూస్తూ ఉండేవాడు; మధ్యమధ్యను వాళ్లలో వాళ్లు మాటలాడుకొనేవారు; ఒకడుండేలు ఆప్రక్క నెక్కడైనా కనబడితే దానికోసం వేటచేయడానికి చట్టున లేచి పారిపోయేవారు. అందుచేత, పదిపదిహేను నిమిషాల కంటె ఎక్కువగా వాళ్లతో ఏవిషయమూ సాంతంగా విమర్శించడానికి నాకు అవకాశము లేకపోయేది.

ఈ ఏకాగ్రతవిషయంలో ఆ సవరలువంటివాళ్లే మన పిల్లలుకూడాను. ఇటువంటివాళ్లకు ఏకాగ్రత నేర్పవలె నంటే, ఎంతకష్టమో ఆలోచించండి. కష్టమని ఊరుకొంటే అది ఎన్నటికీ దానంతట అది సులువుగా అలవడేది కాదు. ఏకాగ్రత లేనివారికి

ఏవిద్యా పట్టుపడదు, ఏ పని నిర్వహించడానికీ తగిన అర్హత రాదు.

శిశుశిక్షణంలో ఈ ఏకాగ్రత పిల్లలకు కలిగించడ మనేది ముఖ్యమైన పనిగా గుర్తించవలెను; గనుక, ఈ పనికి పూనుకొన్న విద్యాధికులు చిన్నపిల్లల చిత్తప్రవృత్తులు పరిశోధించి కొన్ని విషయములు తెలుసుకొన్నారు.

ఈ ఏకాగ్రబుద్ధి పిల్ల లందరికీ ఒకేవిధంగా ఉంటుం దని చెప్పలేము. కొందరికి ఎక్కువగాను, కొందరికి తక్కువగాను ఉంటుంది; గాని, శిశుశిక్షణము సమానంగానే పొంది సమానవయస్కులైన పిల్లలలో సాధారణంగా అట్టి తేడా కనబడదు. ఒకడే పిల్లవాడి ఏకాగ్రబుద్ధి అయినా అన్ని విషయాల్లోను ఒకేరీతిగా ఉంటుందని చెప్పడానికి వీలులేదు. జాగ్రత్తగా పరిశీలించినయెడల ప్రతిపిల్లవాడికీ ఏదో ఒక విషయంలో ఆసక్తి మెండుగా ఉండి అందులో ఏకాగ్రత ఎక్కువగా ఉండడం కనబడుతుంది. శిశుశిక్షణము చేయడానికి పూనుకొన్న వారు ఈ లక్షణం తమశిక్షలో ఉన్న ప్రతిపిల్ల (పిల్లవాడి) విషయంలోను గుర్తించవలెను. ఇది మొట్టమొదట చేయవలసినపని. ఈ పరిశోధన పిల్లలు ఆటలాడుకొంటూ ఉన్న సమయంలోనే చేయవలెను. అప్పుడే పిల్లల చిత్తప్రవృత్తులు స్పష్టంగా బయటపడతవి. పరిశోధనచేసే వారు తరుచుగా నాలుగువిధాల ఆటలకూ పిల్లలకు అవకాశ మిచ్చి, నాలుగు రకాల ఆటవస్తువులూ వారి ఎదుట పెట్టి పిల్లలను స్వేచ్ఛగా ఆడనిస్తూ తాను కొంచెం దూరాన నిలిచి వాళ్ల స్వేచ్ఛకు భంగం కలుగనీయకుండా పిల్లల అభిరుచులు, ఏకాగ్రదృష్టి మొదలయిన చిత్తప్రవృత్తులు గుర్తిస్తూ ఉండవలెను. ఇట్లు వందలకొలది పిల్లలను గుర్తించినవా రేమంటారో చూడండి.*

రెండేండ్ల పిల్లలు సాధారణంగా ఒకే ఆటవస్తువుతో తదేకధ్యానంగా ౭ నిముషములసేపు ఆడుకొంటారు; ౨౫ నిమిషములసేపు ఆడుకొన్న పిల్లలు సైతము ఉన్నారు. వాళ్లు విశేష ప్రజ్ఞ గలవారు.

మూడేండ్లపిల్లలు సాధారణంగా ఒకే ఆటవస్తువుపైని ౧౩ నిమిషములు బుద్ధి నిలుపగలరు; నూరు నిమిషములవరకూ బుద్ధి నిలపగల పిల్లలు లేకపోలేదు.

నాలుగేండ్ల పిల్లలు ౧౯ నిమిషములున్నూ, అయిదేండ్లపిల్లలు ౨౮ నిమిషములున్నూ తదేకధ్యానంగా ఒకే ఆటవస్తువుతో ఆడుకోడం తరుచుగా కనబడుతుంది. అయితే, ఈ యీడు పిల్లలలో కొందరు తాము కల్పించుకొన్న ఆటలో ఆసక్తి ఎక్కువగా గలిగి సుమారు మూడుగంటలసేపు తదేకధ్యానంగా బుద్ధి చెదరనీక ఆడుకోడంసైతము కనబడినది. ఇది చాలా గొప్పవిశేషము. ఆరుఏండ్లు రాకపూర్వమే ఏకాగ్రదృష్టి పిల్లలకు ఒకవిధంగా ఏర్పడుతుంది. శిశుశిక్షణమునకు పూనుకొన్నవారు పైదేశాలలో ఈవిషయం ఎట్లు గుర్తించారో ఆలాగుననే మనదేశంలో సైతము గుర్తించి మన పిల్లల ఏకాగ్రదృష్టి ఎట్లున్నదో వివరించి తెలుసుకోవలెను. ఏ పిల్ల (వాడి) కే ఆటవస్తువుపై, ఏ విషయంలో ఎంతసేపు ఏకాగ్రదృష్టి నిలిచి ఉంటుందో గుర్తించినయెడల దాని ననుసరించి ఆ పిల్ల(వాడి) కనుకూలమైన శిక్షణము చేయుటకు మార్గ మేర్పడుతుంది.

ప్రతిపిల్ల(వాడి) విషయంలోను ఆపిల్ల (వాడి) కిష్టమైన ఆటద్వారానే విద్య నేర్పడం మంచిది.

నామనుమడు (కూతురికొడుకు) సుమారు అయిదేండ్ల ఈడుగలవాడైనప్పుడు నావద్దను మూడు మాసాలు ఉండగా అతడి చిత్తప్రవృత్తులు పూర్తిగా గుర్తించడానికి అవకాశం చిక్కినది. అప్పటకు నాకు కలిగిన అనుభవము జ్ఞప్తిలో నిండుగా ఉన్నది; గనుక, దానిని వివరించి మనవిచేస్తాను. ఆ అబ్బాయికి ఆటవస్తువులతో ఆడుకోగల ఈడు-అనగా రెండేండ్లు వచ్చినప్పటినుండిన్ని తలిదండ్రులు అనేకవిధములయిన

* చూ. **Concentration in young children by Mary V. Gutteridge published by the University of London Institute of Education p. 4.**

ఆటవస్తువులు తెచ్చి ఇస్తూ ఉండేవారు. ఆ ఆటవస్తువులన్నిటిలోను రైలుబండ్లు, మోటారుబండ్లు, విమానాలు, ట్రాముబండ్లు మొదలయిన వాహనాలకు సంబంధించిన ఆటవస్తువుల మీదనే తదేకధ్యానంగా దృష్టి ఉంచి ఆడుకోడంలో అతడికి సరదా ఎక్కువ. ఈ సరదా అతడికి మూడవ ఏటను ప్రారంభించినది. నావద్దకు అతడు వచ్చిన తర్వాత ఒకసారి ఆటవస్తువుల అంగడికి అతనిని తీసుకొనిపోయి 'నీ ఇష్టం నీకే ఆటవస్తువులు కావలెనో తీసుకో; కొంటాను' అన్నాను. ముద్దులు మూటకట్టుతూ ఉన్న బొమ్మలు అనేకంగా ఉన్నవి. ఆవేవీ వద్దన్నాడు. ఒక పెద్ద రైలుబండీ ఎంచుకొన్నాడు. ఇది నాకు చాలును మరి ఏదీ వద్దన్నాడు. దానికల పాడయి అందులో ఒక భాగము విరిగినదాకా దానితో ఆడుకొన్నాడు. ఆ ఆటలో అతడికి ఇష్టమైన విశేషాలేమంటే, సుద్దముక్క పట్టుకొని రైలుపట్టీలను సూచించే గీతలు గీయడం, అక్కడక్కడ స్టేషన్లు సూచించడం, రైలుపట్టీలలో శాఖలు చూపించడం, వాటిపైని రైలుబండీ నిలబెట్టి నడపించడం. మరతిప్పితే బండీ తాను కోరినట్లు తిరగక దాని త్రోవ నది పోతుంది; గనుక, మర తిప్పక చేతితో బండీ నడపిస్తూ ఆడేవాడు. అప్పుడు నేను అతడి ఆటసరదాకు అనుకూలంగా అతడికి తెలిసిన స్టేషన్ల పేర్లు సుద్దతో వ్రాసేవాడను. బండీ భాగాల పేర్లు, ఎన్ని భాగాలున్నవో, ఎన్ని స్టేషన్లు ఉన్నవో వాటిని గుర్తిస్తూ సంఖ్యలు మొదలయిన విషయాలు ఆటగానే చెప్తూ ఉంటే సరదాగా శ్రద్ధపెట్టి నేర్చుకొనేవాడు. ఆ అబ్బాయికి జంతువుల బొమ్మలు, చెట్లబొమ్మలు వ్రాయడం, చీట్లపేకముక్కలు - రంగులనుబట్టికాని, బొమ్మలను చుక్కలను బట్టికాని - పేర్చడం సైతము సరదాగానే ఉండేది. ఈ ఆటలను ఆధారంగా తీసుకొని ఎన్నో విషయాలు అతనికి బోధించడానికి అవకాశము చిక్కినది.

ఇటువంటి అవకాశాలు ఇంట్లో తలిదండ్రులకు గాని బడిలో శిశుశిక్షణమునకు పూనుకొన్న వారికి గాని సదా దొరుకుతూనే ఉంటవి. ఇట్టి అవకాశాలు పోగొట్టుకో కూడదు. ఈ విధంగా శిశుశిక్షణము చేయదలచుకొన్న బడులలో అనేకవిధములయిన ఆటలకు అవకాశం కలుగజేస్తారు.

ఎప్పుడైనా ఒక పిల్ల(వాడు) అలసత చూపించినా, బోధించే విషయమందు దృష్టిలేనట్లు కనబడినా, ఇతరవిషయములపైకు దృష్టి చెదిరిపోతున్నట్టు ఉన్నా, ఆ పిల్ల (వాడి) నెన్నడును నిందించరాదు. ఆ తప్పు శిశుశిక్షణమునకు పూనుకొన్నవారిదే కాని ఆపిల్ల(వాడి)ది కాదు. అప్పుడు నిందించి కొట్టినా, తిట్టినా ఆపిల్ల(వాడు) చిన్నపుచ్చుకొని దుఃఖము పట్టలేక ఏడవడమో, భయపడి మ పోయినట్లు చూడడమో జరుగుతుంది. ఆపిల్ల(వాడి) బుద్ధి మరింత మందమవుతుందిగాని వికసించదు. అట్టిసమయంలో శిశుశిక్షణము చేసేవారు ఆ పిల్ల(వాడి) కేయాటలో లేదా ఏవిషయంలో అభిరుచి మెండుగా ఉంటుందో అందులో పని కలిగించి, ఆనందం పొందించి, బుద్ధిని వికసింపచేయవలెను.

ఏకాగ్రత ఎక్కువగా గలవారు తెలివైనవారని కొన్నివేళల చెప్పవచ్చునుగాని ఏకాగ్రతలో లోపం కనబడ్డప్పుడల్లా అందుకు తెలివితక్కువతనమే కారణమనలేము. ఇందుకు మన అనుభవమే విమర్శించుకో వచ్చును. సభలలో సభారంజకముగా వక్త ఉపన్యసించినా, గాయకుడు గానముచేసినా సభ్యులు నిశ్శబ్దముగా, తదేకధ్యానంగా వింటారు. ఉపన్యాసంలో పసలేకపోయినా, గానంలో ఇంపు లేకపోయినా సభ సంతలాగు అల్లరితోను, కేకలతోను నిండిపోతుంది. అట్లాగే చెప్పిన విషయముమీద పిల్లల దృష్టి నిలవకపోతే ఆతప్పు చెప్పేవారిదే కాని పిల్లలది కాదని గుర్తించవలెను.

ఒక్కొక్కపిల్లను ప్రత్యేకించి తర్బీతు చేయడంకంటె నలుగురు పిల్లలను చేరదీసి శిశుశిక్షణము చేయడంవల్ల ఎక్కువ మేలు కలుగుతుంది. ఒకటే ఆటలోగాని, విషయంలోగాని అభిరుచి సమానంగా ఉన్న నలుగురుపిల్లలకు వారికిష్టమైన ఆట కల్పించి కూర్చుండబెట్టినప్పుడు, ఒకరిని చూచి ఒకరు ఎక్కువ ఉత్సాహము పొందుతారు; ఒకరికొకరు తోడుపడుతారు; ఒకరి నొకరు మించడానికి చూస్తారు; అప్పుడు ఏకాగ్రదృష్టి ఎక్కువవుతుంది.

(౫౩౮-వ పేజీ చూడుడు)

# బాలకవి శరణ్యము - అనుబంధము

శ్రీ గిడుగు వేంకటసీతాపతి

మా తండ్రిగారు కీ. శే. కళాప్రపూర్ణ గిడుగు వేంకట రామమూర్తిపంతులుగారు రచించిన బాలకవి శరణ్యము వారి "సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణము"లలో ఒకటిగా తద్గ్రంథ సంపాదకులున్ను ప్రకాశకులున్ను అయిన శ్రీ తెలికిచెర్ల వేంకటరత్నంగారు నవంబరు ౧౯౩౩ లో ప్రకటించారు. అందులో వారు తెలియ జేసినట్లు (చూ. iii సంపాదకీయ భూమిక; పు. ౧౧౧) మొదటి రెండుప్రసంగములు మాత్రమే మా తండ్రిగారు స్వయంగా రచించినవి. తక్కినవన్నీ వారు అస్వస్థతచేత రచించడమునకు వల్లపడనందున— వారు చిత్తుగా వ్రాసిపెట్టుకొన్న 'నోట్సు' చూచి నేను రచించినవి. వేగము అచ్చుకావలెనని ప్రకాశకులు తొందర పెట్టడంవల్ల ముఖ్యమైన విషయములుమాత్రమే ఎత్తుకొని ఏదో ఒకవిధముగా గ్రంథము పూర్తి చేయవలసి వచ్చినది. అందుచేత మొదటి రెండుప్రసంగములున్ను ఉన్నంత నిండుగా తక్కిన ప్రసంగములు లేవు. ఈ గ్రంథము అచ్చుపడ్డతర్వాత వారు స్వర్గస్థులయినవరకున్ను వారు తమవద్దనున్న ప్రతిలో తమఅలవాటు చొప్పున తమకు కొత్తగా కనబడ్డ ప్రయోగాలూ, దిద్దుబాట్లూ, సవరణలూ మొదలయినవి ఆయాస్థలములలో వ్రాసిపెట్టుకొన్నారు. ఈగ్రంథము మరల ముద్రించేటప్పుడు ఇవి యథోచితంగా చేర్చుకొందామనుకొన్నారు. ఈసారి గ్రంథము అచ్చువేసినప్పుడు అన్ని ప్రసంగములూ వారే స్వయంగా రచించేటట్టు చేదామని నేననుకొన్నాను. ఇంతలో వారు స్వర్గస్థులగుటవల్ల మా కోరిక నెరవేర లేదు. ఈసారికూడా వారు వ్రాసిపెట్టుకొన్న నోట్సుచూచి నేనే ఈగ్రంథము సవరించి ప్రకటించవలసి ఉన్నది.

బాలకవి శరణ్యమునకు అనుబంధముగా మా తండ్రిగారు వ్రాసిపెట్టుకొన్న నోట్సునుబట్టి కొన్ని ప్రసంగములలోగల విషయములు తెలియజేస్తాను. ఈగ్రంథము దగ్గరలేని పాఠకులకు పైతము సులభముగా బోధపడవలెనన్న ఉద్దేశంతో అందులో ఉన్న వాక్యములు సందర్భోచితంగా ఎత్తుకొంటూ వ్రాస్తాను:

## చేసినాను

భూతార్థక క్రియాజన్య విశేషణ రూపములపైని ప్రథమ, మధ్యమ, ఉత్తమపురుష సర్వనామములు చేరగా ఏర్పడిన 'వచ్చినవాఁడు, దండించినవాఁడవు, వచ్చినవాఁడను, చూచినయది, ఉన్నది' మొదలయిన రూపములు మొదట క్రియావిశేషణములుగానే ఉండి నన్నయకాలమునాటికే భూతకాలక్రియారూపములుగా పరిణమించినవి. గాని, 'వచ్చెను, దండించితివి, వచ్చితిని' మొదలయిన భూతకాల క్రియారూపములే తరుచుగా నన్నయాది ప్రాచీనకవుల గ్రంథాలలో కనబడుతున్నవి.

"వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనగ రాదు" అన్నప్పుడు 'వచ్చినవాఁడు' అనే ప్రయోగంలో 'వచ్చెను, వచ్చాడు' అనే భూతకాల క్రియావిశేషణము కాదు స్ఫురించేది. 'వచ్చినటువంటివాడు ఎవ డను కొన్నారు? వాఁడూ వీఁడూ కాదు; అర్జునుడు సుమండీ' అనే భావం స్ఫురింపజేసే రీతిగా వాక్యారంభమందున్న క్రియావిశేషణము అది. ఇదే 'ఫల్గునుఁడు వచ్చినవాఁడు" అని ఉంటే పైని చెప్పిన భావస్ఫూర్తి తగ్గిపోతుంది. ఈ అర్థంలో వచ్చినవాఁడువంటి రూపాలు నేటికిన్ని నిల్చి ఉన్నవి. 'అడిగినవా డెవఁడు? పెట్టినవా డెవఁడు? పిలిచినవాఁడను నేను' ను. కేవలము భూతకాలక్రియాభావం గల వచ్చినవాఁడు, వచ్చినవాఁడవు, వచ్చినవాఁడను మొ. రూపములు మాత్రము క్రమక్రమముగా మారుతూ వచ్చినవి.

నన్నయనాటిభాషలో ఇచ్చినవాఁడవు, చేసినవాఁడవు మొ. నిండు రూపములే ఉండేవి. తిక్కన

కాలానికి 'ఇచ్చినాఁడవు (శాంతి ii ౮౭); చేసినాఁడవు (శాంతి i ౫౪3) అనే రూపాలు వచ్చినవి. అరవంలో ఎల్లవరుక్ అనే రూపము ఎల్లారుక్ అయినట్లే, తెలుగులో మగవాఁడవు, మగాఁడవు అయినట్లే, చేసినవాఁడవు చేసినాడవు అయినది..

ఇట్టి రూపాలకు గతి కల్గించడానికి చిన్నయసూరిగారు "ఉన్న కలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు" అనే సూత్రము రచించారు.

తిక్కనగారికాలములోనే పైని చెప్పినరూపాలలో మరియొక మార్పుసైతము ఏర్పడే సూచన కనబడినది. శాంతిపర్వంలో నాలుగో ఆశ్వాసం ౮,౧౧౧-వ పద్యమందు 'పేదపడ్డా డవు'అనే ప్రయోగ మున్నది. పడినవాఁడవు, పడినాఁడవు అయినప్పుడు వకారము పోయినది. పడినాఁడవు పడ్డాఁడవు కాగానే నకారముపోయినది. వకారము పోవడంవల్ల, నకారమునకు దీర్ఘము వచ్చినట్లే, నకారము పోవడంవల్ల దానికి పూర్వమందున్న డకారమునకు ద్విత్వం వచ్చింది. తిక్కనగారివలెనే ఎఱ్ఱాప్రెగ్గడగారుసైతము ఉత్తర హరివంశములో 'కీర్తింపఁబడ్డాఁడు' అని ప్రయోగించారు. ఈ 'పడ్డాఁడవు'వంటిరూపాలకు గతి కల్పించవలెను గనుక 'పడ్వాదుల నవర్ణకంబున కత్వంబును, గడపాల్లనకు ద్విత్వంబును విభాష నగు' అనేసూత్రం సైతము చిన్నయసూరిగారు రచించారు.

పడ్డాఁడు సాధువయినప్పుడు ఇడ్డాఁడు, చెడ్డాఁడు సాధువు లనకతప్పదు.వకారము పూర్తిగా పోయినరూపములే సాధువులయినప్పుడు ఉన్నాఁడు, అన్నాఁడు, కన్నాఁడు, కొన్నాఁడు, తిన్నాఁడు, విన్నాడు,చన్నాఁడు మొదలయిన రూపాలుసైతము సాధువులే అనవలెను.అయితే ఇంతవరకు కలిగిన మార్పులనుబట్టి మధ్యమపురుషరూపాలలో మహతైన యెడల ఇచ్చినాఁడవు, ఉన్నాడవు, పడ్డాఁడవు మొదలయిన రూపాలున్ను, ఇతరమైనయెడల ఇచ్చినదానవు, ఉన్నదానవు, పడ్డదానవు మొదలయిన రూపాలున్ను గ్రామ్యములే కాని 'ఇచ్చినావు, ఉన్నావు, పడ్డావు' మొదలయిన రూపాలు అసాధువు లనవలసి వస్తుంది. 'పొందినావు' అనే ప్రయోగం ఆంధ్రప్రసన్నరాఘవంలో కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు చేసినందుకు వేదము వేంకటరాయశాస్త్రులవారు ఆక్షేపించారు 'అనుగ్రహితౌ'మన్నారు.

అయితే ఈ తప్పు ఎవరిది? ప్రయోగంచేసినవారిదా? ఈ ప్రయోగాన్ని గ్రహించి వ్యాకరణ సూత్రాలలోనికి చేర్చుకోని చిన్నయసూరి మొదలయిన లక్షణకర్తలదా? నన్నయ ప్రయోగించకపోయినా తిక్కన ప్రయోగించాడు గనుక చేసినాఁడవు, పడ్డాఁడవు, ఉన్నాఁడవు సాధువు లని సూత్రంలో చేర్చుకొన్నాము అని కదా చెప్పవలెను. అప్పుడు, తిక్కన వాడక పోయినా పెద్దన ప్రయోగించాడు గనుక 'చేసినావు,పడ్డావు,ఉన్నావు.' సాధువులే అని గ్రహించి ఎందుకు ఒక సూత్రము రచించరాదు? పెద్దన మొదలయిన కవులు అనేకులు ప్రయోగించారు. బాలకవి శరణ్యములో ఇదివరకు ప్రకటితములైనవి కాక ఇంకా కొన్ని ఉన్నవి. వాటిలో క్రీ. శ. ౧౬౬౦ కలిదిండి భావనారాయణ కవి రచించిన విష్ణుపురాణమందు 'తుష్టి నొందినావు' (౧.3౩౬), 'పట్టినావు' (౧.౫౬౦) అనే ప్రయోగా లున్నవి.

పడ్డావు వంటిరూపాలు సాధువైన తర్వాత 'వచ్చావు, నేర్చావు, మ్రొక్కావు,తగ్గావు, కొట్టావు, అమ్మావు, కోరావు, కోశావు' మొదలయిన రూపాలు సైతము సాధువు లనవలసి వస్తుంది. రెండువందల సంవత్సరాలయి ఇవి వాడుకలో ఉన్నట్టు శాసనాలలోను; వ్యాఖ్యలు, తెలిబిడి మొదలయిన రచనలలోను, కథలు, పాటలు, యక్షగానాలు మొదలయిన వ్యావహారిక భాషావాఙ్మయంలోను ఈ రూపాలు తెలుగుదేశంలో నిలిచి ఉన్నవి; గనుక, సాధువులే.

ఇప్పుడు వాడుకభాషలో రచనలు సాగిస్తూ ఉన్నవారు ఈ ప్రయోగాలు చేస్తున్నారు. అయితే వారిలో కొందరు కొట్టేవు అని వ్రాయవలెనా? కొట్టావు అని వ్రాయవలెనా? అని చిక్కుపడుతున్నారు. ఈ మాటలలో సందేహం కలిగిస్తూఉండే అచ్చు కేవలము ఏ కాదు ఆ కాదు. రెండింటికి మధ్యగా ఉంటుంది. ఇంగ్లీషు man లో ఉండే స్వరము వంటిది. సందర్భమునుబట్టి తెలుసుకోగలదే గనుక

ఎట్లు వ్రాసినా ఒకటే; కాని, 'కొట్టేవు, నవ్వేవు' అని వ్రాస్తే 'పాపా నవ్వే రేవతైన విన్న' అన్నప్పుడు నవ్వేరు అన్నట్టు ప్రయుక్తమయినదేమో అన్న భ్రమ కలుగుతుంది గనుక, 'కొట్టావు, నవ్వావు' అని వ్రాయడమే మంచిదేమో. అయితే, ఇందులో ఆకారము వ్రాసినట్టు పలుకుతే బాగుండదేమో అనవచ్చును. అందుచేత ఏదైనా ఒక చిహ్న దంత్య చ జ లను సూచించడానికి పెట్టినట్టు పెట్టవచ్చును.

శబ్దము ననుసరించి తెలుగులిపి చక్కగా ఏర్పడినదని మన మెంత సంతోషించినా, మన తెలుగు లిపిలో పైతము రెండు (కొద్దిగానే వినా) భిన్నస్వరములకు ఒకే అక్షరముండడము లేకపోలేదు. మేక - మేకు; పేడ–పేడు; ఏడాది–ఏడు; మెతక–మెతుకు; వెలపల–వెలుతురు; కోట–కోటు; పొన్న–పొన్ను, మొ. పలికిచూచుకోండి.

తాటాకు ఇదివరకే వ్రాతలోకి వచ్చిందిగదా. వచ్చాను, చేశాను, తింప్పేను మొదలయిన రూపాలలో తాలవ్యముపై ఆకారము మనము కోరినట్టే పలుకుతుంది. తక్కినవి ఆరంభంలో చిక్కుగా ఉన్నా కొన్నాళ్లకు పరిచయం కాగలవు.



## చిన్నపిల్లల చిత్తప్రవృత్తులు - శిశు శిక్షణము (౫౩౧-వ పేజీ తరువాయి)

ఒక్కరే కూర్చుండి పనిచేసినప్పటికంటె నలుగురూ చేరి పనిచేసినప్పుడు తదేకధ్యానంతో పనిచేసే ఉత్సాహం, ఓపిక ఎక్కువ కావడం పెద్దలలో కనబడ్డట్టే పిల్లలలో కూడా కనబడుతుంది. అందుచేతను, ఇంటివద్దను పిల్లనుగానీ పిల్లవాడినిగానీ ఒక్కరినీ కూర్చోపెట్టి ఆడించడంవల్ల గాని విద్యచెప్పించడం వల్ల గాని అట్టే మేలు కలుగదు; సరిగదా, కొంతవరకు కీడుసైతమూ కలుగవచ్చును. ఎక్కువకీడు ఏమంటే, ఒంటెత్తుతనం, అసహనం, దురభిమానం, అహంభావం - మొదలయిన దుర్గుణాలు కొద్దిగానో గొప్పగానో తలచూపుతూ ఉంటవి. ఈదుర్గుణాలు అణచివేయడానికి గాని ఎక్కువ కాకుండా చేయడానికిగాని విరుగుడుసాధనాలు లేకపోలేదు. సాధారణంగా ఒకొక్క పిల్లకుగాని పిల్లవాడికిగాని ఇంటివద్దను ఆడించడం, విద్య చెప్పించడం గొప్పవాండ్ల ఇండ్లలో జరుగుతూ ఉంటుంది. ధనవంతులు గనుక వారు పదిమంది పిల్లలను ఇంటికి రప్పించి ఆ పిల్లలతో తమ పిల్ల (వాడు) ఆడుకొనేటట్టు, పాడుకొనేటట్టు, చదువుకొనేటట్టు చేయవచ్చును. అప్పుడు పైని చెప్పిన దుర్గుణాలు తగ్గిపోవచ్చు; శిక్షణము చేసే వారు ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నయెడల పూర్తిగా పోవచ్చు.

అక్షరాభ్యాసానికి పూర్వం కావలసిన శిశు శిక్షణములో ముఖ్యమైన విషయం పిల్లలలో ఏకాగ్రత నిలిచేటట్టు చేయడమే కనక దానినిగురించి ఎక్కువగా ఈవ్యాసంలో తెలియజేశాను. ఈ మొదటి నాలుగు సంవత్సరాల నాలుగు మాసాలలోను అక్షరజ్ఞానము అక్కరలేకుండానే పిల్లలు ఏయేవిషయములు ఆటలు, పాటలు, కథలు, ప్రసంగాలు మొదలయిన సాధనాల ద్వారా నేర్చుకోవచ్చునో రాబోవు వ్యాసంలో తెలియజేస్తాను.

# బాలానందం

## సముద్రతీరాన పిల్లల ఆటలు

అంతకంతకూ మీదికి పొంగుతు,
అదిగో! కెరటము వస్తూ వున్నది.
ఎంతటిలో కొండంతటి ఎత్తున
ఎగురుతు లేచిందో ఆ కెరటం!

సరిసరి సరిసరి చప్పున పడినది
జరజర జరజర చప్పుడుచేస్తూ
తొరగా మీదికి ఉరుకుతు ఉన్నది
పరుగెత్తండీ! పరుగెత్తండీ!

మీదికి వచ్చిన కెరటము నీటను
పాదా లపుడే తడిశాయ్; పోనీ.
చేదా మొకపని: అందరు రండిటు;
చేతులు పట్టుక నిలబడి ఉందాం.

జరజర జరజర వెనుకకు పోతూ
కిరకిర కిరకిర జిలజిల మంటూ
నురుగులు కక్కే నులివెచ్చని నీ
రరకాళ్లెల్లా బరుకుతు ఉన్నదో.

పెనగొని మరియొక కెరటము లేచెను;
వెనుకటి కెరటముకంటె పెద్దది.
మన మిక్కడనే నిలబడి ఉందాం,
వెనుకకు భయపడి పరుగిడ వద్దిక.
అన్నిట తానే గొప్పదాన నని
ఆకాశము తాకాలని ఆశ!
మిన్నెక్కడ! తానెక్కడ! ఇంకా
మీదికి ఎగరడ మెందుకు? చాలును.
పెరుగుట విరుగుట కొరకే అని తా
నెరుగదు కాబో లెగురుతు ఉన్నది.
తొరగా మీదికి వచ్చిన కెరటము
తొరతొర వెనుకకు మరలక మానదు.
అదిగో పడినది; వచ్చిం దప్పుడె!
అంతే! భయమెందుకు? నిలబడదాం.
ఇది యొకసరదా; ఇది యొక వేడుక
ఇచ్చటనే మన మిక నిలబడదాం॥

— సీతాపతి.



# సంపాదకీయ వ్యాఖ్యలు

శ్రీ గిడుగు వేంకటసీతాపతి

## ౧ జ్ఞకారము

జ్ఞకారమును గురించి శ్రీ చెరుకూరి వేంకట జోగారావుగారు రచించిన వ్యాసములో జ్ఞకారము జకారఞకారముల సంయుక్తవర్ణముగా వ్రాయుట సరికాదనిన్నీ జకారఞకారముల సంయుక్తవర్ణముగా జ్ఞ అని వ్రాయవలెననిన్నీ బోధించారు. అందుకు వారు తెలియజేసిన కారణములేవంటే:

(౧) వారి బాల్యంలో వారి గురువులు జ్ఞ అని వ్రాస్తూ ఉండేవారు.

(౨) ఆ కాలంలో అదే సంప్రదాయ సిద్ధముగా ఉండేది.

(౩) నాగరిలిపిలో ఏకవర్ణమే ఉన్నది; గాని రెండు ధ్వనులకు రెండువర్ణములసంయోగ ముండవలెను, అందులో మొదటిది జకారమే. నాగరిలిపిలో ఏకవర్ణ ముండుట సరికాదు.

(౪) యజ్ నుండి వచ్చినా యజ్ఞశబ్దములోని జ్ఞకారము జ్ఞకారము కావచ్చును. ధాతువర్ణములు మారుతూఉంటవి. యాగశబ్దము వచ్చినదికాదా?

(౫) జ్ఞానశబ్దములో జకార మున్న దనడానికి ఎవరూ కారణం చెప్పలేకపోయినారు.

(౬) జఝోర్జ్ఞః అని భట్టోజీ దీక్షితులు చెప్పడానికి హేతువు కనబడలేదు. వారు నాగరిలిపిని అనుసరించక తెలుగులిపిని అనుసరించి జాబులకుగల పోలిక వల్ల పొరపాటు పడినారు.

జోగారావుగారు చెప్పినది సరిగాలేదు.

జ్ఞకార మిప్పుడు వ్రాతలో ఉన్నట్లు ఎవరూ ఉచ్చరించకపోవడము నిజమే కాని నేడు మనము ఉచ్చరిస్తూ ఉన్నట్లే పూర్వులు ఉచ్చరించేవారనడానికిగాని, జ్ఞకారము ఎప్పుడూ జఞల సంయుక్తవర్ణముగా ఉచ్చరించడం జరగలే దనడానికిగాని నిదర్శనమేమీ లేదు; సరిగదా, జ్ఞకారము మొదటనుండిన్నీ జఞల సంయోగమువల్లనే ఏర్పడినట్లు చెప్పడానికి కావలసినంత ప్రమాణమూ, నిదర్శనమూ ఉన్నది. నాగరిలిపిలో ఇప్పుడు కనబడుతూఉన్నది ఏకవర్ణమని జోగారావుగా రనుకొంటున్నారు. ఇది జఞల సంయోగంవల్ల ఎట్లు పరిణమించినదో అశోకుని కాలము నుండి నేటివరకున్నూ వస్తూవున్న లిపులను శాసనములందు చూచి తెలుసుకోవచ్చును.

దేవనాగరి లిపి

జ —

ఞ —

జ్ఞ —

బ్రాహ్మీశాతవాహన(ఆంధ్రకర్ణాట) లిపి

జఝోర్జ్ఞః అని చెప్పిన భట్టోజీదీక్షితులుగారు పొరపాటు పడ్డారని చెప్పడంకంటె పెద్దపొరపాటు మరి ఉండబోదు.

వశిసంబుద్ధ్యోః (vili. ౩. ౫.) అనే సూత్రం క్రింద వ్రాసినవ్యాఖ్యచూస్తే జఝోర్జ్ఞః, రాజ్ఞః,

రాజ్ఞా అని ఎందుకు వ్రాయవలసివచ్చినదో బోధపడుతుంది. అక్కడ వారు చెప్పినది జకారమే కాని జోగారావుగారు అనుకొన్నట్లు ఞకారము కాదు.

ధాతువర్ణములు మారుతూ ఉంటవని మనకు కావలసినట్లు ఏవర్ణముపడితే ఆవర్ణమే రావచ్చుననడము సమంజసం కాదు. ధాతువునుండి పదములు ఏర్పడుతవి అనడం వ్యాకరణ పరిభాష. వాస్తవముగా భాషలో పదా లున్నవి. వాటినుండి ధాతువు ఏర్పరచి పదముల పరిణామం శబ్దస్వర శాస్త్రమునుబట్టి బోధపరచుకొంటాము. పైసూత్రంతోపాటు "స్తోశ్చునా శ్చుః (viii. ౪. ౪౦)", "యజయాచయత విచ్ఛ ప్రచ్ఛరక్షోనఙ్ (iii. 3. ౯౦)" మొదలయిన సూత్రములు సైతము చూస్తే, జ్ఞకారములో మొదటనుండిన్నీ జకార ఞకారము లున్నట్లు స్పష్టపడుతుంది. యాగ శబ్దము సైతము యజ్ఞశబ్దమువలెనే యజ్ నుండి వచ్చింది కాదా; ఇందులో కంఠ్యధ్వని కనబడుతున్నది గనుక యజ్ఞశబ్దము యగ్నముగా ఉచ్చరించి వ్రాయవలె నంటారు జోగారావుగారు. భాషలో వీరు చెప్పినట్లు యగ్న అని ఉండిఉంటే ఆపండితులు ఆయజ్ఞశబ్దమునకు కావలసిన ప్రక్రియ అందు కనుకూలంగానే చేసియుందురు, గాని వీరు చెప్పినట్లు లేదు. యజ్ఞశబ్దములో జకారమే వారికి వినబడినది గనుకనే యజ్—భావే న యజ్+న=యజ్+ఞ= యజ్ఞః అన్నారు. యాగ శబ్దమును గురించి "యజ్ — ఘఞ్ కుత్వం"అని చెప్పారు.

జ్ఞానశబ్దంలో జకారముంటుందనడానికి ఎవరూ కారణం చెప్పలేదంటూ రేమిటి జోగారావుగారు! అందులో జకారము లేకపోతే జానామి, జానే, జానీతే, జజ్ఞౌ, జజ్ఞే మొదలయినరూపాలు ఏలాగు వచ్చాయి? ప్రాకృతభాషలలో జాణశబ్దము జ్ఞాని(ని) నుండి వచ్చినది.

ఒరియాలో సర్వజ్ఞకు సర్బ్బగ్యా అంటారు.

ఈ కాలంలో జ్ఞకారము పలుకుటా నాలుగు విధాల పలుకుతున్నారు. ఆజ్ఞాశబ్దము కొందరు ఆగ్ఞగాను కొందరు ఆగ్యగాను, కొందరు అగ్నగాను కొందరు జోగారావుగారు చెప్పినట్లు అఙ్ఞగాను పలుకుతున్నారు. తెలుగులోని తద్భవరూపాలు చూస్తే చాలా కాలమయి జ్ఞకారోచ్చారణము ప్రజలనోట మారుతూ వచ్చిన దని చెప్పవలెను.

ఆజ్ఞ – ఆన; విజ్ఞానము – విన్నాణము; యజ్ఞము – జన్నము; యజ్ఞోపవీతము – జన్నిదము; సంజ్ఞ సన్న, సన్య, సస్య, సైగ; ప్రజ్ఞ—పగ్గియ, పగ్గ. ఐతే వీటిని చూచి తెలుగువారినోటను జ్ఞకారము సంస్కృత పదము లుచ్చరించినప్పుడు సైతము జ్ఞల సంయుక్త వర్ణమునకు భిన్నముగా ఉండేదనలేము. ఎందుచేతనంటే ఆంధ్రచ్ఛందశ్శాస్త్రములో యతివిషయమున మైత్రిగల వర్ణములను చేర్చుకొన్నప్పుడు జ్ఞకు చవర్గాక్షరములతోను, తాలవ్య శకారముతోను, శకారము ఊష్మము గనుక దానినిబట్టి తక్కిన ఊష్మవర్ణములైన షసలతోను మైత్రి కల దన్నారు.

నన్నయగారి ప్రయోగాలు చూడండి—

అమ్మనుజేంద్రుఁడైన నలు
యజ్ఞము ధర్మజురాజసూయయ
జ్ఞమ్ముఁ బ్రసాగఁజేసిన ప్ర
జాపతియజ్ఞము శూలపాణియ
జ్ఞమ్మును గృష్ణయజ్ఞము ని
శాకరుయజ్ఞము నీమనోజ్ఞయ
జ్ఞమ్మును బోల్కరూప చుమి
సన్మహిమం గురువంశవర్ధనా!

ఆది. ii ౨౨౨.

జానుదన్న్యందు నిర్మల-జ్ఞానదృష్టి.

అర. iii. ౧౨౭

శ్రీ జోగారావుగారు చెప్పినట్లు జ్ఞకారము ఞకారమే అయిఉంటే పైనిచూపించిన ప్రయోగాలు దుష్టములు కావలసి వస్తుంది. ఞకార మున్నదిగదా దీనితో తాలవ్యవర్గాక్షరములకున్నూ ఊష్మములకున్నూ యతి చెల్లు ననుకోరాదా అని అంటారేమో. ఏవర్గవిషయములోనూ ఇట్టిది చెల్లనప్పుడు ఈ తాలవ్యవర్గ విషయములోమాత్రము చెల్లు ననడానికి తగినకారణం లేదు గనుక జ్ఞ కారములో జకార మున్నదనక తప్పదు.

"జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము కాఁగఁ"

అని తిక్కనప్రయోగం చూపించి ఇదినిశేషవళిగా అప్పకవి పేర్కొన్నాడు. గాని, ఇది సరియైనపాఠము కాదు. ఇది వాస్తవముగా తిక్కనసోమయాజిగారి ప్రయోగమే అయితే, వారికాలానికే జ్ఞకారోచ్చారణము మారినదనిన్ని, అందులో కంఠ్యవర్ణోచ్చారణము పుట్టినదనిన్ని చెప్పవలెను. గాని సందిగ్ధముగా ఉన్న ఈప్రయోగంతప్ప ప్రాచీనకావ్యాలలో మరి ప్రయోగాలు లేవు.

పైని చెప్పినట్లు 'జ్ఞ' తద్భవాలలో 'న్న' కావడం (యజ్ఞము - జన్నము మొ) చూచి, జ్ఞకారనకారములకు మైత్రి కలదనిన్ని అది తద్భవవ్యాజయతి అనిన్ని అప్పకవి పేర్కొని కవిప్రయోగములు చూపించాడు.

ఇటీవల జ్ఞకారోచ్చారణ మెట్లు మారినా సంస్కృతభాషలో అది జకార ఞకార సంయుక్త వర్ణముగానే ఉండేదనిన్ని వ్రాతలో సైతము దేవనాగరిలిపులలోగానీ, దక్షిణదేశపు ఆంధ్రకర్ణాట లిపులలోగానీ ఈ జకార ఞకారములు కనబడుతూ ఉన్నవనిన్ని నేడు నాగరిలిపిలో ఉన్న జ్ఞ వర్ణము జ, ఞ వర్ణముల కలయికవల్ల నేర్పడినదే కాని ఏక వర్ణము కాదనిన్ని చెప్పకతప్పదు.

## ౨. క్షకారము

సం. ౧౯౩౯ అక్టోబరు ౨౫ వ తేదీని ప్రకటితమైన ఆంధ్రవారపత్రికలో ఈ (శ్రీ) చెరుకూరి వేంకటజోగారావుగారే క్షకారమునుగురించితమ అభిప్రాయం తెలియచేశారు. అది శాస్త్రసమ్మతమూ కాదు, అనుభవసిద్ధమూ కాదు. వారి అభిప్రాయసారాంశములు గల నాలుగు వాక్యాలు ఎత్తిచూపి విమర్శిస్తున్నాను:

౧. "సంస్కృతములోను, ఇతర భాషలలోను క్షకు ఏకవర్ణముండి అది యేకస్వరసూచకమై యుండగా తెలుగులోమాత్రము క్షకారమునకు సంయుక్త స్వరకల్పనమును, సంయుక్తవర్ణనిర్మాణమును కలుగుటకు కారకులు పూర్వపు తెలుగుపండితులే యనుట సత్యదూరము కాదని నామతము"

౨. "క్షకారము తాలవ్యమనుట సత్యమేకదా"

౩. "కకు ఖ, గకు ఘ, పకు ఫ, దకు ధ— వీనికెట్టి సంబంధమో షకును క్షకును అట్టి సంబంధమే కలదనికూడ స్పష్టపడును. షను ఒత్తిపలికిన క్ష కలుగుచున్నది."

౪. "క్షకు ష యని వ్రాయుచుండుట యుక్తమని తోచుచున్నది."

వీరి వాదమంతటికినీ ఆధారము ఇప్పుడు క్షకారోచ్చారణము దేశములో వ్రాతననుసరించి లేకపోవడము. ఈ అక్షరము కొందరు ట్షగాను, కొందరు ట్ఛగాను తమ అలవాటుచొప్పున తాము పలుకుతున్నారు నిజమే కాని మనపూర్వులు సైతము మనవలెనే ఉచ్చరిస్తూఉండేవా రనడానికిగానివారి ఉచ్చారణలో క్ష ధ్వని లేనేలే దనడానికిగాని ఆధారం కనబడదు; సరికదా, క్షకారము వ్రాసినట్లు ఉచ్చరించేవా రనడానికి ఆధారం కనబడుతున్నది. క్షకారంలో క ధ్వని ఇప్పుడే కాదు ఎప్పుడూ ఉచ్చారణలో లేదనేవారు అక్షి, పక్షి, భిక్షువు, రాక్షసి, లాక్ష, అక్షరము మొదలయిన సంస్కృత శబ్దములకు ప్రాకృతాది తద్భవరూపాలు అక్కి, పక్కి, భిక్కు, రక్కసి, లక్క, అక్కరము పుట్టడము తెలిసికొన్న యెడల తమ అభిప్రాయం సరియైనది కాదని గుర్తించగలరు.

వ్రాతలో సైతము క్షకారమందు కకార షకారములు రెండున్న అశోకుని కాలమునుండిన్ని కనబడతూనే ఉన్నవి.

దేవనాగరి లిపి

క —

ష —

క్ష —

దాక్షిణాత్య (ఆంధ్రకర్ణాట) లిపి

క్షకార మెన్నడును సంయుక్తస్వరముగానే ఉచ్చారణలోను వ్రాతలోను ఉన్నది; గాని, ఏక స్వరముగా లేదు. దానికి పూర్వమందున్న లఘువర్ణము గురువు అవుతుంది. 'పక్షి' ఇది గురు లఘువులు గలదిగా పాటించినారుగాని రెండు లఘువులు గలదిగా పాటించ లేదు. తద్భవరూపాలలో గల కకార ద్విత్వము సైతము క్షకారమందలి సంయుక్త వర్ణోచ్చారణమును తెలియ జేస్తుంది.

క్షకారములో తాలవ్యధ్వని ఎక్కడ ఉన్నది? కకారము కంఠ్యము షకారము మూర్ధ-జిహ్వోపాగ్రముల అర్ధస్పృష్టమైన కలయికవలన ఊష్మగా వివారశ్వాసరై అఘోషగాను మహాప్రాణధ్వనిగాను పుట్టుతున్నది. ఇందులో తాలవ్య మేదీ?

క్షకారం ఉచ్చరించినప్పుడు అందులోని కకారమునకు కొందరున్నూ, షకారమునకు కొందరున్నూ ప్రాధాన్య మిచ్చి పలుకుతూ ఉండడం చేత ప్రాకృత దేశభాషలలో క్షకారమునకు 'క్క' వచ్చినట్లే 'చ్చ' సైతము వచ్చినది. అందుచేతను అక్షరమునకు అక్కరము వచ్చినట్లే అచ్చరము సైతము వచ్చినది. అట్లే లక్ష్మి — లక్కి, లచ్చి; పక్షి — పక్కి, పచ్చి (నేటివాడుకలో) కొన్నిచోట్ల కకార ప్రాభవముకంటె షకారప్రాభవమే ఎక్కువయి భిక్ష- బిచ్చ, క్షేమము- సేమము మొ. కకారములేని రూపములే పుట్టినవి. ఇందులో చకారము కనబడుతున్నదిగదా అని క్షకారంలో తాలవ్యధ్వని ఉండియుండవలె ననడానికి వీలులేదు. ఈ చకారము తాలవ్యస్వరముతో కూడినప్పుడే తాలవ్య మవుతుందిగాని ఇతరస్వరములతో ఉన్నప్పుడు దంత్యమే. సకారము ఎప్పుడూ దంత్యమే గనుక, తద్భవరూపములనుబట్టి తాలవ్యధ్వని క్షకారములో ఉండేదేమో అని అనుకోడానికి ఆధారమేమీ లేదు.

మను ఒత్తిపలికిన క్ష కలుగుచున్నది అంటారేమిటి జోగారావుగారు! స్పర్శవర్ణములలో అల్పప్రాణములయిన కచటతప గజడదబలకే మహాప్రాణములయినవత్తు ధ్వను లుంటవిగాని, ఊష్మమున్నూ మహాప్రాణమున్నూ అయిన షకారమునకు వత్తుపెట్టడం ఎట్లా? అసంభవము. గనుక, వారిసలహా ననుసరించి ష క్రింద గీత గీచి క్షకారధ్వని పుట్టించడం శాస్త్రసమ్మతమూ కాదు; అనుభవసిద్ధమూ కాదు, కేవలము అసాధ్యము.

క్షకారమందలి కకారధ్వనికే తరుచుగా ఎక్కువ ప్రాధాన్య మిచ్చి నన్నయ వడి పాటించాడు; చూడండి:—

సకలోర్వీశుఁ డతిప్రయత్నపరుఁడై
 సర్వక్రియాదక్షత
క్షకకోటుల్ పనిసేయఁగా ఘనతర-
 క స్తంభ... ఆది. ౨. ౧౪౮

గోత్రమహామహీధరని
 కుంజములకొ విపినంబులంగురు
క్షేత్రమునం ద్రికామగతి-
 ఖేలన నొప్పి సహోక్ష్వసేనుఁడై ఆది. ౧. ౧౦౪

క్షత్రియవంశ్యులై ధరణి-
 గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁ-
 గాఁగల వాలుసజాతులన్. ఆది. ౧౧, ౧౪౩

క్షత్రియుఁ డుద్భవిల్లియు న-
 ఘక్షయకారణుఁడున్. అర. ౩. ౧౩౬

## తెలుగు విభక్తులపుట్టుక

సంస్కృతభాషలో ఉన్నట్టే గ్రీకు లాటిను భాషలలో సైతము ఏడువిభక్తు లున్నవి. ఈ సంప్రదాయమును అనుసరించి ఇంగ్లీషుభాషకు వ్యాకరణము రచించినయెడల ఇంగ్లీషు భాషలో సైతము ఏడు విభక్తు లున్నవని చెప్పవలసివచ్చును. **By him. with him** అనేవి **Instrumental case** లో ఉన్నవనిన్నీ, **from him** అన్నది **Ablative case** లో ఉన్నదనిన్నీ, **in him** అన్నది **Locative case** లో ఉన్నదనిన్నీ ఈవిధంగా చెప్పవలసివచ్చును.

అయితే ఇంగ్లీషుభాషకు వ్యాకరణము వ్రాసిన వారు ఈ సంప్రదాయమును అనుసరించక ఇంగ్లీషు భాషాసంప్రదాయమునే అనుసరించి వ్యాకరణము

వ్రాశారు. అందులో మూడే విభక్తు లున్న వన్నారు: **Nominative Case, Objective Case Possessive Case** ప్రాచీనకాలమందలి ఇంగ్లీషుభాషలో **Dative Case** కూడా ఉండేది; గాని రాను రాను ఆ విభక్తిలో ఉండే రూపము **Objective Case** లోని రూపముగా మారిపోయినది.

అర్థవివక్ష కావలసివచ్చినప్పుడు ఆరూపానికి **to** చేర్చుకొంటారు. ఉ. **he gave me a book; he gave a book to me.**

ఇంగ్లీషుభాషకు చేసినట్లే తెలుగుభాషకు కూడను భాషాస్వరూపాన్ని బట్టి విభక్తులను ఏర్పరచవలసి ఉండెను. ఆవిధంగా ఏర్పరచిన యెడల తెలుగులో వాలుగే విభక్తు లున్న వనవలెను: ప్రథమ, ద్వితీయ, చతుర్థి, షష్ఠి అనే విభక్తులకు సరియైనవి. ఉ. నేను, నన్ను, నాకు, నా; వాడు, వానిని, వానికి; వాని. రాముడు, రాముని, రామునకు(-నికి) రాముని; సీత, సీతను, సీతకు; కాలు, కాలిని, కాలికి, కాలి.

ప్రత్యయములవల్ల ప్రకృతిస్వరూపము మారి ఏర్పడ్డ విభక్తిలక్షణమే చూచుకొంటే శ్రీనివాసరావుగారు చెప్పినట్లు 'ని (ను)', 'కి (కు)' ఈ రెండే విభక్తిప్రత్యయాలు. 'ఇ' 'అ' అనేవి సంబంధమును తెలియజేసే ప్రత్యయాలు. 'డు', 'ము', 'వు'—ఇవి ప్రథమావిభక్తిలో ఏకవచన ప్రత్యయాలు. రాముడు, ఫలము, గురువు. 'లు' బహువచన ప్రత్యయము.

తక్కిన విభక్తులు సంస్కృత సంప్రదాయమును అనుసరించి చెప్పినవే కాని ఆ విభక్తిరూపాలు ప్రత్యయములవల్ల ఏర్పడ్డవి కావు. సంస్కృతభాషలో ఏ అర్థమందు ఏవిభక్తిరూప మున్నదో ఆ అర్థమునకు సరిపడు పదములను చేర్చి ఆ విభక్తిరూపములను చూపించి తక్కిన విభక్తులకు సరిపెట్టుకొన్నారు. **By him** అనేది **Instrumental Case** లో ఉన్నది అనడము ఎంత సబబుగా ఉంటుందో 'నాచేత' అనేది తృతీయావిభక్తిలో ఉన్నది అనడము అంత సబబుగా ఉంటుంది.

'అందు' సప్తమీవిభక్తి ప్రత్యయ మంటే, 'అందులో'—ఇందుగల 'అందు' ఏమంటాము? 'లోపల' షష్ఠీవిభక్తిప్రత్యయ మంటే, 'లోపలిసామానం బులోన వర్తింపంగ'లో గల 'లోపలి' ఏమంటాము? 'చేత' తృతీయావిభక్తిప్రత్యయ మంటే 'చేత నొక కాసైనలేదు'లో 'చేత' ఏమంటాము? ఈవిధంగానే తక్కినవాటిని గురించి కూడా అడగవచ్చును. తెలుగు భాషకు రచించవలసిన వ్యాకరణము సంస్కృతవ్యాకరణ సంప్రదాయము ననుసరించి రచించడంకంటె తెలుగుభాషాలక్షణానికి అనుకూలముగా రచించడం మంచి దనడానికి ఈ విభక్తివిషయచర్చ ఎంతో ఉపకరిస్తుంది.

---

# గ్రంథస్వీకారం

**ప్రేమమయిరాధ:**—కృతికర్త: శ్రీ చిర్రావూరి కామేశ్వరరావుగారు. ప్రకాశకులు, ఆంధ్రభాషావిలాసినీ సమాజంవారు గంజాం జిల్లా, బరహంపురమని వ్రాసిన గ్రంథములు దొరకగలవు. వెల ఆరణాలు.

**వ్యవసాయశాస్త్ర ప్రథమపాఠములు:**—గ్రంథకర్త: శ్రీ రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారు. మేనేజరు, గ్రామసేవా ముద్రాలయము. కొండెవరం (via) పిఠాపురం. తూర్పుగోదావరిజిల్లా అని వ్రాసిన గ్రంథములు లభించును. వెల రు ౧-౦-౦.

**చినుకులచిందులు:**—రచయిత: పిఠాపురం యువరాజుగారగు శ్రీ రావు వేంకటమహీపతి గంగాధర రామారావుగారు, మదరాసు, త్యాగరాయనగరు - రామరాయముద్రణాలయమున ముద్రితము. అమూల్యము.

**దూతఘటోత్కచము:**—రచయిత్రి: శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు. కవితాసమితి వారిచే ప్రకటితము. సుప్తా బ్రదర్సు, బుక్సెల్లర్సు-విశాఖపట్టణము-అని వ్రాసిన గ్రంథములు దొరుకును. వెల రు. ౦-౮-౦.

**కవిత:**—గ్రంథకర్త: శ్రీ కాజ రాధాకృష్ణ శాస్త్రిగారు. ప్రకాశకులు, కాజ సచ్చిదానందంగారు. చెమ్మనగిరిపేట. మచిలీపట్టణము. వెల రు ౦-౮-౦.

---

# పుస్తక సమీక్ష

## ప్రతీక్ష

ఖండకావ్య సంపుటి. శ్రీ రెంటుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రిగారు రచించినది. గుంటూరు కల్లోలినీ గ్రంథమాలలో 3 వది. వెల అర్ధ రూపాయి.

సుప్రసిద్ధుడైన కవిలో గుణము లందఱును గనిపించును. కాళిదాసు, నన్నయ, తిక్కన వీరి రచనలలో గొప్పతనములుగాని, వారి ప్రతిభను గూర్చి గాని ప్రతివాడును చెప్పెడివాడే. అది తెలిసి చెప్పుటయో, తెలియక చెప్పుటయో. తెలిసి చెప్పుటయైనచో తాదృశగుణములు కల పెరచోట్లగూడ చెప్పవచ్చును. ప్రతిష్ఠితులైన కవులలో మనము గుణదోషములెన్నుట లేదు. తల్లియందువలె, తమ్మునియందువలె రక్తసంబంధమే విషయవిచారణమును మానిపించి సహజప్రేమ వెల్లడించినట్లు పూర్వకవులయందు ఒక సహజగౌరవబుద్ధి ప్రకటింతుము. పత్నియందు, ఇతరస్త్రీయందు గుణదోషములు విచారించినట్లు, సుప్రతిష్ఠితుడు గాని కవిని విచారింతుము. అందును ఇతరులయొక్క లోపములనే విచారించినట్లు, అప్రసిద్ధుఁడు సమకాలికుఁడునైన కవియందు దోషములే చూతుము. పూర్వకవులయందు గుణములే చూతుము. ఆగుణములవంటి గుణములు లాతికవియం దున్నచో నేల మెచ్చుకొనరాదు. అతని కవితాగుణము నేల పేర్కొనరాదు. ఈ కవి యున్నాడు. ఈయన ఒక యువకుడు. ఇది యీయన వ్రాసిన మూడవ గ్రంథము. ఇందులో ఈయనరచన మంచి యుత్కృష్టస్థితిని పొందినది. పద్యరచనలో ఉత్తమజాతివైన మెలకువలు గ్రహించినాడు. మధురమార్గముగగాక ప్రౌఢమార్గమున చక్కనిశయ్య సంపాదించినాడు. అందందు అల్పమైన దోషములు గలవు. ఎవనిలో లేవు. ఇతరుల గ్రంథములయందు దోషములు చూపింతుమని కంకణములు దాల్చినవారి గ్రంథములలోఁగూడ నిబ్బడి ముబ్బడిగా నుండును. దోషములు రకరకములుగా నుండును. ఔచిత్యదోషము, కథాసంవిధాన దోషము, అప్రయోజ్యదోషము. ఇట్లుండగా ఒక్క వ్యాకరణదోషమే తడువుట యేల! "సార్థకించు" అని యీకవి ప్రయోగించెను. ఇదీ వీరియందు అప్రయుక్తదోషమున్న దనవచ్చును. అప్రయుక్తము అసలు దోషమే కాదు. ఆమాటకు వ్యాప్తి లేదు. "చెకడువారెనో" "వారదినో" అనుటకు వాడుకమాట. "కానిమ్ము", "కానీ" అయినట్లుగా అందందు వ్యాకృతశబ్దములలోఁగూడ ఇట్టి చ్యుతి గాన వచ్చుచున్నది. కవిమార్గము రసవంతముగా నున్నదా లేదా అన్నప్రశ్నగాని యిట్టి అల్పవిషయచర్చ, శిల్పప్రయోజనకారి గాదు. చ్యుత సంస్కారము రసభంగహేతువు కాదా యన్నచో సంస్కార మర్యాదాస్వరూపము, రసమహోవిషయమున చ్యుత సంస్కారశబ్దప్రయోగజనిత రసభంగ లేశ భావము విచారించవలయును. "వికృతరూపి," "వ్రాతు" మొదలైనవి దోషములు కాకుండనే పోయినవి.

ఈయన మొదటనే గునుగుసీస మెత్తుకొన్నాడు. పాదాంతవిరతి లేని సీసము. కవిమొగ్గ యేవైపునకు గలదో చూడవచ్చును. మధురమార్గముకన్న ప్రౌఢమార్గమని వెంటనే తెలియఁగలదు. ఈయన కవితాశక్తి మిక్కిలి గొప్పది.

" నాప్రాలు మెడను త్రిప్పి
తీర ఓయిన రొలుగు కుంచించి పోయ
టన్న దూరాన వాకేక కద్రిరాజు
నిద్రలేచి తలెత్తి కన్విచ్చిచూచె."

ఈ భావము "అపిగ్రావారోదితి" అన్నట్లుగా ఉన్నది.

"కోమలరసాల కిసలయ గుచ్ఛములను
గలుగు మధురిమ మప్పికొంగన యెఱుంగు
కవికుమారుని భావరేఖల స్ఫురించు
ప్రణయమాధురి తత్ప్రియాంగన యెఱుంగు."

ఈ పద్యములో "సమత" యెంత చక్కగా నిర్వహింపబడినదో చూడుడు.

ఒక జనసమూహమును వర్ణించుచు

"ఇమ్మహోజనాగ్న్యశ మీనికేపునుదయ
కిరణ శోచిర్ధవళితమ్మ, క్షీరజలధి;
కాదదే యుష్ణకరమయూఖాళి కరగి
నేల జారెడు కైలాసనిర్మల గిరి"

ఇట్లు వ్రాసినాడు. మహోజనము వెలపొడుపునకు పొంగిన, తెల్లవడిన పాలకడలివలె నున్నది యట. కానిచో ప్రొద్దువేడికి గరిగిన వెండికొండల వలె నున్నదట. ఇది లోకోత్తరమైన భావము. భారతదేశమునందు పుట్టిన పరమోత్తముడైన కవికిఁ గలుగు భావము.

ఇందలి ప్రతి శీర్షికయు నిగూఢమైన ఒక చమత్కారభావముతో నిండియున్నది.

మరియు "జితాంతుడు" అన్న పద్యాలరచన శ్రీ నాథుని యుత్తమరచనవలె నున్నది. రెండవ పద్యములో "సప్త మహోదధిఘోషిత స్వకీయాజివల్క లస్త్రులనె? అన్న సమాసపు కూర్పు మహాకవి కూర్పుగా నున్నది.

"దివ్యాకృతీతోయము" "నిరాశే" ఈ రెండు దోషములు ఈ పద్యాలకు నిజముగా కొంచెము కళంకమే తెచ్చుచున్నవి.

కొన్ని సామాన్యపు మాటలలోగూడ ఈయన కొక వ్యక్తిత్వ మున్నది. "దిగ్దంతిగమన, "విశాలేల" (విశాలధాత్రి) యనుటకు.

ఓపిక కలవారు, కావ్యజ్ఞానము చక్కగా కలవారు, అల్పదోషములకు పట్టింపు లేనివారు, అప్రసిద్ధుడని, యువకుడని పోయితోలగనివారు ఈ గ్రంథము చదివినచో మిక్కిలి యానందింతురని నా యుద్దేశ్యము.

విశ్వనాథ సత్యనారాయణ

---

## విద్యుచ్ఛక్తి—నిస్తంత్రీయోగము

గ్రంథకర్త—శ్రీ నుల్లపల్లి నారాయణ మూర్తిగారు L. M. & S. అనకాపల్లి (విశాఖపట్నం జిల్లా.) వెల రు. ౧-౮-౦.

శ్రీ నుల్లపల్లి నారాయణమూర్తిగారు ఇదివరకు సాంఘిక విషయాలను గురించి చక్కని కథలు వ్రాసి పాఠకలోకానికి పరిచితు లయ్యారు. ప్రకృతిశాస్త్ర విషయాలను, అందరికి తెలిసే విధంగా సులభశైలిలో వ్రాయ మొదలిడినందుకు వందనీయులు — ఇది వారి ప్రథమప్రయత్నం.

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు, సులభశైలిలో సుబోధకంగా వుండేలాగున "విద్యుచ్ఛక్తి-అయస్కాంతము", "నిస్తంత్రీయోగము" అను శీర్షికలపైని చక్కని వ్యాసములకు బహుమతి ఇస్తామని ప్రచురించియుండిరి. తత్ఫలితంగా తయారయి, 1937 లో మొదటి వ్యాసమున్ను, 1939 లో రెండవవ్యాసమున్ను, విశ్వవిద్యాలయంవారిచే ప్రథమబహుమతిని పొందుటకు అర్హములుగా పరిగణింపబడి, శ్రీరామా రాయణింగారి పేరున ఈయబడుచున్న ఐదేసి వందల రూపాయల బహుమతులను పొందిన వ్యాసములు ఇవి. వీటిని రెంటిని సంపుటీకరణం చేసి "విద్యుచ్ఛక్తి నిస్తంత్రీయోగము" అనే పేరుతో యిప్పుడు ప్రకటించారు. పెద్దవిద్యాలయంలో మెచ్చుగీటు బడసిన ఈ వ్యాసాలను యిప్పుడు విమర్శించబూనడం సాహసం.

ఒక పాశ్చాత్యప్రకృతి శాస్త్రజ్ఞుడు (ఫ్రాంక్లిను మహాశయుడు అనుకుంటాను) "తన పరిశోధనాఫలితమును, వీధిలో కనబడిన ప్రతివానికిని బోధించగలవాడే నిజమయిన పరిశోధకుడు" (The true discoverer is one who can explain his discovery t) the first man he meets in the steet) అన్నాడు. శ్రీ నారాయణమూర్తిగారు పరిశోధకులు కాకపోయినా పైవాక్యంలోని ఉత్తరార్ధాన్ని అమలులో పెట్టడానికి యత్నించారు. చాలాభాగం వారిఉద్దేశం నెరవేరిందని చెప్పకతప్పదు. ఏమాత్రమైన తెనుగు చదువుకొని అర్థంచేసుకొనే ప్రతివానికికూడా అర్థమయే సులభశైలిలో వ్రాశారు. రచనశాస్త్రీయం కాకుండా చాలవరకు సాధారణ భాషలోనే వుంది. సాధ్యమయినంతవరకు సాంకేతిక భాషను వదిలారు.

విషయం అర్థంచేసుకోడానికి కొన్ని శాస్త్రీయ పదాలు వాడక తప్పింది కాదు. వీరు ఈ వ్యాసాలు వ్రాసేసరికి ఇంకా శాస్త్రీయపదాలకు

పర్యాయపదాలు తెలుగులో విరివిగా వాడుకలోకి రాలేదు. ఈనాటికికూడా ఒక కట్టుబాటుకులోనైన శాస్త్రీయపదాలు రాలేదనే చెప్పవచ్చు. కనుక వీరికి అనుకూలమైన విధంగా కొన్ని శాస్త్రీయ పదాలను తర్జుమా చేశారు. తర్జుమాలో కొన్ని చోట్ల అసలుపదం యొక్క పూర్తిభావం (The full Import) రాలేదని అనుమానం. మాదిరికి ఒకటి రెండు ఉదాహరణల ఇస్తాను. "అవిద్యుద్వాహకము. (Bad Conductor) అంటే విద్యుత్తును వహించనిది అనిఅర్థం ఇస్తుంది. అట్టి పదార్థమే లేదు. ప్రతి వస్తువుకు కొద్దిగానో గొప్పగానో "నిరోధం వున్నది" దాని ననుసరించి అన్ని పదార్థాలు కొద్దిగానో గొప్పగానో విద్యుత్తును వహిస్తాయి. ఇటీవల ఈ పదానికి "విద్యున్నిరోధకములు" అని వాడుతున్నారు. ఈపదం ఎక్కువ సమంజసంగా కనబడుతుంది. నారాయణమూర్తిగారుకూడా "అవిద్యుద్వాహకములు" అను శబ్దానికి "విరోధం" ఎక్కువ కలిగించేవి అనే వ్యాఖ్యానం ఇచ్చారు. "విద్యుత్తరంగములు" అని వేరొకపదం. ఇంగ్లీషులో ఈ పదానికి సరియైనది Electro_Magnetic waves. విద్యుత్తుకు అయస్కాంతలక్షణానికి "వాగర్థావివ" అవినాభావసంబంధం వుంది. ఈ సంబంధం తెలియ చేస్తుంది ఇంగ్లీషుపదం. శ్రీనారాయణమూర్తిగారి "విద్యుత్తరంగములు" అన్న పదంలో దోషం లేదు కాని అంత భావం లేదేమోనని నా భయం.

గత రెండు మూడు ఏళ్లలో తెలుగులో ప్రకృతి శాస్త్ర పఠనీయ గ్రంథాలు చాలా (Text books) వెలువడ్డాయి. అందులోని పర్యాయ పదాలను కూడాచూచి అనుకూలమయినవిధంగా సవరిస్తే చదువరులకు చాలా సదుపాయం.

నారాయణమూర్తిగారు, 'ఉరుము'ను గురించి బోధించవలసి వచ్చినప్పుడు ఉపన్యాసధోరణికి దిగారు. కొన్ని స్థలాలలో పఠనీయగ్రంథకారకులవలె దిగి ప్రాక్టికల్ ట్రీటైజ్ (Practical treatise) విధంగా "చేయుము" "అమర్చుము" అని ఎదురుగావుండే చదువరిని దృష్టిలో వుంచుకొని వ్రాశారు. ఈ రెండిటికన్న నారాయణమూర్తిగారు తమకు సహజమున్న చదువరులకు ఆకర్షణీయమున్నా అయినకథల ధోరణిలో వ్రాసివుంటే మరింత రుచిగా వుండేది. కాని శాస్త్రగ్రంథాలలో ఆకథలధోరణి బహుకష్టం. ఇకముందు నారాయణమూర్తిగారు ఆరుచినికూడా మనకు చూపించగలరని పూర్తిఅయిన నమ్మకం వుంది.

టెలిగ్రాములే ఆశ్చర్యజనకంగా వుండేవి. టెలిఫోనులు వచ్చాక ఈవింత మరీ హెచ్చయింది. ఈనాడు రేడియోలు విన్నవారికి వారివల్ల ఈ ముచ్చటలు తెలుసుకొన్న వారికికూడా "వేలకొద్దిమైళ్ల అవతల పాడేపాట, అనేమాట" తీగెనా లేకుండా ఎలా వినబడుతుందా" అనేఆశ్చర్యం పోగొట్టి, ఇది ఏలా సాధ్యమైందో అతిసులభంగా బోధిస్తుంది ఈ పుస్తకం. అన్నిటిని మించినవింత "దివ్యదృష్టి" (Television) నికూడా బోధించారు. వారు వ్రాసినట్లు ఈపద్ధతి ఇంకా ఈదేశంలోకి రానికారణంచేత కాబోలు ఈభాగం కటువుగా వున్నది. ప్రయాణంచివరనే బడలికఎక్కువ. అలాగే పుస్తకాంతమునందే ఓర్మితక్కువ. ఈభాగం ఇంకొకసారి విపులంగా వ్రాసిబోధిస్తారని నమ్ముచున్నాను.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈనాడు విద్యుచ్ఛక్తి అందరిజీవితాల్లోను చొచ్చుకుపోయింది. ఒక మహావిద్యుద్యుగంలో ఉన్నాం అంతా.

గ్రంథకర్తగారు చెప్పినట్లుగా రేడియోకూడా నిత్యజీవితంలో ఒకభాగమైపోయింది. "వార్తాపత్రికలు మూలబడేరోజులు వచ్చాయి" ప్రపంచంఅంతా మనయింటిలోకి వినబడుతూంది కనబడుతూంది. ఇట్టిపరిస్థితులలో ఈ విద్యుత్తంటే ఏమిటో ఎట్లుపుడుతుందో, ఎట్లు మానవునకు వశమౌతూందో, ప్రపంచాన్ని మనయిళ్లలోకి ఏలా తేగలుగుతున్నామో అన్న విషయాలు అందరికీ తెలియపరచడం చాలాఅవసరం. ఈపనిని నిర్వహిస్తూ వీరు ఆంధ్రులకొరకు చేసిన ఈ అమూల్యమైన సేవకు వీరెంతయు ప్రశంసాపాత్రులు ఇకముందుకూడ ఇట్టి సేవలనుచేస్తూ ఇప్పటివలెనే ఆంధ్రపాఠక లోకం యొక్క ఆశీర్వాదాలను పొందుచుందురుగాక!

కన్నేపల్లి సత్యనారాయణ.

---

## ఆంధ్ర వీరకుమార శతకము

కృతికర్త: శ్రీ బి. సూర్యనారాయణమూర్తిగారు; వెల నాలుగణాలు; ప్రతులు కావలసినవారు 68, మేడాక్సువీధి, వేపేరి, మద్రాసులో ఉన్న గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించుకోవచ్చును.

ఇది 'ఆంధ్ర వీరకుమారా' అనే మకుటముతో ౧౧౧ కందపద్యములు గల శతకము. దీనికి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు తొలిపలుకు రచించి "వీరి కవిత్వములో ఒక అపూర్వమైన మెత్తందనము కనబడుతుంది" అనిన్ని, "ఆడంబరము లేని సరళత్వమూ, ఒయ్యారము లేని మృదుత్వమూ వీరికవితయొక్క ప్రత్యేకత" అనిన్ని మెచ్చుకొన్నారు వారి మెప్పు వట్టి పొగడిక కాదు.

"గానామృతంబు భక్తి
ధ్యానామృత మొకటిగాఁ బ్రజావళిఁ దేల్పం
బూనిన త్యాగబ్రహ్మకు
వే నతు లర్పింపు మాంధ్రవీరకుమారా!"

ఈ విధంగా అనేక పద్యాలు గుర్రము కదం తొక్కినట్టు నడుస్తూ ఉన్నవి.

మూర్తిగారు తమకుగల ఆంధ్రాభిమానము ఆంధ్రు లందరిహృదయములలోను ప్రతిఫలించేటట్టు ఆంధ్రుల చరిత్రలోను, ఆంధ్రుల జీవితంలోను ఆంధ్రులు గర్వించి చెప్పుకోదగిన విషయములు యథోచితంగా పేర్కొని వర్ణించారు. ఈశతకములో ఆంధ్రభాషకు, ఆంధ్రమహాకవులకు, ఆంధ్రక్షేత్రములకు, ఆంధ్రమహాపురుషులకు, ఆంధ్రుల దేశభక్తికి, ఆంధ్రనారీమణులకు, ఆంధ్రహరిజనులకు, ఆంధ్రపూర్వోన్నతికి, ఆంధ్రుల దైన్యమునకు, ఆంధ్రప్రతాపమునకు, ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన పద్యాలు ఆయా 'తల సీల'ల క్రింద పొందుపరచారు. తమ ఆంధ్రాభిమానము సంకుచితమైనది కాదని సూచించడానికి యావద్భారత దేశభక్తి మెట్టమొదటనే ప్రబోధిస్తూ శతక మారంభించారు.

ఆంధ్రమహాకవులలో నన్నయ, తిక్కన, శ్రీనాథ, పోతన, వేమన, త్యాగయలనుమాత్రమే ఎత్తుకొన్నారు. ఒకొక్క కవితాశక్తికి ఒకొక్కరిని మార్గదర్శకునిగా సూచించదలచినారు కాబోలు. ఆంధ్రమహాపురుషులక్రింద చెప్పినపద్యాలలో సారంగధరునికి సంబంధించినపద్యము లేకుంటే బాగుండును. సారంగధరకథకు చారిత్రకాధార మేమీ లేదు. రుద్రమదేవికి సంబంధించిన పద్యము ఆంధ్రనారీమణులకు సంబంధించిన పద్యాలలో చేర్చక ఆంధ్రమహాపురుషులకు సంబంధించిన పద్యాలలో ఎందుకు చేర్చారో తెలియదు.

"చీరాల శాంతిసమరము" అనే పద్యంలో వాక్యాన్వయము సరిగా లేదు "ఆరాట మొందఁజేసిన"ది సమరమా? వీరుఁడా? సంస్కృతభాష, ప్రాచీనాంధ్ర భాష లెస్సగా అభ్యసిస్తేనేకాని అవి నిత్యవ్యవహారంలో ఉండే మన తెలుగుభాషవలె సులువుగా పట్టుపడేవి కావు. అవి చక్కగా రానిరచయితలు అందులో స్వతంత్రించి రచనచేయబోతే తప్పులు తప్పవు. "మన తెన్గుదేశము... అనన్యమహితము ... సజ్జనబృంద సమాధీనము" అంటే అర్థ మేమి? "నిజతేజో పాతకోటి"—'తేజస్'శబ్దము. 'సంపూర్ణస్వారాజ్యము'—స్వరాజ్య మనవలెను. స్వారాజ్యమంటే స్వర్గము. 'సంతతమప్రఖ్యాతికి'—'అపఖ్యాతి' అనడం మంచిది. 'నరలలు బిరికి చెగనాడు' — 'పిరికి' ఇది విశేషణము. ప్రథమమీద 'పి' కి 'బి' ఎందుకు కావలెను? 'పసిబిడ్డఁబోలు భావము' — భావము దేనిని పోలినది? 'స్రామాట్' తప్పు 'సమ్రాట్' అనవలెను. ఇటువంటి దోషములు ఇంకా కొన్ని ఉన్నవి. ఇవి సవరించుకొని నిర్దుష్టముగా గ్రంథము మరల ప్రకటిస్తే మంచిదని మా హెచ్చరిక.

"మదరాసు తెల్గువారిది", "ఆంధ్రరాష్ట్రమున ముఖ్యపురంబు" ఈ మాటలలో మన ఆంధ్రుల ఆశయములు ముఖరితములగుతున్నవి. మొత్తముమీద మన హృదయతంత్రులను కంపింపజేయగల భావాలతో పద్యములు హృద్యముగా రచించి, ఆంధ్ర వీరకుమారుని రంజింపజేయగల శతకమును ప్రకటించినందుకు కవిగారిని అభినందిస్తున్నాము.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.